# చతుర

ఆగస్టు 1978

సంపుటి 1 సంచిక 7

## ఈ నెల సమగ్ర నవల

అగ్నిసాక్షిగా పెళ్ళాడి కాపురంచేస్తున్న భర్త అకస్మాత్తుగా తాను మరొకర్ని ప్రేమిస్తున్నా నన్నాడు. ఆవిడను మరచి పోగలగటం, ఆవిడ లేకుండా బ్రతకటం అసాధ్యమన్నాడు. సరే! ఆవిడతోనే కాపురం పెట్టి హాయిగా బ్రతకండని చెప్పి, అలా అని రాసిచ్చి మరీ వచ్చేసిందామె తీరా వచ్చేశాక, జీవితం అంటే ఏమిటో తెలిసి వస్తున్న తరుణంలో, తీరం ఎటా అని వెదుక్కుంటూ బయలు దేరిందా....

## ఎదురీదిన కెరటం

**ఆ ఎదురీదే ప్రయత్నంలో ఎన్నెన్ని ఎదురు దెబ్బల్ని, హృదయా ఘాతాల్ని ఎదుర్కోవలసి వచ్చినా చలించక నిలిచిన యువతి ధీరోదాత్త గాథ....**

## యామిని

రచించిన రసవత్తర నవల ఈ నెల చతుర సమగ్ర నవల

**ఎదురీదిన** కెరటం

## ఈ నెల ముఖ పత్రం :

ఈ విశాలవిశ్వంలో అనేకానేక రకాల నాగరికతలు వేర్వేరు కాలాల్లో వర్ధిల్లాయి. వీటిలో కొన్ని ఇటీవలనే వెలుగులోకి వచ్చినవీ ఉన్నాయి. ఇలా బయట పడిన ప్రాచీన శిల్పచిత్రాల అధ్యయనం వలన ఎన్నో క్రొత్త విషయాలు బయట పడుతున్నాయి. ఈనాటి ఆధునిక చిత్రకారుల 'మాడరన్ ఆర్టు' ను తలపింప జేస్తున్న ఈ చిత్రం దాదాపు రెండువేల ఏండ్లపాటు కొలంబియా ప్రాంతపు 'టిటికాకా సరోవర తీరాన వర్ధిల్లిన 'టియాహువానానో' నగర శిథిలాల్లో బయల్పడిన సూర్యదేవాలయం గోడమీద చిత్రించబడి ఉంది. ఆ ప్రాంతాన్ని సృష్టించిన దేవుని ప్రతిరూపంగా అనాటి ప్రజలు ఈ చిత్రాన్ని రూపొందించి పూజించారు.

## రెండవ కవరు :

దక్కన్ కళా సంప్రదాయాలకు ప్రతీకగా నిలిచిఉన్న చార్‌మినార్ తాలూకు నాలుగు 'మినార్' లలో ఒకదాని పైగల వాస్తుశిల్పం.

## మూడవ కవరు :

రాజపుత్ర వీరగాథలతో సుప్రసిద్ధమైన చిత్తోడ్‌లోని విజయ స్తంభం. అనాటి హిందూ వాస్తుశిల్పానికి ప్రతీక.

## నాలుగవ కవరు :

కర్ణాటక రాష్ట్రంలోని సుప్రసిద్ధ శిల్పకళా కేంద్రమైన బేలూరు చెన్నకేశవాలయంలోని అసంఖ్యాక శిల్పకృతులలో ఒకటి.

చందమామ

ఈనాడు కాంపౌండ్

సోమాజిగూడ, హైదరాబాద్–500 004

# ఉక్రోషం

జగన్నాధం ఇంటికి బయల్దేరే సరికి బాగా పొద్దుపోయింది. చివరి బస్సులో ఎక్కి కొంత దూరం వచ్చాడు. తనుండే కాలనీదాకా బస్సు వెళ్ళదు. అందుకని దాదాపు ఓమైలు దూరం పెద్ద మైదానం లోంచి నడిచి వెళ్ళాలి. అప్పటికే టైం పన్నెండు కావొస్తున్నది. బస్సు తిరిగి వెళ్ళిపోయింది. జగన్నాధం ఇంటి దిక్కు నడవ సాగాడు. కటిక చీకటి మైదానమంతా నిర్మానుష్యంగా ఉన్నది. అలవాటైన దారే కాబట్టి జగన్నాధం వేగంగా నడిచి పోతున్నాడు. అంతలో అకస్మాత్తుగా ముగ్గురు దొంగలు జగన్నాధాన్ని చుట్టుముట్టారు. వాళ్ళలో ఒకడు ముందుకి వచ్చి "గురూ జేబులో వున్నదంతా మర్యాదగా ఇచ్చెయ్యమ్మా" అన్నాడు వెక్కిరింపుగా. జగన్నాధానికి ఒళ్ళు మండింది. "ఇవ్వకపోతే ఏం చేస్తావు?" అన్నాడు. దొంగ జగన్నాధం గూబగుయ్యిమనేట్లు ఒకటి కొట్టి "ఇలా చేస్తానురా దవ్వా" అన్నాడు. జగన్నాధం రక్తం ఉరకలు వేసింది. వెంటనే అదే పద్ధతిలో దొంగ గూబని అదరగొట్టి "అప్పుడు నేను ఇలా చేస్తానా డివ్వా" అన్నాడు. వెంటనే మిగిలిన దొంగ లిద్దరూ జగన్నాధం మీద కలబడ్డారు. ఇద్దర్నీ చెరో చేత్తో డిష్కుం డిష్కుం కొట్టి ముందుకొస్తున్న మూడోవాణ్ణి బూటుకాలితో పొట్టలో తన్నాడు. వాడు వెల్లికిలా పల్టీ కొట్టాడు. అంతలోనే ఇద్దరూ మళ్ళీ జగన్నాధం మీదికి దూకారు. జగన్నాధం సమయస్ఫూర్తితో ఇద్దరి తలకాయల్ని రెండు చంకల్లో ఇరికించుకుని, ఒకడి తల మరోడితలతో ఢీకొడుతూ, ఉక్కిరి బిక్కిరి చేస్తూ, లేచి మీదికి రాబోతున్న మూడో వాణ్ణి మళ్ళీ బూటు కాలుతో పొట్టలో తన్నాడు. ఇలా పావుగంట సేపు హోరా హోరీ పోరాడింతర్వాత, చివరికి జగన్నాధం దొంగలకు లొంగిపోయాడు. ఇద్దరు దొంగలు జగన్నాధాన్ని పెడరెక్కలు విరిచి పట్టుకున్నారు. మూడోవాడు జేబులు వెతికి రెండురూపాయల చిల్లరతీసి, జగన్నాధం ముఖం చూస్తూ, "ఏరా ఈ ముష్టి రెండురూపాయల కోసమా యుద్ధం



చేశావు" అన్నాడు హేళనగా. జగన్నాధానికి ఉక్రోషం ఉడుకెత్తింది. కోపంగా దొంగని చూస్తూ "నోర్ముయ్యరా వెధవా నేనేం తెలివి తక్కువ దద్దమ్మ ననుకున్నావా? మీరు రెండురూపాయల కోసం నావెంట బడ్డారని నాకేం తెలుసు. లోపలి జేబులో దాచుకున్న ఐదువందల కోసం వెంట బడ్డారనుకున్నాను గానీ" అన్నాడు జగన్నాధం.

—భావన

# ట్రాన్స్‌ఫర్

సుబ్బారావు తన ట్రాన్స్‌ఫర్ సంగతి విన్నప్పట్నుంచి దిగులుగా ఉన్నాడు. ఆఫీసుకొచ్చి, రెండు కాళ్ళూ కుర్చీమీద పెట్టి, ఫైళ్ళు పక్కకు నెట్టి, దీనంగా ముఖం వేలాడేసుకూర్చున్నాడు. అప్పటికే నాలుగుసార్లు కాఫీ తాగాడు. నాలుగు కడవల కన్నీళ్ళు కార్చాడు.

పక్క సీట్లో ఉండే ఎల్డీసీ వెంకటేశం దగ్గరికొచ్చి ధైర్యం చెప్పాడు. యూడీసీ ఉదయమూర్తి ఓదార్చేడు. ఎకౌంటెంట్ యలమంద కోపంతో కసిరాడు.



"అందరితోనూ మర్యాదగా ప్రవర్తించమని నేను మొదట్నుంచీ అఘోరిస్తున్నా! ఆ పాత ఆఫీసరు మంచివాడు కాదు, ఎప్పుడో ఒకప్పుడు వాడి కింద పనిచెయ్యవలసి వస్తుందని చిలక్కి చెప్పినట్టు చెప్పినా వినకుండా, నువ్వు వాడు వెళ్ళిపోయినప్పుడు 'సెండాఫ్' పార్టీలో నోటికొచ్చినట్టు మాట్లాడావ్! ఇప్పుడు వాడి దగ్గర ఎలా పనిచేస్తావ్ మళ్ళీ? చేసిందానికి అనుభవించు" అంటూ మాటల పోట్లుపొడిచాడు టైపిస్ట్ తాతారావ్.

"నా బాధంతా నాకు ట్రాన్స్‌ఫర్ అయిందనీకాదు, పాత ఆఫీసరుగాడి దగ్గర పని చెయ్యాలనీకాదు. నేను ముఖ్యంగా బాధపడేదీ..." ఆగాడు సుబ్బారావు

అందరూ ఆతృతగా చెవులు రిక్కించి వింటున్నారు.

"నాకు ట్రాన్స్‌ఫర్ అయింది 'తిరుపతి'కి. అసలే నాకు పరమభక్తులైన బంధువర్గం ఎక్కువ. వాళ్ళ తాకిడికి తట్టుకుని అక్కడ ఎలా బ్రతగ్గలననేది నా అసలు బాధ!" అని మళ్ళీ కుర్చీలో కూలబడి బారీఎత్తున బాధపడసాగేడు సుబ్బారావు.

—కిల్లాన మోహన్‌బాబు

# బాధ్యాత

తొలి రాత్రి శోభనం గదిలో రామకృష్ణని చురుకుగా చూసింది సుమిత్ర. ఆ చూపు సదరు శోభన పెళ్ళికొడుక్కి మరని తూపులా గుండెల్లో గుచ్చుకుని గిలిగింతలు పెట్టింది. గవర్నమెంటెన్ని శాసనాలు చేసినా పట్టించుకోని పనిని, ఒక్క ఆడది ఓరచూపు చూసి మగాడితో చేయించేస్తుంది.

ముద్దుముచ్చట, కబుర్లూ కాకర కాయలూ- అన్నీ అయింతర్వాత సుమిత్ర గోముగా అడిగింది రామకృష్ణని "మీ జీతమెంత?" అని. అతను చెప్పాడు.



అంతేనా అన్లేదుకాని, ఆ అర్థం వచ్చేట్లు ఓ మినీచూపు విసిరి "మరి పై డబ్బేమయినా వస్తుందా?" అంది. "ఊహుం! అలాంటివి నాకు గిట్టవు!" అంటూ తనెంత నీతివంతుడైందీ ఉదాహరణలతో వివరించాడు. సుమిత్ర గట్టిగా ఆవలించి నిద్రపోయింది.

వేరింటి కాపరం పెట్టాక మొదటి జీతం పైసల్తో సహా తెచ్చి సుమిత్ర చేతుల్లో పోశాడు రామకృష్ణ.

"నాకెందుకండీ డబ్బు?" సణిగింది సుమిత్ర.

"నీ దగ్గరే ఉంచి ఇంట్లోకి వాడు. నా సొదరు ఖర్చుక్కూడా నువ్వే ఇవ్వు!" అన్నాడు రామకృష్ణ హుషారుగా.

"నయం! ఆడదాని చేతి అర్థం, మగవాడి చేతి బిడ్డా అని నాకెందుకు ఆడపెత్తనం! మీ దగ్గరే ఉంచండి!" అంది సుమిత్ర.

తన భార్య మంచితనానికి రామకృష్ణ ముచ్చటపడ్డాడు. అయితే రోజులు గడిచే కొద్దీ తెలిసొచ్చింది రామకృష్ణకి సంసారంలోని మతలబు.

"నేనేది తెమ్మన్నా డబ్బు లేదంటారేం? ఆలికి అన్నం పెట్టటం ఊరికి ఉపకారంలా మాట్లాడతారా? ఇది మరీ బాగుంది!" అంటూ సాధింపు మొదలెట్టింది సుమిత్ర. మళ్ళీ ఫస్టుతారీఖు వచ్చేసరికి సాధింపు ఎక్కువై పోయింది. రామకృష్ణకి తలబొప్పి కట్టినంతపనైంది.

ఆ నెల జీతం రాగానే రామకృష్ణ తిన్నగా వచ్చి భార్య చేతిలో ఆ డబ్బు పోసి "ఇహనుంచి డబ్బు ఎలా వాడుతావో నీ ఇష్టం. నా జేబు ఖర్చుకి ఇస్తే ఇవ్వు. అదీ నీ ఇష్టమే!" అన్నాడు దృఢనిశ్చయంతో.

— ఎస్. ఆర్. రావు

# సీక్రెట్

ఎప్పుడూ ఎంతో చలాకీగా కబుర్లు చెప్తూ కాలేజీలోని ఆడపిల్లల వైపు కోర చూపులు విసిరేస్తూ, జుట్టుఎగరేసుకుంటూ జబ్బ విరుచుకు నడిచే ఈశ్వర్రావులో ఉన్నట్టుండి వచ్చిన విచిత్రమైన మార్పుకి కాలేజీలో అందరూ ఆశ్చర్యపోయారు.

తలవంచని వీరుడిలా చలామణి అయి ఆడపిల్లల్ని సైతం ఆటపట్టించిన ఈశ్వర్రావు ఇప్పుడు ఆడపిల్లలా తలవంచుకుని కాలేజీకి వస్తున్నాడు, పోతున్నాడు. ఏమిటీ విపరీత పరిణామం? ఎవరికీ అంతుబట్టలేదు.

అతని షోకిరీతనానికి ఏ ఆడపిల్లయినా పాదరక్షతో సన్మానించిందా? దగ్గర బంధువో, దూరబ్బంధువో ఎవరైనా ఈ లోకంనించి టిక్కెట్టు పుచ్చు



కుని అతన్ని విషాదంలోకి తోసేశారా? మెడ నరం బెణికి నయంకాలేదా? అనే రకరకాల సందేహాలు వచ్చినా, అందుక్కావలసిన విషాదచ్ఛాయలూ, విపరీత పరిస్థితులూ అతని ముఖకవళికల్లో మచ్చుకు కూడా కానరావటంలేదే. క్లాసులో తలయెత్తి కత్తుల్లాంటి చూపుల్తో ఆడపిల్లల్ని పొడుస్తునే ఉన్నాడు. నవ్వుతూ, నవ్విస్తూ స్నేహితుల్తో కబుర్లాడుతునే ఉన్నాడు. క్లాసు దాటి బైటికొస్తేనే నేలబారుచూపు పెట్టేస్తున్నాడు.

ఆసక్తిని ఉగ్గబట్టలేక ఓ ఫ్రెండ్ ఈశ్వర్రావుని ఒంటరిగా నిలేసి అడిగేశాడు "ఈశ్బాబు! నీలో వచ్చినమార్పు మమ్మల్ని సస్పెన్స్‌తో చంపేస్తోంది. ఎందుకిలా అయిపోయావు చెప్పు. నేనంటే నేనే అని గుండెలు విరుచుకు నడిచే నీవు, కాశీ మజిలీ కథల్లో ముసలి మాంత్రికుడిలా ఏమిటా తలవంచుకు నడవడం? మమ్మల్ని ఇబ్బందిపెట్టక చెప్పరా బాబు!" అని కాళ్ళావేళ్ళాపడి బ్రతిమాలాడు.

ఈశ్వర్రావు చెప్పటానికి తటపటాయించాడు. ఆ మిత్రుడు ఓ పట్టాన వదిలిపెట్టలేదు చెప్పేవరకు.

"సరే చెప్తానుగాని, ఈ సీక్రెట్ ఇంకెవరితోనూ చెప్పకు!" అన్నాడు ఈశ్వర్రావు. "ఓ అలాగే!" అన్నాడు పట్టువదలని విక్రమార్కుడు.

"ఓ రోజు రోడ్డుమీద నడుస్తుండగా తలవంచి చూడగానే వందరూపాయల నోటు దొరికింది" అని చకచకా ముందుకెళ్ళిపోయాడు ఈశ్వర్రావు.

—గొల్లపూడి శ్యామల

# ఉత్తర కుమారుడు

ఎంతో కాలంగా సుబ్బారావుకి, తన పేరు రేడియోలో వినాలని మహా కుతూహలంగా వుంది. పుంఖాను పుంఖంగా రచనలుచేసి రేడియోకి పంపించాడు. సమాధానంకోసం ఎదురుచూశాడు. ఆత్రంగా కొంతకాలానికి రచనలన్నీ బుట్టదాఖలయిపోయినాయని నిర్ధారించుకున్నాడు. ఏంచేస్తే తనపేరు రేడియో ద్వారా ఊరూరా, వాడవాడలా, ఇంటింటా ప్రతిధ్వనిస్తుందా అనితీవ్రంగా కొన్ని రోజులపాటు తలపట్టుకొని, జుట్టు పీక్కుని మరీ ఆలోచించాడు. చివరికి

రేడియో కార్యక్రమాలని పొగుడుతూ ఉత్తరాలు రాద్దామని నిర్ణయించుకుని బాలానందం దగ్గరనుంచీ, అన్నిరకాల కార్యక్రమాలకీ పొగడ్తలవర్షం కురిపించాడు.

వివిధ భారతిలో ఫలానాపాట వినిపించమంటూ శరపరంపరగా ఉత్తరాలు రాశాడు. ఉత్తరం రాసినరోజు నుంచీ మూడ్కు వారాలదాకా ఒళ్ళంతా చెవులుచేసుకుని వినేవాడు అయినాలాభం లేకపోయింది. రేడియోవాళ్ళకి మాత్రం దయకలగలేదు. ఇహ మిగిలందల్లా స్త్రీల కార్యక్రమం. భార్యపేరుతో ఉత్తరాయణం నడిపిస్తే తన చిరకాల వాంఛితం ఈడేరుతుందని సుబ్బారావుకి గట్టి నమ్మకం ఏర్పడింది.

ఒకరోజంతా ఆలోచించి, చిత్తుప్రతులుతయారుచేసి స్త్రీలకార్యక్రమాన్ని పొగుడుతూ ఉత్తరంవ్రాసి సగం యజ్ఞం పూర్తి చేసినట్లు ఊపిరిపీల్చుకున్నాడు, ఈ ఉత్తరం తప్పకుండా రేడియోలో చదువుతారనీ, చదవని పక్షంలో ఇకజన్మలో రేడియోవిననని, రేడియోని తెగనమ్మిపారేస్తాననీ, వీర ఘోర శపథాలు చేశాడు. తనపేరు తనొక్కడే వింటే ఆనందమేముంది? అందుకని తన ఫ్రెండ్స్‌నందర్నీ చిన్న పార్టీపేరుతో ప్రోగ్రాం వేళకి ఇంట్లో సమావేశ పరిచాడు. సుబ్బారావు భార్యామణి సుబ్బాయమ్మకూడా యధాశక్తి ఇరుగు పొరుగులకీ విషయం చెప్పి, రేడియోలేని అమ్మలక్కలను తన ఇంటికే పిలుచుకొచ్చింది.

స్త్రీల కార్యక్రమం రానేవచ్చింది, ఉత్తరాలు చదువుతున్నారు రేడియోలో. "చివరిగా ఈ ఉత్తరంచూద్దాం... వీరేమంటున్నారంటే మీ కార్యక్రమాలన్నీ ఎంతో బాగుంటున్నాయి. వంటలు చేసే విధానాలు తెల్పుతూ నాకెంతో సహాయ పడుతున్నారు.మన స్త్రీలసమస్యలు చాలా విపులంగా చర్చిస్తున్నారు ఈ కార్య



క్రమం వస్తున్నదంటే, వంటపనీ, ఇంటిపనీ, అన్నీ వదిలేసి రేడియోకి అంటుకుపోతున్నాను'' అంటున్నారన్నమాట గుంటూరునుంచి శ్రీ సుబ్బారావు గారు.

చివరి వాక్యంతో సుబ్బారావు ముఖం సిగ్గుతో ముడుచుకుపోయింది. ఉత్తరం ఆఖరున శ్రీమతి సుబ్బారావుఅని రాద్దామనుకుంటూనే మతిమరుపుతో శ్రీమతి మర్చిపోయి సుబ్బారావు అనిరాశాడు. వింటున్న స్నేహితులు బిగ్గరగా నవ్వేశారు. ప్రక్కగదిలోని ఆడంగులు కొంగుఅడ్డంపెట్టుకుని కిసుక్కుమన్నారు

—గిడుగు గోపాలరావు

# ఎదురీదిన కెరటం

యామిని



కాత్యాయనికి ఇరవై అయిదు సంవత్సరాల వయసు. పొడుగూ కాదు, పొట్టీ కాదు, లావూ కాదు, సన్నమూ కాదు. నలుపూ కాదు– అలా అని దబ్బపండులాంటి ఛాయా కాదు. అనాకారి మాత్రం కాదు– అందమైనదా అంటే చూసేవారి దృష్టినిబట్టి. గుండ్రని ముఖం, విశాలమైన నుదురు, పెద్దా చిన్నా కాని కన్నులు, కొనతేరని చిన్న ముక్కు, కనబడగానే స్నేహాన్ని పురిగొలిపే సన్నని చిరునవ్వు... ఇవి కాక ముక్కుకు తెల్లని రాయి ఉన్న ముక్కు పుడక, చెవులకు ఉబ్బెత్తు నగిషీ చేసిన రాళ్ళు లేని దుద్దులు, మెడలో బంగారు పుస్తెల తాడు, రెండు చేతులకూ ఓజత బంగారు గాజులు, వాటికి పైనా కిందా నాలుగు జతల మామూలు గాజులు. కాత్యాయని కన్నుల్లో రెప్పలు రెపరెపలాడించే ముగ్ధత్వం కానీ, కనుబొమలు పైకెత్తి గుడ్లు పెద్దవి చేసే సంభ్రమంకానీ ఎన్నడూ కనబడవు. ఆమె చూపులు ఎప్పుడూ నిశ్చలంగా నిర్మలంగా ఉంటాయి.

సామాన్యంగా కాత్యాయని పెదవులపై ఉండే చిరునవ్వు తీవ్రమైన సంఘటనల్లో కూడా చెదరదు. నిజమైన సంతోషం కాని, మర్యాదకాని, వ్యంగ్య భావంకాని సందర్భాన్నిబట్టి చిత్రంగా ఆమె చిరునవ్వులోనే కనిపిస్తాయి. కాత్యాయని రెండు గంటలు ఈజీ చైర్లో కూర్చొని ఆలోచించి ఆలోచించి అలసిపోయింది.

మెల్లగా లేచి ఒళ్ళు విరుచుకుంది.

బయట తల్లి సుందరమ్మ కంఠం వినబడుతూంది. వంటలక్కను ఇంటి వెనకవైపు కొత్తగా కట్టించిన మేడను గురించి వివరాలడుగుతూంది.

కాత్యాయని కిటికీ తలుపులు పూర్తిగా తెరిచింది.

వంటలక్క వివరాలు చెప్తూంటే ఆశ్చర్యంతో బుగ్గలు నొక్కుకొని వింటూంది తల్లి.

కాత్యాయని గదికి రెండో వైపున కిటికీదగ్గరకెళ్ళి నిలబడింది. తెరిచి ఉన్న కిటికీలోంచి బయటకు చూసింది.

ఇంటిపక్క కొద్ది ఫర్లాంగుల దూరంలో ఎత్తుగా ఓ గుట్ట ఉంది. గుట్టకు ఒక వైపున చిన్నచిన్న చెట్లమధ్య నుంచి బంగారం వెలుగుతూన్నట్లు సూర్యకాంతి కళ్ళల్లో పొడుస్తూంది.

కాత్యాయని బయటికొచ్చింది.

ఊడిపోగా మిగిలిన కొద్ది జుట్టును కొప్పుగా చుట్టుకొని పూలు పెట్టుకుంది వంటలక్క. పెద్ద తలకు చిన్న కొప్పు, దానిచుట్టూ పెద్ద పూలు, చూడడానికి వింతగా ఉంది. ముందున్న ఇల్లు ఎప్పుడు కట్టింది, వెనుకనున్న ఇల్లు ఎప్పుడు కట్టింది, తానక్కడ ఎన్నేళ్ళనుంచి ఎంత సన్నిహితంగా ఆ యింట్లో ఉంటున్నదీ చెప్తూంది ఆవిడ.

సుందరమ్మ కాత్యాయనివైపు చూసింది.

"కొంచెంసేపు అలా బయటకువెళ్ళి వస్తానమ్మా!" అంది కాత్యాయని.

"ఎక్కడికే?"

"ఏం తోచటం లేదు. నాలుగడుగులు అటు ఎటయినా తిరిగివస్తాను"

"జాగ్రత్త! తొందరగా వచ్చెయ్"

సుందరమ్మ మళ్ళీ తన సంభాషణలో పడింది.

కాత్యాయని ఇంట్లోంచి బయటికొచ్చింది. వెనక్కు తిరిగి ఇంటివైపు

చూసింది. ఎత్తయిన కాంపౌండులో ముందుకొకటీ, వెనుకకొకటీ రెండు మేడలు. కాంపౌండులో ఆ ఇళ్ళకు ఒక వైపున అక్కడక్కడా పూల మొక్కలున్న విశాలమైన ప్రదేశం. మధ్యలో రెండు మామిడిచెట్లు వాటినంటి పెట్టుకొని జాజి పందిరి. అలంకరణ కోసం ఇంటిముందు పాతిన మొక్కలు, సన్నగా, పొడుగ్గా కాంపౌండుకు రెండు గజాల ఎత్తు పెరిగి ఉన్నాయి.

నగరంలో ఆ భాగం వేరుపరచి నట్లుగా, నిర్మానుష్యంగా ఉన్నట్లుగాఉంది. కాత్యాయని ఒకసారి ఇంటివైపు చూసి తల తిప్పింది.

కాత్యాయని మెల్లగా గుట్టమీదకు చేరుకుంది పడమటి దిక్కువైపు చూసింది. రాబోతూన్న చీకటిని ఎదుర్కొంటూ, రక్తసిక్త హస్తాలతో, రక్తపు మడుగులో మునుగుతున్నాడు సూర్యుడు. సుందర మైన ఆ దృశ్యాన్ని చూస్తూ కాత్యాయని దృష్టి మరల్చుకోలేకపోయింది. ఏకా గ్రతతో చూస్తూంటే ఎర్రని రంగుమధ్య సూర్యబింబం చక్రంలా తిరుగుతూ క్రిందికి దిగిపోతోంది. ఐదు నిమిషాలకు సూర్యాస్తమయం అయింది.

కాత్యాయని కళ్లనులుముకు చూసింది.

గుట్టమీద అక్కడక్కడా బండ రాళ్ళు పేర్చినట్లున్నాయి.

కాత్యాయని ఓ రాయిమీద కూర్చుంది.

పడమటిదిక్కు మేఘాలన్నీ ఎర్రటి రంగు పులుముకొన్నాయి. తూర్పుదిక్కు సముద్రం! వంగిన ఆకాశం, అనంతంగా కనిపిస్తున్న సముద్రంతో కలసిన రేఖను రెప్పవాల్చకుండా చూసింది. సముద్ర తీరంలో కెరటాలు విరిగి మల్లెపూల దొంతర్లలాంటి నురుగులు బిలబిలలాడుతూ ఇసుకమీదకు పరుగులు పెడుతున్నాయి. ఒకదాని తరువాత మరొకటి, దాని తరువాత ఇంకొకటి, కాత్యాయని కళ్ళు లాగేవరకూ అలాగే చూసింది.

తరువాత దృష్టి మరల్చింది.

ఆకాశపు కప్పుకింద వాటాలు పంచి నట్లు భూమి, సముద్రం! భూమిమీద అక్కడక్కడ కొండలమధ్య గుంపులుగా ఉన్న భవనాలతో ఆకుపచ్చని కంబళీలో ఆట వస్తువులు పరచినట్లుంది నగరం. రంగు రంగుల అగ్గిపెట్టెలు పేర్చినట్లు భవనాలు! చీమల పుట్టల్లాంటి పూరి గుడిసెలు! మధ్య గీతలు గీసినట్టు రోడ్లు! వాటిమీద ఆటబొమ్మల్లా పరుగులు పెడుతూన్న వాహనాలు! అక్క డక్కడా ప్రాకుతూన్న చీమల గుంపుల్లా మనుష్యులు! ఆ కోణంలో చూస్తూంటే ప్రపంచంలో మనుషులకీ మరో జంతు సమూహానికీ తేడా లేదనిపించింది.

కాత్యాయని తాను కూర్చున్న రాయి మీద వెనుకకు వాలింది. ఉన్నట్లుండి చల్లని గాలి విసురుగా వీచడం మొదలు పెట్టింది. ఆమె మనసుకు ప్రశాంతంగా ఉంది. పైన పల్చని మేఘాలు క్రిందుగా పరుగెత్తి పోతూన్నాయి. కాత్యాయని ఒకసారి కళ్ళు మూసి తెరిచింది. పరిగెడు తూన్న మేఘాల్లోంచి చంద్రుడు వేగంగా క్రిందికి పడిపోతూన్నట్లనిపించింది. చీకటిలో క్రమంగా లీనమయిపోతూన్న మేఘాలను చూస్తూ ఆమె మనసు పరిసరాలను విడచి ఎక్కడెక్కడో విహరిస్తూంది. ఎంతసేపయినా లేవబుద్ధి కాలేదు.

కాత్యాయని తనను పూర్తిగా ప్రకృతిలో ఒక భాగంగా సమన్వయ పరచుకొంది. ఈ అనంతంలో అణు మాత్రమైన తాను......తల్లి గుర్తుకొచ్చి కాత్యాయని వెంటనే లేచికూర్చుంది.

ఆకాశంలోని కొన్ని నక్షత్రాలు భూమి మీదకు దిగినట్లున్నాయి నగరంలో దీపాలు. రకరకాల కాంతుల్లో రంగు రంగుల దీపాలు. అనంతమైన చీకట్లో సృష్టిలో మానవ ప్రయత్నానికి ప్రతి నిధుల్లా వెలుగుతున్నాయి. కాత్యాయని ఒకటి రెండుసార్లు చుట్టూ చూసి గుట్ట దిగింది.

రోడ్డుపక్కగా నడవడం మొదలు పెట్టింది. ఐదు నిమిషాలు నడిచింది. అంతా అయోమయంగా ఉంది. కాం పౌండూ లేదు. ఇల్లూ లేదు. కాత్యాయని పరిశీలనగా చూసింది. తను నాలుగంత స్తుల మేడముందు నిలబడి వుంది. తాను బయలుదేరినప్పుడు అంత భవనాన్ని చూసినట్లే లేదు. రోడ్డు కొంచెం రద్దీగా ఉంది. తాను గుట్టకు రెండోవైపుకు వచ్చిందేమోనని అనుమానం వచ్చింది కాత్యాయనికి.

వెంటనే వచ్చిన వైపే వెనక్కు నడిచింది. కాని చుట్టూ లైట్ల వెలుగులో మరింత చీకటిలో నిలచినట్లున్న గుట్ట మీద తాను ఎక్కడ నుంచి దిగిందో గుర్తించలేక పోయింది. తాను నిలబడ్డ చోటు గుట్ట ఎక్కడానికి కూడా వీలు లేదు. నాలుగైదుసార్లు ఇటూ అటూ తిరిగింది. ఎదురుగా ఖాళీ రిషా వస్తే రిషాను పిలిచింది.

"ఎక్కడికి వెళ్ళాలి ?" రిషావాడు అడిగేడు.

"ఎక్కడికి వెళ్ళాలి?" గొణుక్కున్నది కాత్యాయని. ఆమెకు ఆయన పేరుగాని, ఆ వీధి పేరుగాని తెలియవన్న విషయం గుర్తుకొచ్చింది.

"అక్కర్లేదు వెళ్ళిపో బాబూ!"

రిషావాడు సణుక్కుంటూ వెళ్ళి పోయాడు.

ఆ రోడ్డేపోతే ఆ గుట్టను చుట్టిపోతుం దేమోనని తానెక్కడున్నదీ ఒకసారి చుట్టూ చూసి స్పష్టంగా గుర్తు పెట్టుకొని బయలు దేరింది. ఎంత దూరం నడిచినా రోడ్డు తిరుగుతూన్నట్లు కనిపించలేదు. గుట్టకు అరమైలు దూరంగా వచ్చేసింది. మళ్ళీ వెనక్కు వచ్చింది. ఎవరినైనా అడిగితే బాగుంటుందనిపించింది. పక్కనే నుంచున్న ఓ ముసలి అవ్వను అడిగింది ఆ గుట్ట అవతలికి ఎలా వెళ్లాలని. అవ్వ అర్థం కానట్లు ఏవో సంజ్ఞలు చేసి ముందుకు వెళ్ళిపోయింది. తరువాత వెనక నుంచి ఇంకో నలుగురైదుగురు వస్తున్నారు. వాళ్లల్లో ఎవరినైనా అడుగు దామని చూసింది. ఇంకా ఇరవై గజాల దూరంలో ఉన్నారు. వాళ్ళల్లో కొంచెం ముందు నడుస్తున్నతను కాత్యాయనివైపే చూస్తూ వస్తున్నాడు. అతనురెప్ప వాల్చ కుండా తనవైపే చూస్తూంటే ఎందుకో వెరచి అందులో ఎవరినీ ఏమీ అడగలేక పోయింది. వాళ్లు దాటి పోయారు. కొంత దూరం పోయాక అందులో ముందుపోయి నతను ఆగేడు. ఆగి తిరిగి కాత్యాయని వైపు వెనక్కు తిరిగి చూసేడు. రెండు క్షణాలు చూసి ఆమె వైపే నడిచి రావ డం మొదలు పెట్టేడు. కళ్ళజోడు తీసి రుమాలుతో తుడుస్తూ కాత్యాయని వైపు చూస్తూ ఆమె ముందుకొచ్చేడు. అతనటు

రావడం కాత్యాయనికి ఏదో అనుమానం కలిగి అప్రయత్నంగా రెండడుగులు వెనకకు వేసింది.

"నీ పేరు కాత్యాయనా ?" అన్నాడతను.

"అవును !" అంది కాత్యాయని ఆశ్చర్యపోతూ.

"దారి తప్పి పోయావా ?"

"అవునండీ! మీరేవరు?"

"నా పేరు రాజశేఖరం. నువ్వు మీ అమ్మ మా యింటికే వచ్చింది. నేను నీకోసం గంటన్నర నుంచి వెదకుతున్నాను. నిన్ను ఎప్పుడో చాలా చిన్నప్పుడు చూసేను. నీ ముఖం పూర్తిగా మరచే పోయాను.మీ అమ్మ చిన్న ముక్కు పెద్ద కళ్ళు, ఆకుపచ్చ చీర అంటూ ఎన్నో గుర్తులు చెప్పింది. కనీసం ముప్ఫై, నలభైమందిని అడిగి ఉంటాను నీ పేరు కాత్యాయనా అని. అసలు స్పష్టంగా ఆకుపచ్చ రంగు అంటే ఏమిటో మరచి పోయేను ఇన్ని రంగుల చీరలు చూసిన తర్వాత!" అతను నవ్వేడు నెత్తి మీంచి పెద్ద బరువుదిగినట్లుగా చూస్తూ.

కాత్యాయని చాలా సిగ్గుపడిపోయింది. ఏమీ మాట్లాడలేక పోయింది.

అతను దారి తీశాడు. అతని వెనకనే నడుస్తూ ఆమె ఇంటికొచ్చింది చుట్టూ ఉన్న పరిసరాలనూ మార్గాన్నీ గుర్తు పెట్టుకోడానికి ప్రయత్నిస్తూ.

"ఇదిగో సుందరం మీ అమ్మాయి!" అన్నాడు రాజశేఖరం ఆత్రుతతో ఎదురు చూస్తూ వీధిలో నిలుచున్న సుందరమ్మ వైపు చూస్తూ.

"ఇంతసేపు ఎక్కడున్నావమ్మా ? దారి తప్పిపోయావేమోనని హడలిపోయాను!"

"అవునమ్మా! ఆ గుట్ట మీదకు వెళ్ళేను. చీకట్లో ఇటువైపు దిగబోయి అటువైపు దిగేను. నిజంగానే దారి తెలీలేదు."

"బాగుంది! నడు భోజనం చేద్దువుగాని" అంటూ సుందరమ్మ లోపలికి దారి తీసింది.

"వంటలక్క ఇంటికి వెళ్ళిపోయింది. నేను వడ్డిస్తా రా రాజూ!" అంటూ సుందరమ్మ కాత్యాయనిని వంటింట్లోకి తీసుకెళ్ళింది. కాత్యాయని భోజనం చేయగానే ఇంట్లో పిల్లలందర్నీ పలుకరించమని చెప్పింది సుందరమ్మ. ప్రక్కగది లోనే చిన్నపిల్ల గొంతెత్తి పెద్దిగా ఏడవడం మొదలు పెట్టింది ఎవరో కొట్టినట్లుగా. సుందరమ్మ వచ్చి పాప నెత్తుకుంది. ఆ పాప చాలా చిక్కిపోయి దేనితోనో బాధ పడుతూన్నట్లుంది.

వంటింట్లోంచి బయటకు రాగానే విశాలమైన హాలుకు చుట్టూ గదులున్నాయి. కాత్యాయని మెల్లగా ఓ గదిలోకి వెళ్ళింది. ఓ అమ్మాయి నేలమీద పుస్తకాలు పరచుకొని మధ్యలో కూర్చొని భూమ్మీదకు వంగిపోయి ఏదో వ్రాస్తూంది. కాత్యాయని వెళ్ళి ఆమె ప్రక్క కొంచెంసేపు నిలబడింది. ఆమె గుర్తించలేదు. అలాగే తన పని చేసుకుంటూంది. కాత్యాయని మీదకు వంగి చూసింది. ఆమె బోటనీ రికార్డులో బొమ్మలు వేసుకుంటూంది. కాత్యాయని కూడా ఆమె ప్రక్కన కూర్చుంది.

ఆమెకు పదిహేడు పద్దెనిమిది సంవత్సరాలుంటాయి. చాలా బక్కగా ఉంది. చక్కని ముక్కు, పెద్దకన్నులు, కళ్లకు

దళసరి అద్దాల కళ్ళ జోడు, లోపలకు పోయిన చెక్కిళ్ళు.

కాత్యాయని కూర్చుంది. ఆమె తల వంచుకొని మళ్ళీ బొమ్మ గీసుకోవడం మొదలు పెట్టింది. ఆమె బొమ్మ వేస్తూంటే కాత్యాయని కూడా పరిశీలనగా చూడడం మొదలు పెట్టింది. సుజాత చాలా ఏకాగ్రతతో గీస్తూంది.

కాత్యాయని అరగంట కూర్చుంది. సుజాత రికార్డు పుస్తకం మీద నుంచి తల తిప్పనే లేదు. కాత్యాయని ప్రక్క నుంచి లేవడం కూడా ఆమె గమనించ లేదు.

తరువాత గదిలో పదిహేనేళ్ళ పిల్లవాడు టేబిల్ మీద పుస్తకం పెట్టుకొని కునికిపాట్లు పడుతున్నాడు. అదే టేబిల్ మీద పదిపన్నెండేళ్ల అమ్మాయి కూర్చొని బొమ్మలకు బట్టలు చుట్టబెడుతూంది. కాత్యాయనికి వాళ్లను కదపబుద్ధి కాలేదు. లేచి తమ సామానులు పెట్టుకొన్న గదిలోకి వెళ్ళి మంచంమీద ఒరిగింది.

మూసిన తలుపు సందులోంచి తల్లి కనబడుతూంది. సోఫాలో కూర్చొని ఉంది.

"...అయినవాళ్ళు అన్యాయంచేసినా పోనీ ఆ దేవుడు చల్లని చూపు చూసేడు. ఇంటి నిండా పిల్లలతో, చేతి నిండా డబ్బుతో నాకేం అన్నట్లు ఉన్నావు. ఎటొచ్చీ దానికే పిల్లలు నలుగురూ కలకల్లాడుతూంటే చూసుకొనే అదృష్టం లేకపోయ్యింది. దీనికి మాత్రం మనమేం చెయ్యగలం!..."

తల్లి రాజశేఖరంతో మాట్లాడుతూన్నట్లు గుర్తించింది.

రాజశేఖరం తలుపు సందులోంచి కనబడటం లేదు. కాని ఉన్నట్లుండి అతని కంఠం వినబడింది.

"...నీకు తెలుసో తెలియదో! వాళ్ళ మాటలు పడలేక పౌరుషంతో నేను కోర్టు కెక్కి అటో ఇటో తేల్చుకుంటా నన్నాను. అభిమానాల్లేని ఆస్తులు మన కొద్దురా అంది అమ్మ..."

కాత్యాయనికి వాళ్ళ సంభాషణలో తలా తోకా అర్థం కాలేదు. ఇంతలో తిరిగి తల్లి చెప్తూంది.

"...ఎంత ప్రేమ చూపించినా మీ అమ్మ వాళ్ళకు సవతి తల్లి. లోక సామాన్యంగా వాళ్ళకు ఆవిడ మీద ద్వేషం ఉండొచ్చు. కాని చెప్పుకుంటే సిగ్గుచేటు రాజా! ఇద్దరు కొడుకుల్ని కన్నాను. ఇద్దరూ అప్రయోజకు లయ్యారు. వాళ్ళిద్దరూ ఇంకా నే బ్రతికి ఉన్నానని ఏడుస్తున్నారు! ఇద్దరిలో ఎవరింటి దగ్గరున్నా ఇరవై నాలుగు గంటలూ వాళ్లు తగలెయ్యగా నాపేర మిగిలిన రెండెకరాల ఆస్థి గురించి గొడవే! ముద్ద ముద్దకూ మధ్య ముప్పై సార్లంటే ఎంత కన్నతల్లి నయినా నా వంట్లోనూ చీమూ నెత్తురూ ఉన్నాయి కదురా! ముద్ద ఎలా గొంతు దిగుతుంది! ..." సుందరమ్మ గొంతు పూడి పోయింది. ముక్కు ఎగపీల్చి పైట కొంగుతో కళ్లూ ముక్కూ తుడుచు కుంది.

"నీ కక్కడంత కష్టంగా ఉంటే మాయింట్లో ఉండు సుందరం- నేనేమీ పరాయి వాడిని కాదుగా!" అన్నాడు రాజశేఖరం.

"కన్న కొడుకుల పంచన నరకం నాకు దేవుడు రాసి పెడితే మనశ్శాంతి కోసం అంటూ మరో చోటికి ఎక్కడకి

వెళ్ళను? నా మాట వదిలెయ్! నా బెంగంతా కాత్యాయని గురించి రాజూ!"

కాత్యాయని ఉలిక్కి పడింది.

సుందరమ్మ సోఫాలోంచి ముందుకు వంగి మెల్లిగా చెప్తూంది. మధ్యలో రాజ శేఖరం అడిగాడు

"ఏం? అమ్మాయి కేమయింది? మీ అల్లుడు బాగా చదువు కున్న వాడు కూడాను! పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేసి నట్టున్నాడు!..."

"...ఏం చెప్ప మంటావ్! కడుపు చించుకుంటే కాలిమీద పడుతుంది. రెండే ళ్ళయింది అది మొగుడి దగ్గర్నుంచి వచ్చి! ఏంజరిగిందో తెలియదు! చెప్ప మంటే చెప్పదు! అక్కడికి మాత్రం వెళ్ళ నంటుంది! ఏడాది క్రితం చివరకి తెగించి నేనే వెళ్ళేను. వియ్యపురాలు నన్నెన్ని మాట లందను కున్నావ్! అల్లుడిగారి ముఖం కనబడ లేదు. ఎక్కడో ఉద్యోగం వెలిగిస్తున్నాడని తెలిసింది. ఇంటి దగ్గర నాకు పెట్టడానికే ఏడుస్తూన్న నా కొడుకు లిద్దరూ దీన్ని చూస్తే కళ్ళల్లో నిప్పులు పోసుకుంటు న్నారు. దీనికా అభిమానం ఎక్కువ! ఉన్న దంతా ఆ కొడుకు లిద్దరికి పెట్టి దీనికి అన్యాయం చేసేను రాజూ! ఇదెలా బతుకు తుందో అర్థం కావటం లేదు..." ఉన్నట్టుండి సుందరమ్మ లేచింది. కాత్యాయనికి తలుపు సందు లోంచి ఏమీ కనబడటం లేదు. కాని రుద్ధమైన తల్లి కంఠం మాత్రం వినబడు తోంది.

"...ఇప్పటి వరకూ నా బతుకులో ఎవరినీ అఖరుకు కట్టుకున్న మొగుణ్ణి కూడా చేయిచాచి అడగలేదు రాజూ! కొండంత ఆశతో నీ దగ్గరకు వచ్చేను. ఈ ఒక్క ఉపకారం చెయ్యి! ఇవి చేతులు కావు కాళ్ళు..." కాత్యాయని అప్రయత్నంగా లేవబోయింది.

"...ఇలా బతిమాలడం ఎందుకు సుందరం! నన్నేం చెయ్యమంటే అదే చేస్తాను. ఎక్కడో ఉద్యోగం చేస్తున్నా డన్నావుకదా! వాకబు చేద్దాం" రాజ శేఖరం అంటున్నాడు.

"అదికాదు రాజూ! అది అక్కడ కాపురం చేస్తుందని నాకు నమ్మకంలేదు. అక్కడ ఏదో అయింది... బలవంతాన పంపుతే నా కళ్ళ ముందే ఏం అఘాయి త్యం అవుతుందోనని భయపడు తున్నాను...."

"అయితే!..."

"అది ఇక్కడే మీయింట్లో పడి ఉంటుంది. ఎప్పుడో ఓగుడ్డ ముక్కకి డబ్బు నేనే పంపు తుంటాను. అది ఊరికే కూర్చునే స్వభావం ఉన్నది కాదు... ఈ ఒక్కమేలు చేస్తే..."

"సుందరం! నువ్వు పెద్ద దానివి ఇంత బతిమాలి నన్ను చిన్న బుచ్చు తున్నావు. దీనికింత చెప్పాలా? అలాగే ఉండనీ! నా పిల్లలకు తోడుగా ఉంటుంది."

"నువ్వు కాదనవని నాకు తెలుసు! సొంత అన్నలు తన్ని తగిలేస్తున్నా నోటి నిండా ఇంత మాటన్నావ్!

అదేచాలు.... కాత్యాయనికి ఎప్పటికీ ఇక్కడ ఉంచు తున్నానని తెలియదు. తెలిస్తే ఉండదు. రెండు మూడు రోజు లుండి దానికేదో సాకు చెప్పి మళ్ళీ వస్తానని వెళ్ళి పోతాను.... ఎటొచ్చీ

నువ్వు మాత్రం కొన్నాళ్ళు దాన్ని ఉండి పొమ్మని అంటూంటే..."

కాత్యాయని కళ్ళల్లోంచి కన్నీటి బొట్లు రాలి చేతిమీద పడ్డాయి. చేయి చూసుకుంది కాత్యాయని. గదిలో దీపం కన్నీటి బొట్టులో మెరుస్తూంది.

కాత్యాయని ఆలోచించింది. తన కంటిలోంచి ఎందుకీ కన్నీటి బొట్టు? తనమీద తనకు జాలా? కాదే! తల్లి పరిస్థితికి జాలిపడింది. అవును! జీవితం చివర నిలబడి గతం మరోలా జరిగి ఉంటే బాగుండు ననే ఆలోచన వస్తే ఎంత బాధ! తానిక్కడ ఉండడం అమ్మకు మనశ్శాంతి కలిగిస్తే అలాగే ఉండొచ్చు!

కాత్యాయని కళ్ళు తుడుచుకొని పైన తిరుగుతున్న ఫాను వైపు చూస్తూ వెల్లికిలా పడుకుంది.

మరో అయిదు నిమిషాల తర్వాత సుందరమ్మ ఆ గదిలోకి వచ్చి కాత్యాయనిని చూసి ఆశ్చర్యపోయింది. తను రాజశేఖరంతో మాట్లాడిందంతా విందేమోనన్న అనుమానం వచ్చి పిలిచింది.

కాత్యాయని పలుక లేదు. కాత్యాయనికి నిద్ర పట్టేసింది.



# 2

కాత్యాయనికి రెండు రోజుల్లో అక్కడి అందరి మనుష్యుల స్వభావాలూ అంతంతగా తెలిశాయి. రాజశేఖరం పెద్దకొడుకు రవి. ఇంటిపనులన్నీ చేస్తూ ఇంట్లో నౌకరు చంద్రయ్య ఒకడున్నాడు. రవి ఏంమాట్లాడినా వాడితోనే. ఇంట్లో చంద్రయ్యచేసే చాకిరీలో సగం రవికోసమే చేయాలి. వాడు రవికి చేసే సేవలు చూస్తే పూర్వపు కథల్లో రాజులకు చేసే సేవలు గుర్తుకు వచ్చేవి కాత్యాయనికి.

ఉదయం ఆరయినప్పటి నుంచి చంద్రయ్య రవి గదిలోనే ఉంటాడు. అప్పటి నుంచి మంచంమీద రవి కదలే ప్రతి కదలికకూ వాడు మెలికలు తిరిగి పోతూనే ఉంటాడు. 'రవిబాబూ!' అని ఓ సారి మెల్లగా పిలుస్తాడు. ఏడు గంటలు దాటేక ఇంచుమించుగా ప్రతి అయిదు నిమిషాలకీ ఓ సారి ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకున్నట్లుగా నిలబడి లేపడానికి ప్రయత్నం చేస్తూనే ఉంటాడు. ఆ సమయంలో ప్రతిరోజూ రెండుమూడు సార్లయినా నిద్రమత్తు వదలని రవిచేత వాడు చీవాట్లు తినడం కద్దు. లేపకపోతే లేపలేదని మీదపడతాడు. గతంలో అతన్ని లేపడానికి ప్రయత్నించిన రెండు అలారం గడియారాల జీవితాలు అర్ధాంతరంగా అతని గది నేలమీద ముక్కలయ్యాయట. లేచినప్పటి నుంచి అతనికేంకావాలో, ఏం చేస్తే అతను అరవకుండా, విసుక్కోకుండా ఉంటాడో ఇప్పటికి కూడా పూర్తిగా కనుక్కోలేక పోయాడు చంద్రయ్య. రవి లేచినప్పటి నుంచి కాలేజీకి వెళ్ళేవరకూ చంద్రయ్య ఆ గది దాటి బయటకు వెళ్ళడానికి వీలులేదు.

రవి గదిలో ఏ వస్తువు ఎక్కడ ఉంటుందో గట్టిగా చెల్లెళ్ళకుగాని, తమ్ముడికి గాని తెలియనే తెలియదు. ఒక్కళ్ళు,



ఆ గదిలో అడుగుపెట్టడు. రవి ఎప్పుడు ఇంటికొస్తున్నాడో, ఎప్పుడు బయటకు పోతున్నాడో కనీసం రాజశేఖరం కూడా అంతగా పట్టించుకున్నట్లు కనబడదు. ఆరు నెలల క్రితం ఓ సారి రవి కొంత డబ్బడిగితే రాజశేఖరం అంత ఎందుకురా అన్నాడట. తరువాత నాలుగు రోజులు రవి ఇంటికి రాలేదట. వచ్చిన తరువాత నాలుగురోజులు ఇంట్లో అన్నం తినలేదట. అప్పటినుంచి రాజశేఖరం కొడుకును ఆ ప్రశ్న కూడా వేయడం మానేశాడట. ఈ సంవత్సరమే బి.యస్.సి. కెమిస్ట్రీతో ఫస్టు క్లాసులో పాసయి పోస్టు గ్రాడ్యుయేషన్ చేస్తున్నాడు.

సుజాత రాజశేఖరం రెండో కూతురు. పెద్దకూతురు పెళ్లయి అత్తారింటికి వెళ్ళింది. సుజాత పుల్లలా సన్నగా పొడుగ్గా ఉంటుంది. బంగారు ఛాయ. దళసరి కళ్ళద్దాలవెనకాల కళ్లు ఎప్పుడూ వాచినట్లుగా ఉంటాయి. బి. యస్.సి. మొదటి సంవత్సరం చదువుతోంది. ఎప్పుడు చూసినా పుస్తకాలు ముందేసుకు కూర్చుంటుంది. తాను పలకరించినప్పుడు మాట్లాడిన ఒకటి రెండు మాటలు తప్ప సుజాత ఎవరితోనూ మాట్లాడడం కాత్యాయని చూడలేదు. ఉదయం ఏడు గంటలకు లేస్తుంది. అరగంటలో అన్ని పనులూ ముగించుకుని పుస్తకాలముందు కూర్చుంటుంది. వంటలక్క పిలవగానే

వెళ్ళి భోజనంచేసి కాలేజీకి వెడుతుంది. తిరిగివచ్చి మళ్ళీ పుస్తకాలు. పద్ధెనిమిదేళ్లు నిండి ఆడదైయుండి అంత ఇంట్లో మనుషులతో మాట్లాడకుండా ఉన్న సుజాత కాత్యాయనిని విస్మయపరచింది. మధుకు పదహారేళ్లుంటాయి. నూనూగు మీసాలు, కొంచెం పొడుగు సాగుతూన్నట్లున్నాడు. లోపలకు పోయిన దవడలు, లోతుగాఉన్న కళ్లు,ఎప్పుడూ ఏదో ఊహాలోకాల్లో ఉన్నట్లుంటాడు. చాలా సిగ్గుపడే స్వభావం.

మధు తర్వాత ఉష పదేళ్ళది.చామనచాయగాఉంటుంది. తండ్రితోనూ, ఇంట్లో మిగిలినవాళ్ళతోనూ ఎప్పుడూ ఏదోతానే కలుగజేసుకొని మాట్లాడుతూ ఉంటుంది. రోజూ స్కూలునుంచి రాగానే తోటి పిల్లలను ఎవరినో ఒకరిని ఇంటికి తీసుకొచ్చి కాలక్షేపం చేస్తూంటుంది. అందరిలోనూ ఉష ఒక్కర్తే మామూలు మనిషిగా కనబడుతుంది.

అందరికంటె చిన్నపిల్ల రాధిక అయిదేళ్ళది. బల్లిలా ఎప్పుడూ వంటలక్కనే అంటిపెట్టుకొని ఉంటుంది. కాళ్లూ చేతులూ సన్నగా, పొట్ట గూనలా ఉండి అనారోగ్యంగా ఉంటుంది. రోజూ రాధికను విస్తరి దగ్గరనుంచి లేవదీయడం ఒక పెద్ద సమస్య. వంటలక్క లేకపోతే ఒక్కక్షణం ఆ అమ్మాయి ఏడవకుండా ఉండదు. అమే రోజువిడిచి రోజు రాధికను డాక్టరుదగ్గరకు తీసుకెళ్ళి తీసుకొస్తూంటుంది. తను ఇంటి కెళ్ళినప్పుడు కూడా తీసుకేడుతుంది. రాత్రి రాధికను ముందు నిద్రపుచ్చి తాను ఇంటికి వెడుతుంది. ఇక రాజశేఖరం ఆ యింట్లో ఒక అతిథి ఉన్నట్లుగా ఉంటాడు. లేవగానే ఓ అరగంట పేపరు చూస్తాడు ఈ లోపులో వంటలక్క వచ్చి ఏం కావాలో రాధిక విషయంలో డాక్టరేమన్నాడో ఏకరువు పెడుతుంది. అన్నీ విని అడిగిన డబ్బిస్తాడు. వేళకు వచ్చి భోజనం చేసి తన కంపెనీకి వెడతాడు. మధ్యాహ్నం ఇంటికి వచ్చి టిఫిన్ తిని వెడతాడు. సాయంత్రం రాగానే ఇంటి పక్క శాశీస్థలంలో కాస్సేపు తిరిగి మళ్ళీ తన గదిలో కూర్చొని ఏవో పుస్తకాలు ముందేసుకు కూర్చొని లెక్కలు చూసుకొని తర్వాత భోజనం చేసి పడుకుంటాడు.

ఆరోజు చంద్రయ్య రాలేదు. ఎనిమిది గంటలకు రవి లేవడం చూసి కాత్యాయని కాఫీతీసుకొని వెళ్ళి అతని గదిలో టేబిల్‌మీద పెట్టింది. అయిదు నిమిషాల తర్వాత కప్పుతీసుకొద్దామని వెళ్ళేసరికి కాఫీ కప్పూ, సాసరూ ఎగిరి వచ్చి, ఆమె కాళ్ళ ముందుపడి ముక్కలయ్యాయి. కాఫీ చీర మీద ఒలికింది. ఏమిటో అర్థంకాక ఒక్కక్షణం నిలబడి తర్వాత పగిలిన ముక్కలు తీసుకొని బయటపారేసి మళ్ళీ రవి దగ్గరకొచ్చింది.

"ఈ వేళ చంద్రయ్య రాలేదు. కాఫీ నేనే తెచ్చాను. చల్లారి పోయిందా?"

జవాబు రాలేదు.

"కాఫీ మళ్ళీ తీసుకురానా?"

మౌనం అర్ధాంగీకారంగా తీసుకొని కాఫీ తేవడంకోసం వెళ్ళింది. రవికి ఫ్లాస్కులో కాఫీ నచ్చదని తెలిసి కూడా, అంతగా అడిగితే ఆ విషయం తనకు తెలీదని చెప్ప వచ్చనీ, అయినా ఏంచేస్తాడో చూడాలనీ, కప్పూ సాసరూ, ఫ్లాస్కూ తీసుకొని రవి టేబిల్ దగ్గరకు వెళ్ళింది.

రవి గడ్డం చేసుకోడానికి సబ్బు పట్టిస్తున్నాడు.

కాత్యాయని కాఫీ కప్పులో పోసింది.

"కాఫీ తీసుకో." అంది. ఓసారి తీవ్రంగా ఆమె వైపు చూసి తల తిప్పుకున్నాడు రవి

"కాఫీ నామీద పడింది" కాత్యాయని రవి ముఖంలోకి చూస్తూ అంది. పెదవులు బిగించి సబ్బు రాస్తున్నాడు. జవాబు రాలేదు.

"కాఫీ మీదపోసి కనీసం సారీ అనేనా అనవేం?" రెట్టించింది.

"చూడలేదు" రవి తలతిప్ప కుండా అన్నాడు.

"పోసేముందు చూడక పోయినా తర్వాత చూసేవుగా! నేను చెప్పేనుగా!"

రవి కాఫీ తీసుకొని చప్పరించేడు. పైపెదవికి ఉన్న సబ్బు కొంచెం కాఫీలో కరిగింది. కప్పు కిందపెట్టి 'సారీ' అన్నాడు.

"ఈ 'సారీ' ఇందాక పోసిన కాఫీకి కాదు కదా"

"అవును"

"ఇంకానయం. కాఫీ బాగాలేదేమో అనుకున్నాను."

కాత్యాయని తడిగుడ్డ తీసుకొచ్చి కాఫీ ఒలికిన చోట శుభ్రంగా తుడిచింది.

"స్నానానికి వేడినీళ్ళా? చన్నీళ్ళా?" రవి చన్నీళ్ళు స్నానం చెయ్యడని తెలిసే అడిగింది,

"వేడినీళ్లు."

బాత్ రూంలో, వేడినీళ్ళూ, తువ్వాలూ పెట్టి వచ్చింది.

"భోజనం ఇక్కడా ? డై నింగ్ టేబిల్ దగ్గరా ?"

"ఇక్కడే."

అతను స్నానంచేసి వచ్చేసరికి భోజనం తీసుకొచ్చి పెట్టింది. రవి భోజనానికి కూర్చున్నాడు.

భోజనం చేస్తున్న ప్లేటుకు పక్కనే గడ్డం చేసుకున్న రేజరూ, బ్రష్షూ,సబ్బు నీళ్ళల్లో ఉన్నాయి.

"చంద్రయ్యే ఇవన్నీ కడుగుతాడా" అంది కాత్యాయని వాటిని తీస్తూ. రవి తలెత్తి చూసేడుకాని జవాబు చెప్పలేదు. తెలిసో తెలియకో మరొకరిచేత అన్ని పనులూ చేయించుకోడానికి బాగా అలవాటు పడ్డాడన్నది కాత్యాయనికి స్పష్టమయింది.

రవి భోజనం చేసి ప్లేటులో చేయికడుక్కొని లేచి పోయేడు.

కాత్యాయని గదిచుట్టూ చూసింది. బట్టలూ,పుస్తకాలూ చిందరవందరగా పడి ఉన్నాయి. టేబిల్ మీద పుస్తకాలు సర్దుదామని ఓ పుస్తకం తీసేసరికి దానికింద పది రూపాయిలనోటూ, కొంత చిల్లరా ఉంది. ఆ గదిలో ప్రతి అంగుళంలోనూ రవి యొక్క అజాగ్రత్త, నిర్లక్ష్యం కనబడ్డాయి. గది సర్దేసరికి గంట పట్టింది. కాత్యాయని వంటింట్లోకి వచ్చేసరికి మిగిలినవాళ్ళు భోజనాలుచేసి ఎవరి చోట్లకు వాళ్లు వెళ్ళిపోయారు. వంటలక్క,రాధికను విస్తరి ముందు నుంచిలేవనెత్తడానికి బ్రహ్మప్రయత్నం చేస్తూంది. రాధిక పెరుగుపొయ్యమని మారాం చేస్తూంది. ఎలాగో రాధికను లేవనెత్తేసరికి ఏడుస్తూ లేచి ఏడ్చి ఏడ్చి చివరకు నిద్రపోయింది.

కాత్యాయని భోజనంచేసింది. వంటలక్క ఇంటికి వెళ్ళే సమయానికి రాధిక

ఇంకా నిద్రలేవలేదు. కాత్యాయని రాధి కను తాను చూస్తానని చెప్పింది. వంట లక్కా వెళ్ళిపోయింది.

లంకంత ఇంటిలో ఒంటరిగా ఉంది కాత్యాయని. రోజూ ఉండే పనిమనిషి కూడా లేదు. తలుపులన్నీ వేసి వచ్చి తోటవైపు తలుపు తెరచుకొని అక్కడ పడక కుర్చీ వేసుకొని కూర్చుంది. కాత్యాయని మనసంతా ఆలోచనలతో నిండి పోయింది.

తోటలో ఎదురుగా దూరంగా రెండు మామిడి చెట్లు ఎండలో ఎత్తుగా నిలబడి ఉన్నాయి. గాలికి చెట్ల ఆకులు మత్తుగా మెల్లగా కదులుతున్నాయి. కాత్యాయనికి అవి దీర్ఘ నిద్రపోతున్న రెండు జీవాల్లా కనబడ్డాయి. ఎన్ని రాత్రులు, ఎన్ని పగళ్లు, వానలో, ఎండలో, చలిలో చలనం లేకుండా అలా నిద్రపోతూనే ఉన్నాయి. వాటికి తెలీకుండానే వాటి శరీరాలు పెరుగుతూనే ఉన్నాయి. కాని ఆ సుషుప్తిలోంచి మెలకువ మాత్రం రావటంలేదు. ఆ నిద్రలోనే అవి చివరకు చనిపోతాయి. చుట్టూ పరిసరాల్లో ఏం జరుగుతూందో వాటికి ప్రమేయంలేదు. కాని జీవం ఉండగా ఒక గొడ్డలివేటు మీద పడితే మాత్రం కన్నీళ్లు కారుస్తాయి. కాని అర్థం పెట్టవు.

పక్కనున్న సీతాఫలం చెట్టుమీద రామచిలుక వచ్చి వాలింది. ఎర్రటి ముక్కు కనబడకుండా ఆకులలోకి తల వంచేసి కొమ్మచుట్టూ రెండుమూడు చుట్లు తిరిగిందే., కొట్టేసిన సీతాఫలపు గుల్ల కిందపడింది. మామిడి చెట్టు మొదలు దగ్గరనుంచి రెండు ఉడతలు పరిగెత్తుకొచ్చాయి. సీతాఫలపు గుల్ల దగ్గరకొచ్చి ముందుకాళ్లెత్తి కాసేపు కూర్చొని కిచకిచలాడి మళ్ళీమామిడి చెట్టు మీదకు ఒకదాని వెనుక ఒకటి పరుగెత్తి పోయాయి. మరోరెండు నిమిషాల తరువాత రామచిలుకకూడా ఎగిరిపోయింది. కాత్యాయని వాటినిపరిశీలనతో చూసింది. ఒకవింత ఆలోచన ఆమె మనస్సులోకి వచ్చింది.

తనకు ఇరవైఅయిదు ఏళ్ళునిండేయి. కాని తాను ఏంచేసింది ఇన్నాళ్లూ. చివరికి రామచిలుకా, ఉడుతపిల్లలూ తమతిండి కోసం తాము వెదుక్కుంటున్నా ఇప్పటివరకూ ఎప్పుడూ ఎవరిమీదో ఆధారపడడం కంటె ఒక్కరోజు తనకు తానుగా స్వతంత్రంగా జీవించగలిగే శక్తి లేదు తనకు. ఎంత నీచమైన పరిస్థితి? ఇది ఇకముందు జరగడానికి వీల్లేదు. గడచిన కాలం గడిచిపోయింది. కానిఇక ముందు గడిచే ప్రతినిమిషం తన ఇష్టం వచ్చినట్లు గడవాలి.

తన చదువు బి. ఏ. దగ్గర ఆగిపోయింది. అంతకుమించి తాను ఇన్నాళ్లూ చేసిన పనేమీలేదు. పెళ్ళయిన తర్వాత పుట్టింటికితిరిగి వచ్చి నాలుగేళ్ళయినా నాలుగేళ్లూ ప్రకృతిలో అన్ని జీవాలతో సమానంగా పెరగడంకంటే ఏమీ చేయ లేకపోయింది. అన్నయ్యల ప్రోత్సాహం అంతగా లేనిమాట నిజమే. ఒక రకంగా ఆ నాలుగు సంవత్సరాలూ ఏమీ చెయ్యకుండా ఉండడానికి కారణం అదే! అంతకు ముందు తనకు జీవితంలో ఏం కావాలో ఏం చేయాలో తనకే తెలీను. దేనికోసం మాత్రం కృషి చేయగలదు? ఎవరు దానికి బాధ్యులు?... ఇప్పుడు దానికి బాధ్యులెవరైతేనేం? అనుభవించాల్సింది తాను.

తెల్లవారి పదిగంటలయ్యేసరికి ఎవరి

పనులు వాళ్ళు చేసుకొనేందుకు ఎవరి స్థలాలకు వాళ్ళుపోతారు. కూలీకాయకష్టం చేస్తాడు. ఆఫీసుల్లో పని చేసేవాళ్ళు ఆఫీసులకు పోతారు. పిల్లల తల్లులు ఇంటిపని చేసుకుంటారు. కానీ తాను జీవంలేని ఈ యింటి గోడల్లా తోటలో మామిడి చెట్లలా ఉండిపోయింది...... అసలు ఏదయినా ఒక మనిషి ఆలోచించే పద్ధతిమీద ఆధారపడి ఉంది. తాను చేయదలచుకుంటే ఎందుకు పనిలేదు? ఇంట్లో ఎంతయినా పని ఉంటుంది! తోటలోఎన్నో మొక్కలు పెంచవచ్చు! పిల్లలకు చదువుచెప్పి సంరక్షణ చేయవచ్చు? బి.ఏ.కి చదివి ఆ పరీక్ష పూర్తి చేయవచ్చు! టైపు,షార్ట్ హేండ్ నేర్చుకోవచ్చు! ఇదివరలో తాను చాలావరకూ కుట్టుపని నేర్చుకుంది. సుజాత గదిలో బూజుపట్టి దుమ్ము కొట్టుకుపోయిన కుట్టు మిషను ఉంది. జానకమ్మగారు ఉన్న రోజుల్లో దాన్ని ఉపయోగించేవారట. అప్పటినుంచీ ఎవరూ ముట్టనే లేదు. పనికి లోటులేదు. తనకూ ఇన్నాళ్ళూ ఏం చేయడానికీ అవకాశం లేదు. ఇప్పుడు ఆ అవకాశం కలిగింది. కనీసం రెండు మూడు సంవత్సరాల్లో తానుకూడా ఒక స్వతంత్రమైన మనిషి కావాలి. రాజశేఖరంగారి కుటుంబం ద్వారా తనకు లభించిన ప్రోత్సాహంతో తన భవిష్యత్తును నిర్మించుకోవాలి. ఇప్పుడున్నంత స్వేచ్ఛ తనకెన్నడూ లేదు. సుజాతా, రవీ కూడా తనకు కావలిస్తే చదువులో సహాయం చెయ్యగలరు.తనకు తెలియనివి వాళ్ళనడిగి తెలుసుకోవచ్చు. తానింక సాధించలేనిది ఏమీ ఉండకూడదు. చదువు ఈరోజే మొదలుపెట్టాలి.

కాత్యాయనిలో ఒక నూతనోత్సాహం కలిగింది. కానీ చదువుదామంటే తన దగ్గర పుస్తకాలేమీ లేవు. వెంటనే రవి గదిలోకి వెళ్ళి ఒక్కొక్క పుస్తకమే చూసింది. అవన్నీ పోస్ట్ గ్రాడ్యుయేషన్ పుస్తకాలు. తనకర్థమయేవి ఏవీ కనబడలేదు. చివరకు ఒక ఇంగ్లీషు పుస్తకం తీసుకొని వచ్చి కూర్చుని చదవడం మొదలుపెట్టింది.

చదువుతూంటే ఎంత టైమయిందో తెలీలేదు. రాధిక ఏడుపుతో కాత్యాయని ఈ లోకంలోకి వచ్చింది. సరిగా అదే టైముకు వీధి తలుపు చప్పుడయింది. కాత్యాయని రాధికనెత్తుకొని తలుపు తీసింది.

"ఇది నారాయణమ్మతో వెళ్ళలేదా?" లోపలకు వస్తూనే అడిగేడు రాజశేఖరం రాధికవైపు చూస్తూ.

"లేదు. అప్పుడు నిద్రపోతూంది. నేను ఉన్నానుకదా అని ఉంచి వెళ్ళమన్నాను".

రాజశేఖరం తన గదిలోకి వెళ్ళి చంద్రయ్యను పిలిచేడు.

"చంద్రయ్య రాలేదు. ఐదు నిమిషాల్లో టీ తీసుకొస్తాను"అని వంటింట్లోకి వెళ్ళింది కాత్యాయని.

టీ తీసుకుంటూ "ఫ్లాస్కులో పోసి ఉంచలేకపోయావా? మధ్యాహ్నం మళ్ళీ పెట్టేపని ఉండదు" అన్నాడు రాజశేఖరం.

"నాకూ ఏం తోచటం లేదు మధ్యాహ్నం. అందుకే పొద్దున పెట్టలేదు" అంది కాత్యాయని.

ఓ అరగంట తరువాత రాజశేఖరం వెళ్ళిపోయాడు.

సాయంత్రం నాలుగయ్యేవరకూ కాత్యాయని రాధికతో కాలక్షేపం చేసింది ఆ బొమ్మ తెమ్మనీ, ఈ పువ్వు తెమ్మనీ ఆ మాటా ఈ మాటాచెప్పి రాధికను కనీసం ఒక గంట నడిపించింది.

నాలుగు గంటలకు ఉష వచ్చింది.

కాత్యాయని ఉషావాళ్ళ స్కూలును గురించి ఒకటి రెండు ప్రశ్నలడిగింది. ఇంక ఉష మొదలుపెట్టింది. స్కూల్లో ఎంత మంది టీచర్లున్నదీ, ఎవరెలా చెప్పేదీ, పిల్లలు ఎవరి క్లాసులో ఎలా అల్లరి చేసేదీ, ఏమేమి ఆటలు ఆడించేదీ, స్కూలుకు ఎవరెవరు చాక్లెట్లూ అవీ తెచ్చేదీ.....ఒకటికాదు, ప్రవాహంలా వరుసగా చెప్పుకుపోతూనే ఉంది. ముచ్చటైన ఉష కంఠంలోంచి విని, ఆమె ఉత్సాహంతో ఆ దృష్టితో ప్రపంచాన్ని చూస్తే ఎంతో అందంగా కనిపించింది కాత్యాయనికి. తన కబుర్లన్నీ అంత ఆసక్తితో వింటూంటే ఎంతో మంచి స్నేహితురాలు దొరికినట్లనిపించింది ఉషకు. ఒక్క గంటలో కాత్యాయని అంటే చెప్పలేనంత ఇష్టం కలిగి పోయింది.

సుజాత ఇంటికి వచ్చేసరికి ఉషా, రాధికా కాత్యాయని చేతులు. రెండూ పట్టుకొని తోటల్లో గంతులేస్తూ నడుస్తూ వుంటే ఆశ్చర్యం కలిగింది.

కాత్యాయని తోటంతా పరిశీలనగా చూసింది. అంత విశాలమైన ప్రదేశం ఉందికాని నాలుగైదు చెట్లూ, చీడపట్టిన 'పది పన్నెండు' పూల మొక్కలూ తప్ప ఇంకేం లేవు. ఇంతమంది ఆడపిల్లలున్న ఇంట్లో అందమైన పూల మొక్కలు పది రకాలు ఉంటే ఎంత బాగుంటుంది? దానిమ్మ చెట్టో, జామ చెట్టో, ప్రతి పండూ బజారునుంచి కొనుక్కోనక్కర లేకుండా ఉంటే బాగుంటుంది. అయినా తమ తోటలో పండిన పండు తింటే అదో సంతృప్తి. పిల్లలిద్దర్నీ అడిగింది వాళ్ళకేం పూలు ఇష్టమో, ఏ పళ్ళు ఇష్టమో! ఒకళ్ళ ముఖాలొకళ్ళు చూసు కుంటూ పోటీగా అన్ని పూల పేర్లూ, పళ్ళ పేర్లూ చెప్పేశారు. పాపం రాధికకు ఉషకి తెలిసినన్ని పేర్లు తెలీలేదు. రాధిక ఖంగారు చూసి కాత్యాయని నవ్వుతూ ఎత్తుకొని ముద్దు పెట్టుకొంది.

పిల్లలతో కాత్యాయని ఇంట్లోకి వెళ్ళే సరికి సుజాత అప్పుడే ఏదో హోంవర్కు చేస్తూంది.

పిల్లలిద్దర్నీ ఆటల్లోకి దింపి కాత్యాయని సుజాత దగ్గరకు వెళ్ళింది.

"సుజాతా! ఏం చేస్తున్నావ్" అంటూ పక్కన కూర్చుంది.

"బోటనీ రికార్డు వ్రాస్తున్నాను".

"నీ సబ్జెక్ట్సు ఏమిటి ?"

".బి పి. సి.".

"ఇప్పటిదాకా కాలేజిలోవిని, ఇప్పుడు మళ్ళీ వ్రాస్తే విసుగుపుట్టదూ?"

"ఏం చేయాలి మరి?"

"కొంచెంసేపు విశ్రాంతి తీసుకొని తర్వాత మళ్ళీ పనిచెయ్యాలి. అవునుగాని ఇప్పుడు పది నిమిషాలు మానేద్దూ, కొంచెంసేపు ఏదైనా మాట్లాడుకుందాం"

సుజాత తెల్లబోయి చూసింది.

"కమాన్ !" కాత్యాయని సుజాత చేయిపట్టుకొని మేడమీదికి తీసుకొని పోయింది.

ఇద్దరూ పిట్టగోడకు అనుకొని వేసిన కుర్చీల్లో కూర్చున్నారు.

"నీకు ఏమి కావాలని ఉంది ?" కాత్యాయని అడిగింది.

"అంటే ?"

"ఇంకో నాలుగేళ్ళు పోతే నువ్వు ఏ స్థితిలో ఉంటావు".

"అది ఇప్పుడే ఏం తెలుస్తుంది?"

"పోనీ నువ్వెలా ఉండాలనుకుంటు న్నావు ?"

"నేనేమీ అనుకోవటం లేదు".

"మరి బి. పి. సి. గ్రూపు తీసు కున్నావు కదా ! డాక్టరు కావాలని ఉందా ?"

"ఛ! నాకది ఇష్టంలేదు".

"ఏం ? డాక్టరుగా ఉండాలని చాలా మంది ఆశపడతారే !"

"ఎందుకో నాకది ఇష్టంలేదు".

"పోనీ! లెక్చరర్ కావాలని ఉందా?"

"ఏమో ! నాకు తెలీదు. నేనేమీ అనుకోలేదు".

"మరి నువ్వా గ్రూపు తీసుకొనే ముందు ఏమీ ఆలోచించలేదా ?"

"నా క్లాసుమేట్సు ఇద్దరు తీసు కున్నారని నేనూ తీసుకున్నాను. నిజానికి నాకు ఇప్పుడు ప్రాక్టికల్స్ చికాగ్గా కూడా ఉంటున్నాయి".

"పోనీ పెళ్ళి చేసుకుందామనుకుంటు న్నావా ?"

"ఇంకా ఇప్పుడేమీ ఆలోచించలేదు"

"నేనోమాట అంటాను కోపం రాదు కదా ?"

"ఊఁహూఁ..."

"నీకు వంట చెయ్యడం వచ్చునా?"

"రాదు".

"నీకు పదిహేడేళ్ళు నిండేయి. నీకు ముందు ముందు జీవితంపై అభిలాష లేదు. వివాహ జీవితాన్ని గురించి ఆలో చించలేదు. ఇంట్లో చేసుకొనే చిన్నచిన్న పనులు కూడా చేతకావు. బయట నువ్వు కాలేజిలో చదువుకొనే విషయాలు తప్ప మరేమీ తెలియవు. నువ్వీ యాంత్రిక జీవితంలోంచి ఒకటి రెండు సంవత్సరాల తరువాతనయినా బయటకు రావలసి ఉంటుంది. అప్పుడు నీ ముందు పరచు కొని ఉన్న జీవితానికి నువ్వు ఏ మాత్రం సంసిద్ధురాలవై యుండవు..."

కాత్యాయని సుజాతవైపు చూసింది.

సుజాత అద్దాలవెనుక కళ్ళు రెపరెప లాడించింది.

"నేను చెప్పింది నీకు అర్థమయిందా"

అయినట్లుగా తల ఊపింది సుజాత.

"ఏమీ అనుకోవుకదూ? ఎందుకంటే నీ వయసులో నేనూ ఇలాగే ఉన్నాను. అన్నిటికంటే ముఖ్యమైనది ఆనందంగా జీవించగలగడం. అది సాధించడం కోసమే మనమేం చేసినా, అది ప్రతి క్షణమూ దృష్టిలో పెట్టుకోవాలి".

మరో పది నిమిషాలు ఇద్దరూ మాట్లాడకుండా కూర్చున్నారు. తరువాత కాత్యాయని వంట చేయడానికని లేచింది. అప్పటికే నారాయణమ్మ రావలసింది. ఎందుకో రాలేదు. కాత్యాయని క్రిందికి దిగివస్తూ "ఇంకా కొంచెంసేపు కూర్చుం టావా?" అని అడిగింది సుజాతను.

"ఊఁ" అంది సుజాత దూరంగా చూస్తూ.

"అన్నంలోకి ఏం పండమన్నావు ?"

"ఏదయినా సరే ?"

"నీకేది ఎక్కువ ఇష్టం ?"

"నాకన్నీ ఒకటే !"

కాత్యాయని నవ్వుకుంటూ క్రిందికి

దిగి వచ్చేసింది.

రాత్రి ఏడున్నర, ఎనిమిది గంటలకు వంటయింది. వంట చేసేంతసేపూ చిన్న పిల్లలిద్దరూ కాత్యాయని చుట్టూ తిరుగుతూనే ఉన్నారు. వంట కాగానే అన్నం పెట్టమని కూర్చున్నారు. కాత్యాయని అక్కడికి వచ్చినప్పటినుంచి చూస్తూంది. ఎవళ్ళకు ఇష్టం అయితే వాళ్ళొచ్చి తినడం అలవాటైపోవడం. రెండోవాళ్ళు తిన్నారో లేదో తెలీదు. ఉషకీ రాధికకి చెప్పింది అన్నానికి అందర్నీ పిలుచుకొని రమ్మని. నాన్నదగ్గరకెళ్ళి "ఈవేళ సీతో అన్నం తింటాం రమ్మని" పిలవమంది. పిల్లలు రాగానే రాజశేఖరం వాళ్ళ మాటలు విని ఆశ్చర్యపోయాడు. "ఎవరు చెప్పేరు నాతో చెప్పమని?" అన్నాడు. ఉష ఏమని చెప్పాలో తెలీక కొంచెం తటపటాయించింది. రాధిక "కాచి!" అని అరచింది. రాజశేఖరం నవ్వుకొని పిల్లలతో వచ్చేడు. ఉష మధును కూడా పిలుచుకొచ్చింది. అందరూవచ్చి డైనింగ్ టేబిల్ చుట్టూ కూర్చున్నారు.

"సుజాతక్కయ్యను పిలవలేదా?" అని అడిగింది కాత్యాయని.

"ఎక్కడా కనబడలేదు" అంది ఉష.

కాత్యాయనికి అప్పుడు గుర్తుకొచ్చింది సుజాత మేడమీద కూర్చున్నట్లు. ఇంకా కిందికి దిగి రాలేదని స్ఫురించి ఆశ్చర్యపోయింది. ఇప్పుడే వస్తున్నానని చెప్పి మేడమీదకు వెళ్ళింది. సుజాత చీకట్లో ఒంటరిగా సాయంత్రం ఎలా కూర్చుందో అలాగే కూర్చుంది.

"సుజాతా?"

"ఊఁ..."

"ఏం చేస్తున్నావిక్కడ?"

"ఊరికే కూర్చున్నాను".

"చీకట్లోనా? రా భోజనం చేద్దువు గాని". !

కాత్యాయని సుజాతను తీసుకొని కిందికి వచ్చింది.

అందరికీ ఒకేసారి అన్నాలు పెట్టింది.

"సాయంత్రం నారాయణమ్మ రానని చెప్పిందా?"

"లేదు".

"ఆవిడ రాకపోతే ఇంకొకావిడని పంపేది? ఈ రోజెందుకు పంపలేదో! అనవసరంగా నువ్వు వండాల్సివచ్చింది".

"ఫరావాలేదు లెండి. అనుకోకుండా ఏదో పని తగిలి ఉంటుంది."

మధ్య మధ్యలో పిల్లలకేసి చూస్తూ రాజశేఖరం భోజనం చేసేడు. అతని ముఖంలో ఒక విధమైన సంతృప్తిని చూసింది కాత్యాయని. తాను ఊహించిన భావం అతని ముఖంమీద కనబడేసరికి కాత్యాయనికి కూడా ఎంతో సంతృప్తి కలిగింది.

సరిగా అప్పుడే రవి ఇంటికి వచ్చేడు. కాత్యాయని అతని గదిలోకి వెళ్ళేసరికి చెప్పులు మంచందగ్గర వదలి అలాగే మంచంమీద పడుకున్నాడు.

"అన్నం తీసుకురానా?" అని అడిగింది కాత్యాయని.

"ఓ అరగంట పోయేక తింటాను" అని రవి అలసిపోయినట్లుగా కళ్ళు మూసుకున్నాడు.

కాత్యాయని అక్కడే నిలబడింది.

"రేపు మళ్ళీ అవే బట్టలు తొడుక్కుంటావు! మార్చుకొని పడుకోరాదూ?" అంది.

"నేను బట్టలు ఒక రోజుకంటే ఎక్కువ తొడగను".



"ఊరంతా తిరిగొచ్చేవు. దుమ్ము పాదాలతో అలా మంచంమీద పడుకోక పోతే కాళ్ళు కడుక్కోరాదూ! నీళ్ళు తీసుకురానా?"

రవి మాట్లాడలేదు.

"నేనో అరగంట ఇక్కడ కూర్చోవచ్చా?" కాత్యాయని అడిగింది.

"ఓయస్. ఏమైనా పని ఉందా?"

"నువ్వు లేచి ఇలా కుర్చీలో కూర్చో చెప్తాను".

రవి లేచి కుర్చీలో కూర్చున్నాడు.

కాత్యాయని తానో కుర్చీ లాక్కొని కూర్చుంది.

"నువ్వు రోజూ నాకు మాథమాటిక్స్, ఫిజిక్స్, అన్నీ ఓ గంటసేపు చెప్పాలి. టైముంటుందా?"

"టైము..." రవి నసుగుతున్నాడు.

"నువ్వు పైకిచూస్తూ మంచంమీద పడుకొనే టైములో సగం టైముచాలు!" నవ్వింది కాత్యాయని.

"టైము ఫరవాలేదు. కానీ..."

"అయితే చెప్పడం చేతకాదా?"

"చేత కాకపోవడమేమిటి? ఒకళ్ళకు కాదు, పదిమందికి చెప్తాను".

"నాకొక్కర్తెకూ చెప్పు! చాలు" మళ్ళీ నవ్వింది కాత్యాయని.

"నేను నాలుగు సంవత్సరాల క్రితం ఈ గ్రూపుతో బి. ఏ. పరీక్షకు కట్టి ఫెయిలయ్యేను. ప్యాసు కావడానికి ఎన్ని సంవత్సరాలు కావాలంటావ్!"

"కనీసం పి. యు. సి సబ్జెక్ట్సయినా గుర్తున్నాయా ?"

"చూడాలి !"

"రెండేళ్ళు పడుతుందేమో!"

"చెప్తావా మరి!"

"అలాగే"

"ఈ వేళనుంచి"

"సరే!పుస్తకాలేమయినా ఉన్నాయా"

"పుస్తకాలు కూడా లేవు. ఏమేమి పుస్తకాలు కావాలో ఇప్పుడున్న సిలబస్‌ని బట్టి రేపు నువ్వే కొంచెం తెలుసుకొని రా !"

"అలాగే !"

ఇంతలో ఉషా, రాధికా వచ్చారు. మొక్కలన్నీ నాన్నగారు తెస్తానన్నారని చెప్పేరు.

"సరే మీరింక పోయి పడుకోండి. పక్కలు వేసేను. ఉషా! ఈరోజు ఏదో అయిపోయింది. రేపటి నుంచి రోజూ రాత్రి ఓ గంటసేపు చదువుకోవాలి. తెలిసిందా ?"

ఉష తల ఊపి వెళ్ళిపోయింది.

"నేను నీదగ్గర బబ్బుంటా" అంది రాధిక.

"ఇటురా! నా ఒళ్ళో కూర్చో!కొంచెం సేపు పోయేక ఇద్దరం వెడదాం!"

రాధిక కాత్యాయని ఒడిలో కూర్చుంది ఆమె గాజులు సవరిస్తూ.

"నేనెక్కడ ఉన్నానో ఇంటర్వ్యూ కానీ! పి. యు. సి పుస్తకాలు కూడా చదవాల్సి ఉంటుందేమో" అంది కాత్యాయని రవితో.

రవి ఏవేవో ప్రశ్నలడిగేడు. చేతనయి నంతవరకూ చెప్పింది కాత్యాయని.

పి. యు. సి దగ్గర్నుంచి మొదలు పెట్టడం మంచిదన్నాడు రవి.

రాధిక ఒడిలోనే నిద్రపోయింది.

కనీసం పడుకొనేటప్పుడయినా బట్టలు మార్చుకొని పడుకోమని చెప్పి రాధికను ఎత్తుకొని బయటకు వచ్చింది కాత్యాయని. రాధికను వేరే మంచంమీద పడుకోబెట్టింది.

మధు ఎప్పుడో ముసుగుతన్నేడు.

సుజాత పుస్తకాలు ముందు వేసుకొని కూర్చుంది. చదువుతూన్నట్లు లేదు. "ఏమిటి ఒక్కసారిగా అంత ఆలోచనలో పడ్డావు ?" కాత్యాయని మాటలకు సుజాత ఉలిక్కిపడింది.

"ఏమీ లేదు." అని పుస్తకాల్లో తల దూర్చింది.

కాత్యాయని రాజశేఖరం గది ప్రక్కగా వస్తూ అతని గదిలోకి చూసి ఆశ్చర్యపోయింది.

రాజశేఖరం ఒక సీసాలోంచి గ్లాసు లోకి ఏదో పోసుకొని సీసా అలమారులో పెట్టి తాళం వేశాడు.

కాత్యాయని కొంచెం తెరచి ఉన్న తలుపు సందులోంచి చూస్తూ అలా నిలబడిపోయింది.

రాజశేఖరం కొంచెం కొంచెం గొంతులో పోసుకొని రెండు నిముషాలలో గ్లాసు ఖాళీచేసి మెల్లగా మంచం మీదకు వాలిపోయాడు.

కాత్యాయని మెల్లగా వెళ్ళి ఓ గ్లాసుడు మంచినీళ్లు తాగి పక్కమీద ఒరిగింది. చిన్నపిల్లలిద్దరూ తప్ప ఈ యింట్లో అందరూ వింతగానే కనబడ్డారు కాత్యాయనికి. అయినా అందరిలోనూ బయటకు కనపడే ప్రవర్తనకూ, అలవాట్లకూ వెనుక మనిషికి సామాన్యంగా ఉండాల్సిన మానవత్వం మాత్రం కొరగా

కుండా ఉందని అనిపించింది. ఎవరి ప్రపంచంలో వాళ్లున్నా, ఇంకొకరిని గురించి వాళ్ళేమాత్రం పట్టించుకోక పోయినా వాళ్లకు వాళ్లె మరెవరికీ హాని మాత్రం చెయ్యరు.



# 3

రెండు నెలలయ్యే సరికి కాత్యాయని ఇంటిలోని వారి విచిత్ర చిత్త ప్రవృత్తులకు కొంత అలవాటు పడింది. అందరి మనస్సులకూ సన్నిహితంగా వెళ్ళ గలిగింది. కాని మధు మాత్రం ఇంకా దూరంగానే ఉండి పోయాడు. రవి కాత్యాయనికి చదువు చెప్పినప్పుడు చెప్పడం, ఆమె కొంచెం పరిహాసంగా మాట్లాడి నప్పుడు ఆ ధోరణిలోనే జవాబు చెప్పడం తప్ప తనకు తానే ఏమీ మాట్లాడేవాడు కాదు. ఎటొచ్చీ అతనికి ప్రత్యేకంగా చేయవలసిన పనులు కొన్ని చంద్రయ్యతో తానూ పంచుకొంది. మొత్తానికి తన చదువూ ఇంటిలో ఉన్న పనులూ తాను కల్పించుకొన్న పనులూ అన్నిటితోనూ రోజంతా సరిపోతూంది.

ఓ రోజు ఉదయం పదకొండు గంటలకు పని మధ్య యధాలాపంగా వీధి గుమ్మం వైపు చూసి చేతిలో చిన్న సూట్ కేసుతో ఇంటికి విసురుగా వస్తూన్న ఇరవై ఏళ్ళ అమ్మాయిని చూసి అలాగే నిలిచి పోయింది. ఆ అమ్మాయి చాలా అందంగా నాగరికంగా ఉంది. ఓసారి కాత్యాయని వైపు తేరి పార చూసి గబగబా లోపలకు వెళ్ళి పోతూంది -

"ఎవరమ్మా మీరు ?" అంది కాత్యాయని.

"మీ రెవరు ?" అని నిర్లక్ష్యంగా చూసి జవాబు చెప్పకుండా లోపలికి వెళ్ళి పోయిందా అమ్మాయి. కాత్యాయని నివ్వెరపోయి వీధి తలుపు దగ్గరగా వేద్దామని ముందుకు నడిచింది. వీధిలో టాక్సీ అప్పుడే కదిలి పోయింది. చిన్న చేతిసంచీ తీసుకొని ఒక యువకుడు లోపలకు వస్తున్నాడు.

కాత్యాయని ప్రక్కకు తప్పుకుంది. అతడు సంచీ లోపల పెట్టి చాలా పరిచయంగా రవి గది ప్రక్క గదిలోకి వెళ్ళిపోయాడు.

కాత్యాయని వీధి తలుపు దగ్గరగా వేసి లోపలికొచ్చింది.

"వీధి గుమ్మం దగ్గరే నిలబెట్టి ఎవరు నువ్వు అని అడుగుతోంది ఎవతే ఆవిడ ?" ఆ అమ్మాయి సుజాతతో అంటూంది.

"మనకేదో దూరపు చుట్టంట!"

"ఈవిడెన్నాళ్ళుంటుంది ?"

"ఏమోకాని బావ వచ్చేడా అక్కా?"

"ఆ! ఆ వంటలక్కని బావకి కాఫీ ఇయ్యమని చెప్పు!" అని అక్కడి నుంచి వెళ్ళి పోయింది.

కాత్యాయనికి అప్పటికి తెలిసింది వాళ్ళిద్దరూ రాజశేఖరం పెద్దకూతురు శారదా ఆమె భర్తా అని.

చూడగా చూడగా శారదలో రాజశేఖరం పోలికలు బాగా కనిపిస్తున్నాయి. ఆమె భర్త ముకుందం ఎర్రగా పొడుగ్గా ఉంటాడు. అతని ముఖంలో వివేకం

ప్రతిబింబిస్తూంటుంది. అతనికీ, శారదకూ ఈడూ జోడూ కలిసి ఎంతో ముచ్చటగా కనిపించేరు.

కాత్యాయని వెంటనే ఇద్దరికీ స్నానాలకు ఏర్పాట్లుచేసి తానే కాఫీ చేసి శారద దగ్గరకు తీసుకెళ్ళింది. శారద ముఖం చిట్లించుకొనే కాఫీ తీసుకుంది. ముకుందానికి పిల్లలెవరి చేతనైనా పంపించమంది.

కాత్యాయని ఉష చేత ముకుందానికి కాఫీ పంపించింది. అప్పటికే రాజశేఖరం ముకుందంతో మాట్లాడుతున్నాడు. సాధారణంగా రాజశేఖరం ముఖం మీద కనబడని సంతోషం కనబడుతూంది ఆ రోజు.

ఇంట్లో పనులన్నీ అయిపోయిన తరువాత కాస్సేపు శారదతో కాలక్షేపం చేద్దామని శారద ఉన్న గదిలోకి వెళ్ళింది కాత్యాయని.

శారద కిటికీ ఊచలు పట్టుకొని నిలబడింది. కిటికీలోంచి బయటకు చూస్తూంది. కాత్యాయని అడుగుల చప్పుడు విని తల తిప్పి చూసింది. వెంటనే ముఖం ముడుచుకొని బయటకు చూడడం మొదలు పెట్టింది. కాత్యాయనికి చివుక్కుమంది. రెండు నిమిషాలు అలాగే నిలబడి పోయింది. శారద అక్కడ నుండి కదలలేదు. తల తిప్పలేదు. ఆమెనెలా పలుకరించాలో అర్థం కాలేదు కాత్యాయనికి. వెనక్కు తిరిగి వచ్చేసింది. ప్రక్క గదిలో ముకుందం ఒంటరిగా కూర్చొని ఏదో మ్యాగజైన్ తిరగ వేస్తున్నాడు.

ఎన్నో రోజులు అత్తవారింట్లో ఉండి వచ్చిన శారద పుట్టింటి కొచ్చి అంత ముభావంగా ఉండడం విచిత్రంగానే కనిపించింది. రాగానే రాజశేఖరం ఏ రెండు మాటలు మాట్లాడేదో వాటికి జవాబు చెప్పడమే తప్ప తండ్రితోనూ మాట్లాడలేదు. తమ్ముడు, చెల్లెళ్ళు ఉన్నారు. ముద్దుగా వాళ్ళనైనా దగ్గరకు తీసుకొని ఏమీ ముచ్చటించనూ లేదు. వాళ్ళొచ్చేరని చెప్పినా రవి ఏదో వినీ విననట్లుగా ఉండి బయటకు వెళ్ళిపోయేడు. ఎటొచ్చి సుజాతతో మాత్రం ఓ పది నిమిషాలు మాట్లాడింది శారద. ఇంక శారద జవాబు చెప్పినా చెప్పక పోయినా నారాయణమ్మ మాత్రం ఓ అర గంట దబదబ లాడించేసింది.

మధ్యాహ్నం ఉష స్కూలు నుంచి రాగానే కాత్యాయని అడిగింది "పిఅక్క, బావా వచ్చేరు కదా! మరి కొంచెంసేపయినా నువ్వు మాట్లాడేవా?"

"బావతో మాట్లాడేనుగా!"

"మరి అక్కతో!"

"మా అక్క ఏంమాట్లాడదు."

కొంచెంసేపు పోయిన తరువాత చివరకు ఎలాగో సాహసించి కాత్యాయని ఓ చిన్న చేమంతి పూల దండ తీసుకొని శారద దగ్గరకు వెళ్ళింది. ఇంకా ఆమె ముఖం వికసించలేదు. కాత్యాయనిని చూసి తల దించుకుంది. కాత్యాయని తానే ఆమె తలలో పూలు పెట్టింది. ఆమె మాత్రం ఓసారి కాత్యాయని కళ్ళల్లోకి తీక్షణంగా చూసి తల తిప్పుకుంది.

కనీసం పరిచయం చేసుకోడానికైనా సహకరించని శారదతో తానే మాట మాట్లాడాలన్నా కష్టమనిపించింది. తానా యింట్లో ఉండడమే ఇష్టం లేనట్లుగా కనబడుతూంది శారద ధోరణి

చూస్తే. లేకపోతే మరి ఆమె స్వభావం ఏమిటో తెలియదు. అక్కడి విశేషాలేమయినా అడిగితే అనవసరంగా ఆమె విషయంలో జోక్యం కలుగజేసుకొన్నట్లు అనుకుంటుందేమో!

"మీ ఊరి నుంచి ఎంతసేపు ప్రయాణం ఇక్కడికి?" చివరకు ఎలాగో కల్పించుకొని అడిగింది కాత్యాయని.

"మూడు గంటలు" అని జవాబు చెప్పి నీకెందుకు అన్నట్టు చూసింది శారద.

కాత్యాయనికి తన ప్రశ్న తనకే పేలవంగా అనిపించింది. అయినా అంత మాట్లాడడం ఇష్టంలేని ఆమెతో తానెందుకు మాట్లాడ దానికి ప్రయత్నిస్తూంది! ఆలోచించగా తానాయింటికి వచ్చి ఉంటూన్నందుకు శారద ఏమయినా అనుకుంటుందనీ ఆమెలో ఆ అభిప్రాయాన్ని పోగొట్ట డానికి తనే ఏదో తపన పడుతున్నట్లు గుర్తించింది కాత్యాయని.

ఉంటున్నమాట నిజమే! పరాధీనగా బతుకు తున్నమాటా నిజమే?దానికి మరొకరు అనుకుంటే మాత్రం బాధ పడడం దేనికి? అంతేకాని శారద ఇలా తలతిప్పు కొంటూంటే తానిలా వెనకాల పడడం మాత్రం ఏం బాగులేదు. ఆ ఆలోచన కొంత ఊరట నిచ్చింది కాత్యాయనికి. అనవసరంగా ఇంకా సంభాషణ సాగించ దలచుకో లేదు. వెంటనే వెను దిరిగింది.

అప్పుడే ముకుందం గుమ్మం దగ్గర నిలబడి లోపలకు రావడానికి సంకోచిస్తున్నాడు. కాత్యాయని గబగబ బయటకు వెళ్ళి పోయింది.

"నేను వెళ్ళొస్తాను శారదా!" అన్న అతని మాటలు వినిపించేయి కాత్యాయనికి.

మరో అరగంటకు అతను వెళ్ళిపోవడం చూసింది. కాని శారద మాత్రం గదిలోంచి బయటకు రాలేదు. ఇద్దరి మధ్యా ఏ పోట్లాటైనా వచ్చిందేమో ననుకుంది కాత్యాయని.

సాయంత్రం అలవాటు ప్రకారం ఉషనీ, రాధికనీ తీసుకొని తోటలోకి వెళ్ళింది కాత్యాయని. రాధిక దృష్టి ఆటల వైపూ, సాయంత్రం మొక్కల వైపూ తిప్పడంతో ఆటలతో కాస్త తిన్నది వంటబట్టి కొంచెం ఆకారం తేలుతూంది. కాత్యాయని మొక్కలకు నీళ్ళు పోస్తూంటే పిల్లలు కూడా తాము మోయ గలిగిన వాటితో వాళ్ళూ పోస్తారు. ఆ రోజు అంటు కట్టిన మొక్కలు పది పన్నెండు ఉంటే తిరిగి పాతడానికి కాత్యాయని చిన్న పలుగు తీసుకెళ్ళి గోతులు తీస్తూంటే పిల్లలిద్దరూ మన్ను తీశారు. మొక్కలన్నీ పిల్లల చేతే పాతించింది కాత్యాయని.

మన్నుతీస్తూ, మన్నుపోస్తూ, నీళ్లు పోస్తూ, ముఖం మీద పడుతూన్న జుట్టును వెనక్కు తోసుకుంటూ, అలసి పోతూ ఉత్సాహంగా పనిచేసిన రాధికను చూస్తూంటే కాత్యాయనికి ఎంతో ముచ్చట అనిపించింది. పనంతా అయ్యే సరికి రాధిక గౌనంతా, ముఖమంతా, కాళ్ళూ చేతులనిండా మన్నయి పోయింది. కాత్యాయని రాధికను ప్రేమతో హృదయానికి హత్తుకుంది.

"నువ్వు పాతిన తెల్ల గులాబి మొక్కలు చక్కగా పూచేయి కదా!

పువ్వులు మరి మీ అక్క కియ్యవూ!" అంది కాత్యాయని రాధిక చిన్నారి ముఖంలోకి చూస్తూ. రాధిక కళ్ళు చక్రాల్లా తిప్పుతూ తల ఊపింది.

కాత్యాయని పెద్దగా విచ్చిన రెండు గులాబిపూలు కోసి రాధిక చేతికిచ్చింది.

రాధిక పూలు తీసుకొని ఇంట్లోకి పరుగెత్తింది.

సామానులు ఇంట్లో పెట్టెయ్యమని ఉషతో చెప్పి కాత్యాయని కూడా ఇంట్లోకి నడిచింది.

"ఏమిటే ఒళ్ళూ బట్టలూ మన్ను చేసుకొని వెధవ ఆటలూ నువ్వూనూ!" అని గదిమింది శారద, రాధికను చూడ గానే.

పువ్వు లిద్దామని గెంతుతూ వెళ్ళిన రాధిక బిక్కపోయి శారద కళ్ళల్లోకి చూస్తూ అలగే నిలబడి పోయింది.

"ఏం చేశావు ఇంతసేపూ?" అని అడిగింది శారద.

"మొక్కలు పాతేను" అంది రాధిక బెదురుతూ.

"ఎవరు పాత మన్నారు?"

"కాచి!"

"నేనే పాత మన్నాను" అందా మనుకొని ముందుకు అడుగు వేసిన కాత్యాయని "పని మనుషులకు పిల్లల నప్పగిస్తే వాళ్లు కూడా పని మనుషులే అవుతారు గొప్పపని చేశావు కాని వెళ్ళి గౌను విప్పుకొని ఒళ్లు కడుక్కో!" అన్న శారద మాటలు విని దెబ్బతిని అలాగే నిలబడి పోయింది.

రాధిక చలనం లేకుండా బిగిసి పోయింది.

"నీకే చెప్తూంట! కదలవేం?" శారద చెయ్యెత్తింది.

"ఏమిటది!" అంటూ అప్పుడే రాజ శేఖరం వచ్చేడు.

"దీని వేషం చూడు. వెధవ ఆటలూ ఇదీనూ! కాచిట! కాచి! ఆవిడ చెయ్యమందిట... పోయి ఆ మన్ను కడుక్కోమంటే రాయిలా ఎలా బిగుసుకు పోయిందో! పెంకి ముండ!" అంటూ రాధిక నెత్తి మీద ఓ మొట్టికాయ మొట్టింది.

కాత్యాయని మనసు గిజగిజ లాడి పోయింది. కళ్లు చెమ్మగిల్లేయి. రాధిక పెద్దగా ఏడ్చేస్తూంది. చేతిలో గులాబి పూలు క్రింద పడి పోయాయి. కాత్యాయని గుండె పిండేసి నట్లయింది.

"వెళ్ళు! ఏడుపెందుకూ?" అని రాజశేఖరం లోపలకు వెళ్ళి పోయాడు

ఏడుపు విని నారాయణమ్మ వచ్చి రాధికను అక్కున చేర్చుకొని వెళ్ళి పోయింది.

శారద విసవిసా నడుస్తూ తన గదిలోకి వెళ్ళి పోయింది. కాత్యాయని ముందుకు వెళ్ళి క్రింద పడిపోయిన గులాబి పూలు చేతిలోకి తీసుకుంది. రాధిక ఏడుపు ఇంకా వినిపిస్తూంది.

ఉన్నట్లుండి రాధిక ఏడుపు మానేసింది. అయినా ఓసారి ఆ పసిదాన్ని తన చేతుల్లోకి తీసుకుని ఓదార్చేవరకూ కాత్యాయని మనస్సుకు ఊరట కలిగే టట్లు లేదు. వెంటనే వంటింటివైపు నడిచింది.

మూసిన వంటింటి తలుపుల సందు లోంచి కుతూహలంగా మధు చూస్తున్నాడు. కాత్యాయని ఆశ్చర్యంతో నిల బడిపోయింది. ఓ నిమిషంసేపు అతను అలాగే చూస్తూ నిల్చున్నాడు. కొంచెం తల కదిపి కాత్యాయనిని చూసి ఏమీ

ఎరుగనట్లు పరుగెత్తి పోయాడు.

కాత్యాయని కూడా మూసిన తలుపుల సందులోంచి వంటింట్లోకి చూసింది. ఎంతో ఆశ్చర్యపోయింది. నారాయణమ్మ రాధికకు చనుపాలు కుడుపుతూంది. మధ్యలో ఓసారి బెదురుగా తలుపుల వైపు చూస్తూంది. అయితే మధు అంత కుతూహలంగా చూస్తున్నది ఇదా! తలుపు తోస్తే నారాయణమ్మ ఖంగారు పడుతుందేమోనని కాత్యాయని అక్కడ నుంచి వెళ్లిపోయింది.

మరో పది నిమిషాల తరువాత వచ్చి రాధికను బుజ్జగించింది. రాధికకు బట్టలు మార్చి ఒళ్ళంతా శుభ్రంగా కడిగింది.

ఆ రాత్రి కాత్యాయనికి సరిగా నిద్ర పట్టలేదు. మనస్సంతా ఎందుకో కలచినట్లయిపోయింది. కారణం సరిగా తెలియటంలేదు. సాయంత్రం రాధికను శారద కొట్టినందుకా? తనను నీచంగా మాట్లాడినందుకా? లేక తన పరాధీనపు జీవితానికేనా? ఏమో! ఏదీ తోచలేదు.

ఎంతకూ నిద్రపట్టక లేచి మధ్య హాలులోకి వచ్చింది. అందరూ పడుకొని నిద్రపోతూన్నా, మధు మంచం మీద పడుకొనే ఇంకా చదువుతూనే ఉన్నాడు. మధుకు చదువుమీద ఎంత శ్రద్ధ! అనుకుంది కాత్యాయని. వెంటనే చీకటి పడేముందు అతను వంటింట్లోకి చూసిన దృశ్యం గుర్తుకొచ్చింది.

కాత్యాయని అడుగుల చప్పుడు విని మధు ఉలిక్కిపడ్డాడు. చేతిలో పుస్తకాలు ఒక్కసారి ప్రక్కనున్న అలమారులో పుస్తకాల మధ్యకు తోసేసి దుప్పటి కప్పేసుకున్నాడు. మధు చర్య ఏదో అనుమానాన్ని కలిగించింది కాత్యాయని మనసులో. అప్పటికి మాట్లాడక వెళ్ళి పడుకుంది.

తెల్లవారగట్ల లేవగానే మధు మంచం దగ్గర కొచ్చింది. మధు బాగా నిద్రపోతున్నాడు. కాత్యాయని ప్రక్క అలమారులో పుస్తకాలన్నీ తీసి చూసింది. ఆమె విస్మయానికి మేర లేదు. అతని పుస్తకాల మధ్య కొన్ని పుస్తకాలు తీసి చూసింది. వాటి నిండా బూతు ఫొటోలు బూతు కథలు! అంత చిన్న వయస్సులో అతని మనస్సు అటువంటి విషయాలపై లగ్నం కావడం చాలా శోచనీయంగా కనబడింది. చక్కని భవిష్యత్తుకు బంగారు బాట వేసుకోవలసిన ఆ పసిప్రాయంలో ఈ దృష్టి కలగడం అతనికెంత చేటు! పుస్తకాలు అక్కడే ఉంచి వెళ్ళిపోయింది కాత్యాయని.

కాని ఆ విషయం మాత్రం మనసులోంచి పోలేదు. ఆ యింటిలో అందరిదీ తలొక దారీను. పిల్లలకు ఎవరూ సరియైన దారి చూపేవారు లేరు. మిగిలిన వాళ్ళ సమస్యలు వేరు. మధుసమస్య వేరు. అతని దృష్టి మరల్చడానికి తానేమీ చేయలేదు. అసలు అతని విషయంలో తానేమీ కలుగజేసుకోకూడదు. ఎలాగోలాగ మధు విషయంలో రాజశేఖరాన్ని వారించాలి. పూర్తిగా మధు మనస్సు బలహీనమైపోకుండా అతన్ని కాపాడాలి. వీలు చూసుకొని రాజశేఖరానికి చెప్పాలి. అలా అనుకుంటూనే తన పనిలో తాను మునిగిపోయింది ఆ రోజు.

ఏది ఎలా ఉన్నా రోజులు గడచి పోతూనే ఉన్నాయి. అలాగే శారద వచ్చి పది రోజులు దాటిపోయింది. రోజు రోజుకూ శారద ఇంకా తనలోకి తాను

వెళ్ళిపోతూంది. ఎప్పుడూ పరధ్యానంగా ఉంటూంది. అప్పుడప్పుడూ భోజనం కూడా మానేస్తూంది.

ఆమె వచ్చినప్పటినుంచీ కాత్యాయనికి కొన్ని విషయాల్లో మాత్రం ఇబ్బందిగానే ఉంటూంది. ఏ సందర్భంలో ఏ సమయంలో ఎదురయినా శారద ఆమెవైపు ఎప్పుడూ ఏదో శంకిస్తూన్నట్లే చూస్తుంది. ఆమె వచ్చినప్పుడు ఆమెకు ఎంత దూరంలో ఉందో పది రోజుల తర్వాత కూడా అంత దూరంలోనే ఉంది. అంతేకాక ఆమె ఉనికి కాత్యాయనికీ, మిగిలిన వాళ్ళందరికీ మధ్య కూడా కొత్త దూరాలు సృష్టిస్తూన్నట్లు కనబడుతూంది.

ఆ రోజు సాయంత్రం శారదకు ముకుందం దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. కాత్యాయని ఉత్తరం తీసుకొని, శారదను వెతుక్కుంటూ తోటలోకి వచ్చింది. తోటలో ఒంటరిగా కూర్చుంది శారద. కాత్యాయని ఉత్తరం ఇచ్చి వెళ్ళిపోయింది.

ఓ గంట తరువాత మొక్కలకు నీళ్లు పోద్దామని వచ్చిన కాత్యాయనికి ఇంకా శారద అక్కడే కూర్చోవడం వింతగా కనిపించింది. భర్త వ్రాసిన ఉత్తరం చింపేసినట్లుంది. కాగితం ముక్కలు చుట్టూ పడి ఉన్నాయి. కాత్యాయని తాను రావడం చూసి శారద కళ్లు తుడుచుకోవడం గమనించి ఆమె దగ్గరకు వచ్చింది, మళ్ళీ శారద కళ్ళనిండా నీళ్లు నిండి ఉన్నాయి.

"ఏం శారదా ? అలా ఉన్నావేమిటి ? ఏమయింది ?" అంది ఆమె తల తనవైపు తిప్పుకుంటూ.

శారద చెక్కిళ్ళమీంచి కన్నీటి ధారలు జారిపోయాయి. శారద కాంతిహీనంగా నవ్వింది. కాత్యాయనికి జాలి కలిగింది.

"చెప్పు ! నీలో నువ్వు ఎన్నాళ్ళిలా బాధపడతావు ? చెప్పకుండా ఎవరికి మాత్రం ఏం తెలుస్తుంది ?" అంటూ ప్రక్కనే కూర్చుంది.

శారద ఇదివరకులా తల తిప్పుకోలేదు. తడిసిన కనురెప్పలు రెపరెపలాడిస్తూ పచ్చగడ్డి ముక్కలు ముక్కలుగా త్రుంచుతూంది.

"చెప్తేమాత్రం ఎవరు తెలుసుకోగలుగుతారు ? ఎవరిని గురించి వాళ్ళకు ఆలోచించుకోవడానికే సమయం చాలదు. మరొకరు చెప్పేది విని అర్థం చేసుకోగలిగేటంత తీరికెక్కడ ?"

కాత్యాయనికేమీ అర్థంకాలేదు.

"అదేమిటి ఉత్తరం చింపేశావేం ? మీ ఆయన ఏమయినా అన్నారా ?"

శారద ఏదో చెప్పబోయింది. కాని మాట బయటకు రాలేదు, క్రింది పెదవిని పళ్ళతో నొక్కిపట్టింది. కాత్యాయని ఆమె ముఖాన్ని తనవైపుకు తిప్పుకుంది. శారద భోరుమంది. ఆమె వేదనకు కారణం తెలీలేదు. కాని శారదను చూడగానే ఎందుకో మనస్సు కుదుటబడింది. ఇన్ని రోజులూ అవ్యక్తంగా తనను బాధించిన ఒక సమస్య తీరినట్లనిపించింది.

"లే శారదా ! లోపలకు వెడదాం." అంది కాత్యాయని. శారద మాట్లాడకుండా లేచి కళ్లు తుడుచుకొని కాత్యాయనితో లోపలకు వచ్చింది

పతురి ... 35



# 4

తెల్లవారి మామూలుగా ఇంటిలో పని చేసుకుంటూన్న కాత్యాయని రాజశేఖరం హఠాత్తుగా తన గదిలోనుండి బయటకు పరుగెత్తడం చూసి నివ్వెరపోయింది. అతని వెనుకనే సుజాత పరుగెత్తింది. జరిగిందేమిటో తెలియక వాళ్ళ వెన కాలే కాత్యాయని పరుగెత్తింది.

కాత్యాయని రాజశేఖరాన్ని అంత ఆందోళనగా ఎప్పుడూ చూడలేదు. శారద మంచం దగ్గరకు వెళ్ళి "శారదా! శారదా !" అని చెంపలు తడిమి ఆత్రు తగా పిలుస్తున్నాడు.

"ఏమయింది ?" అంది కాత్యాయని సుజాతతో. సుజాత ఏమీ చెప్పలేక మంచంమీద చూపించింది.

రాజశేఖరం ఎంత కదిలించినా శారద కళ్ళు తెరవలేదు. కాత్యాయని కూడా శారధ చెక్కిలిమీద చేయి వేసి చూసింది. మంచుగడ్డలా చల్లగా ఉంది. గుండె ఝల్లుమంది. "ఎందుకైనా మంచిది డాక్టర్ని పిలిస్తే !" అంది. రాజ శేఖరం ఖంగారుగా టెలిఫోను నెంబ రిచ్చేడు. కాత్యాయని డాక్టరుకు టెలి ఫోను చేసింది.

శారద కట్టుకున్న బట్టలు కొంచెం కూడా నలిగినట్లు లేవు. మెడలోని మంగళసూత్రం పైటలోంచి బయటకు జారిఉంది. రాళ్ళ నెక్లెస్ కొంచెం చాచి నట్లున్న మెడమీదకు జరిగి ధగధగా మెరుస్తూంది. ముఖం ప్రశాంతంగా ఉంది. మూసిన కనురెప్పలపై కాటుక రేఖలు తీర్చి దిద్దినట్లున్నాయి. నుదుటి మీద కుంకుమ కొంచెమైనా చెరగలేదు. ముందురోజు కాత్యాయని ఉష చేత కట్టించి ఇచ్చిన మల్లెమొగ్గల దండలోని పూలు చక్కగా విడిచి పొదవుగా తల గడమీదకు వ్రేలాడుతూ సువాసనలు వెదజల్లుతూన్నాయి.

మరో అయిదు నిమిషాల్లో డాక్టరు వచ్చి శారదను చూసి పెదవి విరిచాడు.

"రాత్రి ఏమైనా బాధపడిందా ? ఏ జ్వరమైనా...డాక్టరడిగేడు.

"అబ్బే లేదండి." అన్నాడు రాజ శేఖరం.

"ఏమీ లేదు. నిన్నంతా బాగానే ఉంది.కాని రాత్రి భోజనం చెయ్యలేదు." అంది కాత్యాయని.

"లేదు రాత్రి పడుకునే ముందు గుండె నొప్పి అంది" అంది సుజాత.

కాత్యాయనీ, రాజశేఖరం కూడా ఆశ్చర్యపోయారు "ఒక్కసారి నాతో చెప్పలేదే !" అని గొణుక్కున్నాడు రాజశేఖరం.

డాక్టరు వెళ్ళిపోయాడు-

పిల్లలు ఒక్కొక్కళ్ళే లేచారు. మొదటిసారి రవి కళ్ళల్లో నీళ్ళు చూసింది కాత్యాయని.

ముకుందానికి ట్రంక్ కాల్ చేశాడు రవి.

కాత్యాయని తిరిగి శారద గదిలోకి వచ్చింది. శారద ముఖం నిమురుతూ కన్నీళ్ళు కారుస్తూన్న రాజశేఖరాన్ని



చూస్తూంటే గుండె నీరయిపోతూంది. సుజాత రెప్ప వాల్చకుండా కాత్యాయని వైపు చూస్తూంది.

కన్న కూతురు నిండు యౌవనంలో పోతే కలిగే దుఃఖాన్ని ఉపశమింప చెయ్యడం ఎలా ? విలపించినంత సేపు ఓదార్చకపోవడమే మంచిదేమో! కాత్యాయని రాజశేఖరం జోలికి పోలేదు. ఉషనూ, రాధికనూ వేరే గదిలోకి తీసు కెళ్ళింది. రెప్ప వాల్చకుండా సుజాత తనవైపు చూస్తున్న చూపే అర్థంకాలేదు కాత్యాయనికి. ఆ చూపుల్లో ఏదో విరోధ భావం కనబడుతూంది. మధ్యాహ్నం ఒంటిగంటకు శారద భర్త, అత్త మామల్లూ వచ్చేరు. ముకుందం వస్తూనే శారద మంచంమీద కుప్పలా కూలి పోయాడు.

"దాని మనసులో బాధ ఏమిటో ఎవ్వరం కనిపెట్టలేకపోయామమ్మా ! అన్నిటి మధ్యా వుండి ఏదీ అనుభవించ లేకపోయింది. వాడి కదంటే ఎంత ఆపేక్షో తెలీదు. చివరకు వాళ్ళకిలా రాసిపెట్టేడు దేవుడు" ముకుందం తల్లి మాటలు వింటూంటే కాత్యాయనికి తన మనసులో ఆలోచనే చెప్పినట్లయింది.

శారద శవానికి స్నానం చేయించి తన చేత్తో ఆమె ముఖానికి పసుపు కుంకుమలు వ్రాస్తూ కట్టలుతెగి పొంగే బాధతో విలపిస్తూన్న ముకుందాన్ని అతని తల్లిదండ్రులతోపాటు కొంత

వరకూ తన దుఃఖాన్ని దిగమింగుకొని రాజశేఖరం ఓదార్చేడు.

కార్యక్రమాలన్నీ అయ్యేసరికి చీకటి పడి పోయింది. ఉండ వలసిన సంతోషంలో ఏదైనా లోటు జరిగితే సందర్భాన్ని బట్టి అది ఎలా తెలిసి పోతుందో, ఉండ వలసినప్పుడు తగినంత విషాదం లేక పోయినా అలాగే అనిపిస్తుంది. కాత్యాయనికి మనసులో మూరు మూల అటువంటి లోపమే కనిపిస్తుంది. ఇరవై ఏళ్ళు పెరిగిన మనిషి అప్పుడే యవ్వనంలో అడుగు పెట్టి జీవితం ముగిసి పోయినది. అన్న ఉన్నాడు, తమ్ముడున్నాడు, చెల్లెళ్ళున్నారు. ఎందుకో ఎవరినీ ఈ సంఘటన పూర్తిగా కదిల్చినట్లేలేదు. ఆ మనిషి ఎవరికీ పరిచయమే ఉన్నట్లు లేదు. ఓ కుటుంబంలో మనుష్యుల మధ్య ఆ మాత్రం ప్రేమ పాశం లేక పోవడం అన్నింటికీ మించిన లోటుగా కనబడింది కాత్యాయనికి. ఆ లోపం ఎక్కడుంది? పిల్లలకు తల్లి లేక పోవడం వలననా? తండ్రి తగినంత శ్రద్ధ తీసుకోకపోవడం వలననా? అసలు వాళ్ళ మనస్తత్వాలంతేనా? కాత్యాయనికి పూర్తిగా అర్థం కాలేదు.

కాని రాజశేఖరాన్ని మాత్రం శారద మరణం చాలా కలవర పరచి నట్లుంది. నాలుగు రోజుల పాటు పరధ్యానంగా ఏదో ఆలోచిస్తూనే ఉన్నాడు. తరువాత ఓరోజు మాటల సందర్భంలో అన్నాడు.

"శారద నాకెప్పుడూ అర్థం కాలేదు కాత్యాయనీ! అదెప్పుడూ సుఖపడ లేదు. మరొకళ్ళను సుఖపెట్టలేదు. అది పుట్టిన రోజు నుండీ, పోయిన రోజు వరకూ సమస్యగానే ఉండి పోయింది. ఏమిటో అది దాని మీద మా కున్న అభిమానాన్నే శంకించేది. ఎప్పుడూ దానికేదో అన్యాయం చేయడానికి ప్రయత్నిస్తున్నామన్న ఆలోచనతోనే ఉండేది. అసూయ విడిచి అన్న చెల్లెళ్ళతో మాటాడలేదు. దానికి పెళ్ళిచేసి మరికొంత మంది కూడా దాని కోసం బాధ పడేటట్లు చేసేను. ముకుందం ఎంత మంచివాడో నీకు తెలీదు. ఒక్క క్షణం దాన్ని విడచి ఉండలేక పోయేవాడు. వాళ్ళింట ఆడ పిల్ల లేక పోవడంతో దీన్నే కూతురుగా చూసు కున్నారు అత్తమామలు కూడా! అయినా దాని ఆదరం పొందలేక పోయేరు. చివరకు ఇక్కడా అక్కడా కూడా దానితో ఎలా మసలు కోవాలన్నది పెద్ద సమస్య అయి పోయింది అందరికీ. ఇరవైనాలుగు గంటలూ దాని మనస్సెక్కడ నొచ్చు కుంటుందో అనే ఆలోచనతో దానితో మెలగినా అది సుముఖంగా ఉండక పోవడంతో అతనికీ చీకాకు పుట్టేది. చివరకు అలాగే ఇద్దరి మధ్యా ఏదో ఘర్షణ వచ్చిందట. పెట్టె సర్దుకొని అప్పటి కప్పుడు ఇక్కడికి ప్రయాణ మైందట. తప్పమ్మా అని చెప్పేరు. వినలేదు. అసలే దాని ఆలోచనలు అదోలా ఉంటాయి, ఏం అఘాయిత్యం చేస్తుందోనని అతను కూడా వచ్చేడు. దాని ఆలోచనలే దాని శరీరంలో రోగాన్ని సృష్టించి నట్లున్నాయి. అయినా గుండె నొప్పని మాట వరసకైనా అనలేదు. ఇప్పటికీ దాని మనసులో అదేంబాధ పడిందో అనుకుంటే నా మనసంతా పాడై పోతుంది" రాజశేఖరం ముఖంలో అంత బాధ చూసి కాత్యాయని తన

మనసులో ఉన్నది చెప్పకుండా ఉండ లేక పోయింది.

"...మీరు మరోలా అనుకోక పోతే...శారద విషయంలో పోనీ మీరు ఎంత ప్రయత్నించినా ఆమె మనస్సు కనిపెట్ట లేక పోయారని పిస్తుంది. కాని మిగిలిన వాళ్ళ విషయంలో మీరేం చేయ గలుగుతున్నారు? రవి తన గది లోంచి బయటకు ఊడి పడడు. తమ్ము డితో మాట్లాడడు. చెల్లెళ్ళతో మాట్లా డడు. ముద్దులేదు, ముచ్చటలేదు. కనీసం తన వాళ్ళతో కలసి భోజనం చెయ్యా డానికి కూడా ఇచ్ఛగించని అతని మనస్తత్వం ఏమిటి? ఆ మనిషి ముందు రోజులెలా ఉంటాయి? అతని పద్ధతులను మీరు మార్చ కుండా ఎందుకు వదిలేస్తు న్నారు. సుజాతకు పద్దెనిమిది సంవత్స రాలున్నా యేమో! ఆమెకు కాలేజి పుస్తకాలు తప్ప మరొకటి తెలియదు. రేపు మిమ్మల్ని విడచి దూరంగా ఉండ వలసి వచ్చి నప్పుడు ఆమె ఎలా నెగ్గు కొస్తుంది? మిగిలిన వాళ్లు ఇంకా చిన్న పిల్లలు. వాళ్ళను ఒక నిండు జీవితం నడపడానికి ఎవరు సిద్ధం చెయ్యాలి? వారి విషయంలో ఎవరూ ఏ ఆసక్తీ తీసుకో కుండా గాలికి పెరగనిస్తే వాళ్లే మవుతారు? మరో చేదయినా జరిగితే దాని కెవరు బాధ్యులై ఉండేవారు. ఇంత మంది ఉన్న ఇంట్లో తనతో మాట్లాడే వాళ్లేక ఒంటరిగా ఉంటుంది ఉష! పది రోజుల నుంచి మీతో ఎలా చెప్పాలా అని ఆలోచిస్తున్నాను. ఇప్పుడు సందర్భం వచ్చింది కనుక చెప్తున్నాను. మధు వయస్సు పదిహేను సంవత్సరాలు కదూ! అతను చక్కగా చదువుకొని మంచి ఉద్యోగార్హతలు సంపాదించు కోవలసిన వయస్సు. ఆరో గ్యము, చదువు తప్ప మరో విషయం మీదకు అతని దృష్టి పోకూడదు. కాని అతనికి ఆ దృష్టి ఎలా కలిగిందో తెలీదు. ఇంత చిన్న వయస్సులోనే శృంగార విషయాల మీద ఆసక్తి పెరిగి పోయింది. అతని అలమారులో పుస్తకాల అడుగున చూడండి! ఎన్ని బూతు నవల లున్నాయో! ఎన్ని బొమ్మ లున్నాయో! అంత పసి ప్రాయంలో ఇటువంటి విష యాలలో ఇరుక్కున్న అతని మనో నిగ్రహం ఎంత చెదిరి పోతుంది! చదువు మీద నుంచి దృష్టి మరలిపోవడమే కాకుండా మానసికంగా శారీరకంగా ఎంత బలహీనుడయిపో తాడు ! ఎన్ని చెడ్డ అలవాట్లకు గురి అవుతాడు ! అటువంటి ప్రమాదాన్నుంచి అతన్ని కాపాడవలసిన బాధ్యత మీకు లేదా? కాదు అతని మనస్తత్వాన్ని మీరు పరిశీలించాలి. తీవ్రంగా అతన్ని దండించి ప్రయోజనం లేదు. అతని బలహీనతను అర్థంచేసుకోవాలి. ఆ వయసులో అటు వంటి విషయాలు తెలియడమంటూ జరి గితే సహజంగానే వాటిని దాటి వెళ్ళడం కష్టం కదా! అతను జీవించింది పది హేను సంవత్సరాలే కదూ! జీవితం గురించి పరిపూర్ణంగా అతను, అతని జీవితం గురించి మనం ఆలోచించాలి. ఇప్పుడు విచ్చలవిడిగా ఆలోచించి అవి ఆచరణలో పెట్టడంవలన అతను కావా లనుకున్నవి నిజంగా అతనికి జీవితంలో అందవన్న విషయం తెలిసేలా చేయాలి. ఆరోగ్యం కాపాడుకొని చక్కగా చదువు కొంటేనే అన్నీ అనుభవించగలుగు



తాడని అతని మనస్సుకు నాదేలా చెప్పాలి. ఆత్మవిశ్వాసం అతనిలో ప్రతిష్ఠించాలి. పిల్లలమీద ఆ మాత్రం ఆసక్తి తల్లిదండ్రులు తీసుకుంటే పిల్లల్లో చాలా మంది పెద్దవాళ్ళయ్యేక కూడా బాగానే ఉంటారు. ఏది ఏమయినా ఇంట్లో అందరి మధ్యా ఇలా ఏ బంధమూ లేకుండా వుండడం మాత్రం మంచిది కాదు" కాత్యాయని మనసు తేలిక పడింది.

కొంతసేపు ఇద్దరూ కూడా మాట్లాడ లేదు. రాజశేఖరం ఏమయినా అనుకున్నాడేమోననిపించింది కాత్యాయనికి. కాని తన మనసులో ఉన్న విషయం స్పష్టంగా చెప్పగలిగింది. "నా అభిప్రాయంతో మీ రేకీభవించకపోతే..."

"లేదు కాత్యాయనీ ! నువ్వన్నది నిజమే! అది పూర్తిగా నా లోపమే! నువ్వు ఇన్ని మాటల్లో పైకి చెప్పడమే మంచిదయింది. మధు విషయం నేను ఆలోచిస్తాను. నిజమే !" రాజశేఖరం ఆలోచనలో మునిగిపోయాడు. కాత్యాయని లేచి బయటకు వచ్చేసింది.

బయట సుజాత పొంచి ఉన్నట్లు నిలబడడం చూసి కాత్యాయని ఆశ్చర్యపోయింది. కాత్యాయనిని చూడగానే సుజాత కొంచెం చిన్నబుచ్చుకున్నట్లు కనిపించింది.

"ఎంతసేపయింది వచ్చి ?"

"ఇప్పుడే! నాన్నగారిని కాలేజీ ఫీజు

అడగడానికి వచ్చేను" సుజాత నిజం చెప్పటంలేదనిపించింది కాత్యాయనికి.



## 5

మధ్యాహ్నం రెండయింది. రాజశేఖరం కంపెనీ నుంచి వచ్చి వెళ్ళేడు. గదిలో టేబిల్ ముందు కుర్చీలో క్రిందికి జారి కూర్చున్నాడు రవి. కాళ్ళు రెండూ టేబిల్ మీద పెట్టాడు. కుడి చేతితో పెన్సిల్ చెక్కుకునే చిన్న చాకు ఉంది. రెండు కళ్ళూ మూసుకొని రవి ఏదో దీర్ఘాలోచనలో ఉండగా చేతిలో చాకు టేబుల్‌ను పొడుస్తూంది. టేబిల్ మీద నాలుగు ముక్కలుగా కోసిన ఫొటో ఒకటి ఉంది.

కాత్యాయని ఓ చేతిలో పుస్తకాలూ, మరో చేత్తో కాఫీ కప్పూ తీసుకొని వచ్చింది. ఆ ఫొటోలో మనిషి గుర్తు తెలియటం లేదు. కాని రవి పుస్తకాల్లో ఎక్కడో చూసిన గుర్తుంది.

కాత్యాయని అడుగుల చప్పుడు విని రవి తల తిప్పి చూసేడు. ఆమె చేతిలో పుస్తకాలు చూసేడు.

"ఇప్పుడు నాకేం చెప్పే మూడ్ లేదు" అన్నాడు మళ్ళీ తల తిప్పుకొని.

"కాని మంచి కాఫీ తీసుకునే మూడ్ తప్పకుండా ఉంది" అని నవ్వుతూ కాఫీ కప్పు ముందుకు చాచింది

"ఏమిటి ఈ రోజు కాలేజి లేదా ?"

"ఉంది."

"వెళ్ళలేదేం ?"

"వెళ్ళాలని లేదు."

"కాలేజికి వెళ్ళే మూడ్ కూడా లేదన్నమాట!... అంత కోపంగా ఉన్నట్లున్నావేం ?"

"కోపంగా ఉన్నానని ఎవరన్నారు?"

"ఆ టేబిల్ చూడు ఎలా అయిపోతూందో!"

రవి అటు చూసేడు. టేబిల్ మీద ఫొటో ముక్కలు చూసేడు. చేత్తో వాటిని పక్కకు తోసేసేడు. ముక్కలు కదిలిపోయి చిత్రం చెదిరి పోయింది

"మనసు బాగా లేనప్పుడు ఆలోచన మరొకరితో పంచుకోమంటారు" కాత్యాయని మళ్ళీ అంది.

"కాని ఆడవాళ్ళతో మాత్రం కాదు" అన్నాడు రవి.

"ఎందుకో?"

"మనిషి విలువ, మనసు విలువ తెలుసుకోలేని వాళ్ళు"

"ఒక చిన్న అనుభవం పురస్కరించుకొని అంత సీరియస్‌గా, అంత పెద్ద మాటలు మాట్లాడ కూడదు."

"అది నా అనుభవమని ఎవరు చెప్పేరు?"

"తిమ్మన్నా తిమ్మన్నా నీ పేరేమిటి అంటే నా ముఖం చూస్తే తెలియటంలేదా అన్నాడుట! వేరే చెప్పేదేముంది?"

"అయితే ఏం తెలిసింది నీకు?"

"ఏముంది? ఆ ఫొటోలో అమ్మాయిని ప్రేమించి ఉంటావు! ఆమె చెంప దెబ్బ కొట్టడమో లేదా నీ ముందే మరొకర్ని పెళ్ళి చేసేసుకోవడమో జరిగి ఉంటుంది!"

రవి ముఖం ఎర్రబడిపోయింది.

"నిజంగా నువ్వా అమ్మాయిని ప్రేమించేవా?" కాత్యాయని అడిగింది.

"ఒకప్పుడు"

"ఆమె నిన్ను ప్రేమించిందా?"

"అలా నటించింది."

"ఇప్పుడామె ఎవరినైనా పెళ్ళిచేసుకుందా?"

"ఓ లెక్చరర్‌గాడితో తిరుగుతూంది. ఎలా తిరుగుతుందో అదీ చూస్తాను."

"ఆవేశపడకు రవీ! నీ మనసులో మాట ఆమెకు చెప్పేవా?"

"అన్నీ మాటల్లోనే చెప్పాలా?"

"మరి ఆమెకు తెలిసిందో లేదో!... అదీకాక ఆమె కిష్టంవచ్చిన వాడితో తిరిగితే నీకు పగఏమిటి?"

"ఇవి చెప్తే తెలియవు. అనుభవించినప్పుడే తెలుస్తాయి"

"అయితే ఇంతకీ నువ్వామెను ప్రేమించేనంటావా?"

"చెప్పేనుగా! ఒకప్పుడు..."

"వట్టిది. నువ్వామెను ఎన్నడూ ప్రేమించలేదు."

"నా భావాన్ని శంకించే అధికారం నీకు లేదు..."

"ప్రేమ ఉన్నచోట పగఉండదు. త్యాగం ఉంటుంది..."

"నా భావాల విలువ నాకు తెలుసు! నువ్వేమీ చెప్పొద్దు"

"ఇది నీ వ్యక్తిగత విషయమైనా అనుభవం లేనివాడవనీ, ఆవేశపరుడవనీ, ఏంచేసినా జరిగే పరిస్థితులు విపరీతంగా ఉంటాయనీ నువ్వువద్దన్నా చెప్తున్నాను. నీ ప్రేమ ఆమె అంగీకరించనప్పుడు బాధ ఉండొచ్చు కాని పగ ఉండకూడదు. అది ఉంటే నీ మనసు నిండా నిండి ఉన్నది అహంకారమే కాని ప్రేమ కాదు..."

"షటప్!" రవి గుడ్లురిమి చూసేడు.

కాత్యాయని చేతిలో పుస్తకాలతో లేచింది. కాని ఆపలేదు.

"...నీలో అహంకారం నిండి ఉన్నంతవరకూ నిన్ను నువ్వే ప్రేమించుకోగలవు. నిన్ను నువ్వు అంతగా ప్రేమించుకున్నన్నాళ్లు ఇంకొకరిని కామించ గలవేమోగాని ప్రేమించలేవు! అయినా నీలో ఏం చూసి ఆమె నిన్ను ప్రేమించిందని అనుకున్నావ్? నీ అంతటనువ్వు సంపాదనపరుడవూ కాదు! ఇంట్లో అయిన వాళ్ళతోనే చనువుగా మాట్లాడలేని కఠినహృదయుడవునువ్వు! నీ వ్యక్తిత్వాన్ని కొంచెం విమర్శిస్తే సహించే గుణంలేదు! నువ్వామెను ప్రేమించేవనీ ఆమె నిన్ను ప్రేమించిందనీ నువ్వే భ్రమ పడ్డావు! ఆమె నిన్నేమీ మోసం చెయ్యలేదు."

"గెటౌట్! నీ సలహా నాకక్కర్లేదు నువ్వెవరు నాకివన్నీ చెప్పడానికి" రవి కోపంతో నిల్చుని గుమ్మంవైపు చేయి చూపించేడు.

"వెడతాను. కానీ ఒక్క విషయం గుర్తుపెట్టుకో! తొందర పడి ఏమైనా చేస్తే కటకటాల వెనక్కుపోయే ప్రమాదముంది!" కాత్యాయని బయటకు వచ్చేసింది. ఈ మధ్య రవి కొంచెం చదువు పట్ల బద్ధకం చూపిస్తున్నాడు. అందులోనూ తొందరపడి ఏ పనైనా చేస్తే పండంటి బ్రతుకులు నాశనం కావూ! తాను అన్నమాటలను సమర్థించుకుంది కాత్యాయని తనకుతానే

రెండుమూడు గంటలు తోటలో చదువుకుంటూ కూర్చుంది. తరువాత డాబా మీద సుజాతనుచూసి ఆశ్చర్యపోయి అక్కడికి వెళ్ళింది.

"ఒక్కర్తెవూ ఇక్కడున్నావేమిటి ?"

"ఏం తోచక ఇలా వచ్చాను."

"ఏమిటీవేళ కొత్తమాటవింటున్నాను. నీకు కాలేజిపుస్తకాలుంటే తోచక పోవడమా!" అంది కాత్యాయని నవ్వుతూ.

"అదేమిటి ? నేను మనిషినికానా !" అంది సుజాత.

"అంతిమాట నేననుకాని నిన్ను చూస్తే నాకు కొంత ఆశ్చర్యంగానే ఉంటుంది..."

"ఏ విషయంలో !"

"అదే ! ఈ రోజుల్లో పిల్లలు పదమూడు, పధ్నాలుగు సంవత్సరాలు వయసు వచ్చేసరికే స్నేహాన్నిబట్టీ, వాతావరణాన్ని బట్టీ ఎన్నో ఉద్రేకాలకు లోనవుతున్నారు. అటువంటిది నువ్వు గ్రాడ్యుయేషన్ చేస్తున్నావు ! అయినా నా కళ్ళకు మాత్రం మూడేళ్ళపసిదానిలా కనబడతావు..."

"అయితే అది లోపమంటావా ? మంచిది గాదంటావా ?"

"కొంతవరకూ మంచి కొంతవరకూ లోపం ! వయసుతోపాటు ద్వేషాలూ అసూయలూ పెంచుకోనంతవరకూ మంచే ! కాని వయసుతోపాటు మమతలూ అనుబంధాలూ పెంచుకోకపోవడం లోపమే !"

"నాలో ద్వేషం లేదను కోవడంలో పొరపాటు పడుతున్నావేమో !"

"లేదు.నీకెవరిమీద ద్వేషం ఉంటుంది? కొంతవరకూ ద్వేషం అనేది కొన్ని పరిస్థితుల్లో ప్రేమకూ మమతకూ నీడ."

"పోనీ ద్వేషం నీమీదే ఉండ కూడదా ?"

"ఊఁ హుఁ !"

"నీ ఊహలకు ఆధారం ఏమిటి ?"

"నేను చూస్తున్నదే."

"నువ్వుచూడనివి కూడా ఉండొచ్చుగా ?"

"నాతో వాదించడానికి ఉండొచ్చు."

సుజాత నవ్వుతూ సముద్రంవైపు తల తిప్పింది. కాత్యాయని కూడా అటు చూసింది.

నీలంగా ఉన్న సముద్రాన్నీ, ఆకాశాన్నీ కలిసే చోట తెల్లని మబ్బులు వేరుచేస్తున్నాయి.

"ఎలా ఉంది సముద్రం ?" కాత్యాయని అడిగింది.

"తెలియనంత చెప్పలేనంత అందంగా ఉంది" అంది సుజాత దృష్టిమరల్చకుండా. "నువ్వొచ్చేముందు అదే చూస్తున్నాను. నాకే ఆశ్చర్యంగా ఉంది. ఈ యింట్లోపుట్టేను. ఇన్నేళ్ళు ఇక్కడ పెరిగేను. అటు చూడాలనే కోరిక నాకెందుకు కలుగలేదా అని ! చూసినా ఇంత అందం ఎందుకు కనిపించ లేదా అని."

"అయితే ఈరోజు నీకేదో అయింది"

"ఏమో నాకు తెలీదు. కాని నేను చాలా మారిపోతున్నా ననిపిస్తూంది."

"ఎటువంటి మార్పు ?"

"తెలీదు. అసలు నాకేమీ తెలీదు. ప్రపంచంలో బంధాలన్నీ కూడా ఎంత తియ్యనివి ! అన్నీ ఒక్కరోజులో తెలిసిపోతే బాగుండును !"

"అబ్బా! నువ్వు పసిపాపవనడం తప్పయింది" నవ్వింది కాత్యాయని.

"అది కాదు కాని ఇప్పుడు నేనెలా మారుతున్నానో నాకు తెలీటంలేదు. కాని గతంలో నేనేమిటో మాత్రం స్పష్టంగా తెలుస్తూంది..." సుజాత యాంత్రికంగా తాను జీవించిన అనుభవాలన్నీ చెప్తూంది. పుస్తకాలు తప్ప మరో ప్రపంచం తెలియని సుజాత అన్ని కబుర్లు చెప్తూంటే వినడానికి ఉత్సాహంగా ఉండి వింటూ కూర్చుంది కాత్యాయని. ఇద్దరికీ తెలియకుండా టైము దొర్లిపోయింది.

రాత్రి భోజనాలయిన తర్వాత కాస్సేపు పుస్తకాలముందు కూర్చొని నడుంవాల్చబోతూంటే వీధి తలుపు చప్పుడయింది. కాత్యాయని వెళ్ళి తలుపు తెరిచింది. టెలిగ్రామ్!

తల్లికి సీరియస్‌గా ఉందని శంకరం అన్నయ్య టెలిగ్రాం ఇచ్చేడు!

"ఎవరికి టెలిగ్రాం?" రాజశేఖరం వచ్చేడు. కాత్యాయని టెలిగ్రాం చూపించింది.

"అరే! కొంచెం పొద్దుండగా తెలిసినా బాగుండేదే!" అన్నాడు రాజశేఖరం.

"ఇప్పుడేం చేస్తాంలెండి! పొద్దునే వెడతాను" అంది కాత్యాయని.

"వెళ్ళి అక్కడే ఉండిపోక అమ్మకు తగ్గగానే వచ్చేయి. లేదా ఆవిడను కూడా తీసుకొచ్చేస్తే ఇంకా బాగుంటుంది" అన్నాడతను.

కాత్యాయని ఏంమాట్లాడలేదు.

వెళ్ళి తల్లిని గురించి ఆలోచిస్తూ మంచం మీద వాలింది.

కాత్యాయని ఊరు చేరుకునేసరికి సాయంత్రం నాలుగు గంటలు దాటింది. ఇంటిముందు శంకరం పిల్లలు ఆడుకుంటున్నారు. కాత్యాయనిని చూడగానే ఒకరి వెనకాల ఒకరు తుర్రున లోపలకు పారిపోయారు. ఏడాది చంటి పిల్లవాడు మిగిలిపోయాడు. కాత్యాయని పిల్లవాణ్ణి చేతుల్లోకి తీసుకుంది. వాడు తెల్లబోయి గుడ్లప్పగించి చూస్తున్నాడు. ముక్కు కారుతూన్నవాడిని కాత్యాయని తేరిపార చూసింది. శంకరం పోలికలు కొట్టొచ్చినట్లు కనబడుతున్నాయి. కాత్యాయని లోపలకు నడిచింది.

"వెధవకానా! ఏం చెయ్యమంటావ్ ఇప్పుడు అత్తయ్యవస్తే!" వదినగారి అరుపు వినబడింది.

పిల్లలు అందరూ బిక్కమొహాలు వేసుకొని వంటింటి బయట నిలబడ్డారు.

కాత్యాయని పరిస్థితి గ్రహించింది.

ఒకప్పుడు ఈ వాతావరణం అలవాటే అయినా ఇప్పుడు కొన్నాళ్ళ తర్వాత మళ్ళీ కొత్తగానే ఉంది.

కాత్యాయని వంటింటి దగ్గరకెళ్ళి నిలబడింది. వదినెగారు సత్యవతి రెండో వైపు తిరిగి ఉంది.

"బాగున్నావా వదినా?" అంది ఆమె తల్లి జాడ కనబడక ఇటూ అటూ చూస్తూ.

"ఏదో ఇలా ఉన్నాం! ఆ పెద్ద వెధవ సువ్వొచ్చేవని పరిగెత్తుకొచ్చి గిన్నెడు నూనె ఒలకపోసి తగలేశాడు. కోమటీ కోమటీ ఏం చేస్తున్నావంటే నూనె ఒలకపోసి ఎత్తుకుంటున్నానన్నాడుట! నేనూ అదే చేస్తున్నాను". తల్లికోసం చూస్తూన్న ఆత్రుతలో కాత్యాయనిని ఆమె వాగ్ధాటి ఆకర్షించలేకపోయింది. అలా అని మనసులో ఉన్నది ఆమె అడగనూ లేకపోయింది. ఇల్లంతా చూసినా తల్లి



కనబడకపోయేసరికి గుండె వేగంగా కొట్టుకుంటూంది.

"నాయనమ్మ ఎక్కడరా బాబిగా ?" గోడపక్కకు నిలబడ్డ పెద్ద మేనల్లుణ్ణి అడిగింది కాత్యాయని.

"దొడ్డి గదిలో ఉంది" అన్నాడు వాడు. చేతిలోసంచీ కింద పెట్టి తొందరగా దొడ్డి గదివైపు నడిచింది కాత్యాయని.

గుమ్మం దగ్గర నిలబడి లోపలకు చూసింది.

గదిలో పట్టపగలుకూడా చిమ్మ చీకటిగా ఉంది. గదికి ఉన్న ఒకేఒక్క కిటికీ కూడా మూసిఉంది. కొంతసేపు ఆమెకు గదిలో ఏమీ కనబడలేదు. తరువాత రెండు నిమిషాలకు మంచం ఆకారం అస్పష్టంగా కనబడింది. 'అమ్మా!' అని పిలవబోయి నిద్రా భంగం అవుతుందేమో నని—తటపటాయించి చప్పుడు కాకుండా తడుముకుంటూ కిటికీ దగ్గరకు వెళ్ళింది. బిగిసిఉన్న కిటికీ తలుపును బలవంతాన తెరచింది. ఎన్ని సంవత్సరాలయిందో ఆ తలుపు తెరచి! తలుపు తెరువగానే చెద పురుగులూ, బొద్దెంక పిల్లలూ తొందరగా ఇటూ అటూ పరుగెత్తడం మొదలుపెట్టేయి. పుచ్చి చీకిపోయి డొల్లలయిన కిటికీ తలుపుల్లోంచి పచ్చగా పొడి జల్లున రాలింది.

కాత్యాయని వెనక్కు తిరిగింది. మంచం మీద బల్లిలా అంటిపెట్టుకొని ఉన్న తల్లిని చూడగానే గుండె ఝల్లు

మంది. సుందరమ్మ రెప్ప వాల్చకుండా పూర్తిగా కళ్లు తెరచి ఇంటి కప్పువైపు చూస్తోంది. ఆవిడ శరీరంమీద కప్పిన బట్టే ఉచ్ఛ్వాసనిశ్వాసాలతో పైకీ కిందికీ ఆడుతూంది. కాత్యాయని మనస్సు కొంత కుదుటబడింది. గదంతా ఓసారి కలయ జూసింది.

గదిలో ఓ గోడకుదగ్గరగా పనికిరాని పాత చీకు దూలాలు పడి ఉన్నాయి. పైకప్పంతా బూజులు వ్రేలాడుతున్నాయి. ఒకటీ రెండూ మంచంమీద కూడా పడి ఉన్నాయి. కింద నేలంతా దుమ్ము నిండి పోయి ఉంది. ఓ కాలెత్తిన నులక కుక్కి మంచంమీద దిక్కులేని దానిలా పడిఉన్న తల్లిని చూస్తే కడుపులో దేవినట్లయింది కాత్యాయనికి.

మెల్లగా మంచం దగ్గరకు వచ్చింది. కండంతా కరిగిపోయి పుర్రెమీద చర్మం కప్పినట్లుగా ఉంది ముఖం. తెల్లని జుట్టు చిందరవందరగా నుదుటిమీదా చుట్టూ చెదిరిపోయి ఉంది. కదలిక లేని సుంద రమ్మ చూపులు భావరహితంగా తీవ్రంగా ఉన్నాయి.

కాత్యాయని మెల్లగా మంచం మీదకు వంగుతూంటే బట్టల నీచువాసన ముక్కు పుటాల్లోకి దూరింది. అలాగే తల్లి ముఖం మీద ముఖంపెట్టి చూసింది. కదలికలేని నీరులా ఉన్న సుందరమ్మ ముఖంలో ఒక్కసారి చిన్నరాయి విసిరినట్లుగా ఎన్నో భావాలు కదిలిపోయేయి. అంత జీవంలేని ముఖంలోనూ ఒక్కసారిగా ఏదో కొత్త కాంతి వచ్చింది. కను బొమలూ పెదవులూ వణికేయి.

"చిట్టీ!" నీరసంగా పిలిచింది సుంద రమ్మ. బలహీనంగా రెండు చేతులూ ఎత్తబోయింది.

"అమ్మా!" అని కాత్యాయని మంచం పట్టెమీద కూర్చుంది.

ఎండిపోయినట్లుగా ఉన్న సుందరమ్మ కళ్లు రెండూ రెండు చెరువులయిపోయేయి. కన్నీళ్ళు వరదలై పొంగి కళ్ళకు రెండు పక్కలనుంచీ ధారలుగా జారిపోయాయి.

"అమ్మా!" అని ప్రేమగా పిలుస్తూ కాత్యాయని తల్లి కన్నీళ్ళు తుడిచింది. దాంతో ఆవిడ దుఃఖం మరింత అయింది. ఆవిడ రెండు చేతులతో కూతురి చేతులు రెండూ పట్టుకుంది ఆప్యాయంగా.

ఏదో మాట్లాడుదామని ప్రయత్ని స్తూంది కాని గొంతు పెగలటం లేదు. కాత్యాయని హృదయం కరిగి నీరయి పోయింది. అంతరాంతరాల్లో ఎక్కడో దాగిఉన్న మమత హృదయమంతా ఆక్ర మించుకుంది.

"వచ్చేవా తల్లీ! నిన్ను చూడకుండానే వెళ్ళిపోతున్నా ననుకున్నానే చిట్టీ!" కాత్యాయని చేతుల్ని తన చేతులతో రాస్తూ అంది సుందరమ్మ.

కాత్యాయని కళ్ళల్లోంచి రెండు కన్నీటి చుక్కలు సుందరమ్మ ముఖం మీద పడ్డాయి.

"ఎలా అయిపోయేవమ్మా! నాకు ఎందుకు తెలియనియ్యలేదమ్మా?"

"ఏం చెప్పమంటావే తల్లీ!...... నీకోసమే ఎదురు చూస్తున్నానే! ఇంకా దగ్గరగా రామ్మా! నన్ను దగ్గరగా పట్టుకోవే! ఎలా ఉన్నావమ్మా"

కాత్యాయని ఎముకల గూడయిన తల్లి శరీరాన్ని తడిమింది.

"ఇంత బాధపడుతున్నావని నాకు తెలీదమ్మా!"

తనకోసం కూతురి కళ్ళల్లో పొంగుతూన్న కన్నీళ్లు సుందరమ్మకు కొంత ఉపశమనాన్నిచ్చేయి. ఎన్నాళ్ళనుంచో కడుపులో దాచుకుంటూన్న బాధంతా బయటికొచ్చేస్తూంది.

"చూడవే నన్నిందులో పారేసేరే! నేనెప్పుడు పోతానా అని చూస్తున్నారే!"

కాత్యాయని వినలేకపోతూంది. ఆవిడ నోట్లోంచి వచ్చిన ఒక్కొక్క మాట గుండెల్లో గునపంలా గుచ్చుకుంటూంది. ఐదు నిమిషాలముందు కిటికీ తలుపులు తెరువగానే చూసిన తల్లి ముఖం గుర్తుకొచ్చింది. అబ్బ! చావుబతుకుల మధ్య అల్లల్లాడుతూ భయంతో ఉండే మనిషిని ఏకాకిగా పనికిరాని వస్తువులా దొడ్డిగదిలో పారేసి ఎంత హింసిస్తున్నారు. ఆ చూపుల్లో ఎంత భయం గూడు కట్టుకొని ఉంది.

"ఉంటావామ్మా నా దగ్గర రెండు రోజులు?" సుందరమ్మ ఆందోళనతో చూసింది.

ఆవిడ మాట్లాడడం చూస్తూంటే ఒక జీవంలేని వస్తువు మాట్లాడుతూన్నట్లుంది.

"నిన్ను విడచి ఎక్కడికీ వెళ్లనమ్మా! నీతోనే ఉంటాను" అంది కాత్యాయని. సుందరమ్మ ముఖంలో కొంత ఊరట కనబడింది.

"ఆరు నెలలనుంచి నిన్నోసారి వచ్చి వెళ్ళమని ఉత్తరం రాయమని పోరుతున్నానే! భాస్కరాన్ని రాయమంటే వాడూ రాయలేదు. వీడూ రాయలేదు. రెండు నెలలనుంచీ రోజూ నేను ఇదే ఏడుస్తున్నానే! రెండు రోజులముందు స్పృహ తప్పిపోయిందట!..... నిన్న సాయంత్రం కాస్త మళ్ళీ ఒళ్ళు తెలిసింది...ఈ మూల పడిఉంటే ఓరోజు స్పృహపోతే మాత్రం ఏముంది? పదిరోజులుపోతే మాత్రం ఏముంది?...."

సుందరమ్మ ఆయాసపడుతూంది.

"మెల్లగా మాట్లాడమ్మా! ఆయాసపడకు...అన్నయ్య నిన్నరాత్రి టెలిగ్రాం ఇచ్చేడు. పొద్దున్నే బయలుదేరి వచ్చేను"

ఇద్దరూ రెండు నిమిషాలు నిశ్శబ్దంగా మాట్లాడక ఊరుకున్నారు. తరువాత సుందరమ్మ తిరిగి మొదలు పెట్టింది. ఇంతలో అడుగుల చప్పుడైతే కాత్యాయని సైగచేసింది. సుందరమ్మ ఊరుకుంది.

గుమ్మందగ్గర శంకరం నిలబడ్డాడు.

"ఎప్పుడొచ్చేవ్ చిట్టీ"

"పది నిమిషాలయింది". కాత్యాయని ఒకసారి శంకరంవైపు చూసి తల దించుకుంది. తల్లి ఉన్న పరిస్థితి చూస్తూంటే శంకరంతో మాట్లాడబుద్ధి కాలేదు. చూడబుద్ధి కాలేదు.

అతనే ఓసారి తెరచివున్న కిటికీవైపు చూసేడు. తనకు తానే ఏవేవో చెప్పడం మొదలుపెట్టేడు. తల్లంటే ఎంత ప్రేమగా చూస్తూన్నదీ, ఏమేమి మందులు ఇప్పించిందీ, ఏయే డాక్టర్లను తీసుకొచ్చిందీ చెప్పేడు. తిరిగి రాత్రి భోజనాలయ్యేవరకూ కాత్యాయని ఏకాంతంగా తల్లి దగ్గర కూర్చోనే లేకపోయింది. రాత్రి భోజనంచేసి దగ్గరకు వచ్చేసరికి తల్లి కళ్ళు మూసుకొని ఉంది. శంకరాన్ని అడుగుతే డాక్టరు ఇంజక్షను నిద్రపోవడానికిచ్చేడని చెప్పేడు.

కాత్యాయని వీధిలో కూర్చొని చీకట్లో బయటకు చూస్తూంది.

"చిట్టీ!" శంకరం కంఠం విన్నాక కూడా తల తిప్పలేదు ఆమె.

"తొమ్మిదిన్నర అయింది చిట్టీ! నిద్ర రావటంలేదా?" శంకరం ముందు కొచ్చేడు.

"లేదు" అంది కాత్యాయని దృష్టి మరల్చకుండానే.

శంకరం ఓ మడతకుర్చీ తీసుకొని వచ్చి కాత్యాయనిపక్కన కూర్చున్నాడు. ఆమె ఏమయినా మాట్లాడుతుందేమోనని చూశాడు. ఎంతసేపయినా మాట్లాడక పోయేసరికి ఓసారి గొంతు సవరించుకొని తానే అన్నాడు "రెండు రోజులముందు అమ్మకు స్పృహ తప్పిపోయింది. నాకు కూడా భయం వేసింది. మళ్ళీ నీకు కనబడుతుందో లేదోననిపించింది నిజం చెప్పొద్దూ! అందుకనే నీకు టెలిగ్రాం ఇచ్చేను..."

అర్థయుక్తంగా అతని ముఖంలోకి చూసింది కాత్యాయని.

"...రెండు నెలలనుంచి భాస్కరం వాళ్ళావిడ పుట్టింటికెళ్ళిందనీ, తర్వాత పిల్లలందరికీ జ్వరాలు వచ్చేయనీ ఏదో సాకు పెట్టి అమ్మను తీసుకెళ్ళనే లేదు. ఉత్తరాలెన్ని రాసినా జవాబు రాయడు పదిహేను రోజుల ముందోసారి వచ్చేడు. అమ్మపేర ఉన్న రెండెకరాలూ తనపేర రాయాలని చాలా పేచీపెట్టేడు. అమ్మ ఏమీ మాట్లాడకపోతే కోపం వచ్చి వెళ్ళిపోయాడు..."

శంకరం ఆగేడు.

అన్నగారు చెప్పదలచుకున్న మరో విషయానికి ఇది నాంది అని గ్రహించింది కాత్యాయని.

చివరకు మళ్ళీ ఎలా మొదలు పెట్టాలో తెలియక, "నువ్వేమంటావ్ చిట్టీ!" అన్నాడు శంకరం.

అతని ప్రశ్న అర్థమయినా, "దేన్ని గురించి?" అని అడిగింది కాత్యాయని.

"అదే! ... వాడా భాస్కరం ఏదో ఉద్యోగం చేసుకుంటున్నాడు. నాకంటే మంచి పరిస్థితుల్లోనే ఉన్నాడు. నేను కూడా ఇటువంటి విషయాల్లో నా కాళ్ళ మీద నేను నిలబడదామనే ఒకటి రెండు ప్రయత్నాలు చేశాను. అదృష్టం కలిసి రాలేదు. అదీ కాక వాడికి మా అంత బాదరబందీ కూడా లేదు. ఇద్దరే పిల్లలు. ఇంక అమ్మ కూడా వాడి దగ్గర ఉన్న ఆర్నెల్లలోనూ ఇంట్లో అన్ని పనులూ చేస్తుంది. మా యింటి కొచ్చేసరికి లేవ లేకుండా ఇలా పడిపోతుంది. అమ్మకి ఇప్పించని మందు లేదు. నేనూ అదీ పిల్లలూ అందరం ఆవిడకి చాకిరీ చేస్తున్నాం. కంటికి రెప్పలా చూసుకుంటున్నాం. అందులోనూ మా యింట్లో ఉండే ఆరు నెలలూ అయిపోయినా పోయిన రెండు నెలల నుంచీ మా యింట్లోనే ఉంటూంది. అటువంటప్పుడు ఆ రెండకరాల భూమి నా పేర వ్రాయడం సబబు కాదూ?"

కాత్యాయనికి విపరీతమైన జుగుప్స కలిగింది.

కన్నతల్లి రెండు నెలలు తన దగ్గర ఉందని ఏడుస్తున్నాడు. ఇంత సిగ్గూ ఎగ్గూ లేకుండా స్వార్థాన్ని వెళ్ళగక్కు కోగలిగే మనుష్యులు...ఛ! తన కంటె చాలా పెద్దవాడయిపోయాడు కాని అన్న గార్ని ఈ చెంపా ఆ చెంపా నాలుగు వాయించాలనిపించింది. ఒక్కసారి నోటి కొచ్చిన మాటలన్నీ దులిపెయ్యా లనిపించింది. కాని కాత్యాయనికి తల్లి ఉన్న పరిస్థితి గుర్తుకొచ్చింది. వీళ్ళ

పంచను వదిలి తల్లిని కదపలేనప్పుడు వీళ్ళను అనవసరంగా రెచ్చగొట్టి కూడా ప్రయోజనం లేదనుకుంది. అయినా కనీసం తను కార్యం సాధించుకోవడాని కేనా మనసులోని పేరాశలను కప్పి పుచ్చుకోలేని శంకరం మనస్తత్వం, చేతకాని తనమో, తెలివి తక్కువ తనమో, దుష్టత్వమో అర్థం కాలేదు.

"మాట్లాడవేం చిట్టీ!" శంకరం రెట్టించేడు.

"ఏం మాట్లాడను అన్నయ్యా!అమ్మ పరిస్థితి చూస్తే అలా ఉంది. ఇటువంటి ఆలోచన లన్నింటికీ ఇదే సమయ మంటావా?" ఆమెకు తెలియకుండానే ఆమె కంఠం పరుషంగా మారుతూంది.

కానీ, శంకరం తన కార్య సాధనలో ఇవన్నీ గమనించే స్థితిలో లేడు."అమ్మ కూడా అలా ఎందుకుండాలి చిట్టీ! నా మాటలు అర్థం చేసుకోదు. ఓ మాట స్పష్టంగా మాట్లాడొచ్చు కదా! ఈ విషయం ఎత్తినప్పుడల్లా జవాబు చెప్ప కుండా బుడి బుడి దీర్ఘాలు తీస్తుంది. మా బాధ అర్థం చేసుకోదు..."

కాత్యాయని సహనాన్ని కోల్పో తుంది. ఏమిటి వీళ్ళ బాధ? ఆస్తి రాయలేదనేగా! అవిడ బాధ ఎవరికీ అర్థం కాదా! ఇటువంటి పరిస్థితుల్లో తన అశక్తతకి తనకే సిగ్గనిపించింది ఆమెకు. దీనాతి దీనమయిన పరిస్థితిలో వున్న తల్లిని రక్షించుకోలేని అసహాయత!

"ఇప్పుడు న్నేవేం చెప్పలేనన్నయ్యా!" కాత్యాయని తలపుంచుకుంది.

"పోనీ అమ్మకు నువ్వు చెప్ప కూడదూ!"

"సరే! చూద్దాం." ఇంకేం వినవలసి వస్తుందోనని కాత్యాయని అక్కడి నుంచి లేచి మెల్లగా వెళ్ళిపోయింది.

తన జవాబు తనకే అసహ్యంగా తోచింది. నలుగురి మధ్య మర్యాదగా, మంచితనంగా నడచుకోడానికి చుట్టూ ఉన్నవారి మంచితనం కూడా ఎంత అవసరమో అర్థమవుతూంది. రాజశేఖరం గారి యింట్లో అలవాట్లూ పద్ధతులూ ఎలా ఉన్నా పెద్ద వాళ్ళ నుంచి చిన్న పిల్లలవరకూ నిగూఢంగా ఉన్నవాళ్ళ లోని సంస్కారం ఇప్పుడు స్పష్టంగా కళ్ళ ముందు కనబడుతుంది. ఈ పందుల వంటి మనుష్యుల మధ్య మసి లితే వళ్ళంతా బురద తప్ప మరేమీ లేదు. అయినా తను చేయగలిగిందే ముంది. సాధ్యమయినంత త్వరలో ఆర్థి కంగా నిలబడాలి అనే ఆత్రుత కలిగింది ఆమెకు.. కాని అది మరుక్షణంలో జరిగే పని కాదు.

కాత్యాయని తల్లి ఉన్న గదిలోనే తనూ క్రింద రెండు పాతబట్టలు పరుచు కొని పడుకుంది.

దోమలు జుయ్ మని రొద చేస్తూ వీర విహారం చేస్తున్నాయి. కాత్యాయనికి నిద్ర పట్టలేదు. అలాగే ఆలోచిస్తూ పడుకుంది.

ఓ గంట తరువాత "అమ్మాయ్ చిట్టీ!" అని సుందరమ్మ కంఠం నూతిలోంచి వచ్చినట్లు నీరసంగా విన బడింది.

"ఏం కావాలమ్మా?" కాత్యాయని లేచింది.

"ఇక్కడే ఉన్నావా అమ్మా?అన్నం తిన్నావా?"

"ఆఁ"

"ఇలా కూర్చో!"

"నువ్వు నిద్రపోకపోతే అలసట కలుగుతుంది. నిద్రపో అమ్మా! తర్వాత మాట్లాడుకుందాం"

"ఇంక నిద్ర రాదే! ఈ వేళకు అయిపోయింది. నిన్ను ఎన్నో ఏళ్ళ తర్వాత చూసినట్లుంది. రామ్మా! నీతో చాలా మాట్లాడాలి."

కాత్యాయని లేచి ఎత్తు పీట వేసుకొని సుందరమ్మ తల వైపు కూర్చుంది. సుందరమ్మ తల కదిపి కాత్యాయని ముఖంలోకి చూసింది.

"అన్నయ్య ఏమయినా చెప్పేడా నీతో?"

"లేదు" తల్లిని అనవసరంగా అన్నయ్య చెప్పిన మాటలు చెప్పి బాధ పెట్టదలచుకోలేదు కాత్యాయని.

"అక్కడ రాజు పిల్లలందరికీ నీ దగ్గర బాగా చనువయిందా?"

"ఆ!"

"అందరూ నీతో బాగా మాట్లాడుతారా?"

"ఆ! వాళ్ళందరూ ఎంతో మర్యాద తెలిసిన వాళ్ళు. అందరూ నన్నెంతో గౌరవంతో చూస్తారు."

"రాజు?"

"ఆయన కూడా."

"నీతో ఎక్కువ మాట్లాడుతాడా?"

"ఆయన ఎవరితోనూ, తన కన్న బిడ్డలతోనే ఎక్కువగా మాట్లాడరు. పగలంతా ఏదో పని కల్పించుకొని ఎప్పుడూ సందడిగానే ఉంటారు."

కాత్యాయనికి రాజశేఖరం మీద తల్లి కున్న ఆసక్తి వింతగా కనిపించింది.

"వంట ఎవరు చేస్తున్నారు?"

"వంటలక్క ఈ మధ్యనే మానేసింది. అప్పటినుంచి నేనే చేస్తున్నాను."

"చిట్టీ! నేనోమాట చెప్తాను. నన్ను అసహ్యించుకోకుండా వింటావా?"

"ఏమిటమ్మా?" కాత్యాయని ఆశ్చర్యపోయింది.

"చెప్పేక నా మీద నీకు నిజంగా అసహ్యం కలిగినా అది చూపించకు. ఇలా ప్రేమగా ఉండు. నువ్వు కూడా నన్ను ద్వేషిస్తే ఇంక భరించలేను" "ఛ! అదేమిటి? చెప్పమ్మా! ఏమీ ఫర్వాలేదు. నా కళ్ళకి మాత్రం మనిషి మనసులో ఉన్నవన్నీ బయటకు చెప్పినప్పుడే ఇంకా స్వచ్ఛంగా కనబడతాడు"

"మీ నాన్న బ్రతికి ఉన్నన్నాళ్లు నాకు దగ్గరగా రావాలని, ఇద్దరి మనసులు ఒకటై ఎంతో అన్యోన్యంగా ఉండాలని ఎంతో ప్రయత్నించేడు. కాని నేను ఆయన్ను చాలా హింసించేనే! అందుకే ఇలా అనుభవిస్తున్నానమ్మా!"

ఈ మాటలకు కాత్యాయని చాలా ఆశ్చర్యపోయింది. తల్లి చెప్పిన విషయం తనకు తెలుసు. కాని ఆ సత్యాన్ని తల్లి జీవించి ఉండగా గుర్తించగలదని ఎప్పుడూ అనుకోలేదు. ఒకరకంగా తల్లికి తనను దూరంగా ఉంచింది తండ్రి మీద అవిడకు గౌరవం లేదన్న విషయం తన మనసులో నాటుకు పోవడమేనేమో! అయినా ఇంత ఆలస్యంగానయినా, దాని వలన ఏ ప్రయోజనమూ నెరవేరని పరిస్థితుల్లోనయినా, తల్లి నోటి వెంబడి ఈ మాటలు వినడం ఎంతో ఆనందం కలిగించింది. తమ ఇద్దరి మధ్యా ఉన్న దూరాలు తొలగిపోయినట్లయింది. తల్లంటే ఎంతో జాలీ సానుభూతీ కలిగేయి.

"ఇదేనా అమ్మా?"

"కాదు...ఆయనకు చేసిన దానికి నేనిలా అనుభవించవలసిందే! నా కసి పిస్తూ ఉంటుంది. కన్న కొడుకులు... శరీరంలో శరీరమైన వాళ్ళు ఇలా పెరటి గదిలో నిర్లక్ష్యంగా పారేసి ఏడిపిస్తున్నా ఈ బాధల మధ్య కొంచెం సంతృప్తి కూడా కలుగుతోందమ్మా! ఏమిటో తెలుసా? ఆ మహానుభావుణ్ణి బ్రతికి నన్నాళ్ళూ పీడించి పిల్లల్ని కూడా దూరం చేసి హింసించినందుకు తగిన శాస్తినే అనుభవిస్తున్నానని!...

"అమ్మా!" కాత్యాయని హృదయం స్పందించింది.

"పోనీలే చిట్టీ! మాటకీ, మనస్సుకీ, స్వభావానికీ నిన్ను చూస్తే మీ నాన్నను చూసినట్లుంటుందే! నేను మీ నాన్నతో పాటు నీకు కూడా అన్యాయం చేశాను. ఆయన వాళ్ళ స్నేహితుడి కొడుక్కి నిన్నిద్దామనుకుంటే నీకు ఆయన సంబంధం చూడడం ఇష్టంలేక అహంకారంతో రహస్యంగా పదివేలు కట్నం ఇచ్చి పైకి ఊరికే చేసుకుంటున్నారని చెప్పి నీ గొంతు కోసేసు తల్లీ! ఛస్తానని బెదిరించి ఆయన కుదిర్చిన సంబంధాన్ని తోసి పుచ్చేను.' అప్పుడు అవన్నీ ఒళ్ళు తెలియక పొగరుతో చేసిన పనులు చిట్టీ. ఇప్పుడు అన్నీ తెలిసి కూడా ఓ పని చేశానమ్మా! నన్నర్థం చేసుకోగలవా?"

"చెప్పమ్మా!"

"నిన్ను అన్నయ్యల దగ్గర నాలుగేళ్లు మగ్గి పోవడం చూశాను తల్లీ! నీకు ముందు రోజులు ఎలా గడుస్తాయో అంతా అయోమయంగా కనిపించింది నాకు! వాళ్ళునిన్ను మర్యాదగా చూడరు. వాళ్లని వాళ్ళే పోషించుకోలేక రోజుకు రోజు దరిద్రంలో మునుగుతున్నారు. ఇక్కడ ఉన్నన్నాళ్ళూ నువ్వు చదువు కోనూ లేకపోయావు. వీళ్లదగ్గర చాకిరీ చెయ్యడానికే నీకు సమయం చాలదు. మాటి మాటికీ సూదుల్లాంటి మాటలని బాధ పెడుతూంటారు! ఎందుకో నువ్వు నీ మొగుడి దగ్గరకెళ్ళి ఇంక కాపురం చెయ్యడం జరగదని పించింది. నాకు రోజూ నీ ఆలోచనే అయింది చిట్టీ! నీకు ఒకదారి దొరికితే నేను చచ్చిపోయినా ఫరవాలేదని పించింది. అప్పుడు రాజశేఖరం నా దృష్టిలోకి వచ్చేడు. కొంచెం వయసు మీరినవాడే' కాని మర్యాద తెలిసినవాడు. ఉన్నవాడు. అందులోనూ నీ స్వభావానికీ, మంచి తనానికీ నువ్వక్కడ ఎంతో బాగా ఇముడుతావని అనిపించింది. అందుకనే నువ్వక్కడయినా సుఖపడతావనే ఆశతో ఏదో మిష పెట్టి నిన్నక్కడికి తీసుకెళ్ళేను. ఈ విషయం అప్పుడు నీకు చెప్తే అసహ్యించుకుంటావనీ, ఉండకుండా వచ్చేస్తావనీ చెప్ప లేదు. తీరా ఇప్పుడు కూడా చెప్పకుండా ఉంటే నీకాదృష్టి రాదేమో, నిన్ను ఎన్నాళ్ళయినా అలా ఓ దాసీదానిలా చూస్తారేమోనని భయం! అందుకే నమ్మా ఎప్పుడొస్తావా అని తహతహ లాడి పోయేను. ఇప్పుడు నీకూ వాళ్ళ మంచి తనమూ, అక్కడనీకుండే అవకాశాలూ తెలిసుంటాయి...... ఇప్పుడు నన్ను ఏమనుకున్నా ఫరవాలేదమ్మా! కాని నాకు మాత్రం ఈ ఒక్కపనీ చెయ్యడానికి సాహసించి నందుకు సంతోషంగానే ఉంది"

కాత్యాయని రెప్ప వాల్చకుండా తల్లి వైపు చూస్తూంది. తనను రాజశేఖరం

గారి ఇంటికి తీసుకెళ్ళిన మొదటిరోజు తనను గురించి తల్లి ఆయనతో చెప్తూన్న దృశ్యం గుర్తుకొచ్చింది. ఆ రోజు ఆవిడ ముఖంలోని ఆవేదన ఆత్రుత కళ్ళకు కట్టినట్లు కనబడుతూంది. తల్లి అంతగా బాధపడుతూన్న తన భవిష్యత్తును గురించి, మనసులో అంత ఆందోళన లేకపోగా ఆవిడ పొందిన మనోవేదనకు మనసు విలవిల్లాడింది.

"నువ్వేమంటావ్ చిట్టీ!"

కాత్యాయని ఆలోచించింది. తన కక్కడ భవిష్యత్తును తీర్చి దిద్దుకోడానికి చాలా మంచి అవకాశం దొరికిన మాట నిజమే,కానితల్లి చెప్పిన సలహాలో ఆవిడ ఆదుర్దాయే కాని ఏ మాత్రం ఔచిత్యం గోచరించలేదు. అయినా తన మనసులో ఉన్న విషయాన్ని స్పష్టంగా చెప్పి తల్లిని కలత పెట్టదలచుకోలేదు.

"నేను కూడా ఆలోచించాలమ్మా! ఇప్పటిదాకా నా మనసులోకి ఆ ఆలోచన రాలేదు"

"నాకు తెలుసు! బాగా ఆలోచించు, చిట్టీ! విడిగా ఒక్కరైనా ఆడదానివి ఎన్నాళ్ళుంటావు. పెద్ద దానివైన తరువాత ఇలాగే ఇంకో పదేళ్లుపోతే వాళ్లు వాళ్ళే! నువ్వు నువ్వే! నీకెవరుంటారు? నీ సంసారం, నీ వాళ్లు నీ కుండాలి"

"నువ్వు బెంగ పెట్టుకోకమ్మా! నేను పరీక్షలకి కట్టేను. పాసు కాగానే ఉద్యోగం కూడా రావచ్చు........"

"చదువుకున్నా,వాళ్ళందరూఅంతగా నిన్ను ఇష్టపడినప్పుడు...కల వాళ్ల వాళ్ళింట్లోనే ఉంటే బాగుంటుంది"

"అలాగేనమ్మా"



మనసులోని ఆందోళనసంతా వెలిబుచ్చడంతో సుందరమ్మ కెంతో విశ్రాంతి కలిగింది. మాట్లాడుతూ మాట్లాడుతూ అలాగే నిద్రపోయింది. కాత్యాయని మెల్లగా లేచి వచ్చి తనపక్కలో పడుకుంది.

కాత్యాయని మర్నాడు ఉదయమేలేచి పనిమనిషి సహాయంతో తల్లి మంచాన్ని ఆ చీకటి గదిలోంచి బయటకు తెచ్చి గదిలో పైన బూజులు దులిపి క్రింద శుభ్రంచేసి దోమలూ అవీ పోయేందుకు మందు చల్లింది. నీచు వాసనతో ఉన్న తల్లి పక్క బట్టలను మార్చింది. తన బట్టల్లో ఉన్న తెల్లచీర ఒకటి తెచ్చి తల్లికి బట్టలు మార్చింది. రెండుమూడు గంటలు బయట ఉంచిన తర్వాత తిరిగి తల్లి మంచాన్ని లోపలకు మార్చింది.

కాత్యాయని ఇవన్నీ చేస్తూంటే సత్యవతి అటూ ఇటూ వస్తూ కొరకొరలాడుతూ చూస్తూనే ఉంది. చూసికూడా పట్టించుకోని మనిషిని మర్యాదకోసం పిలవడం కాత్యాయనికి ఇష్టం లేకపోయింది. శంకరం ఇంట్లో లేనేలేడు. అంతా అయిన తర్వాత వచ్చేడు.

కాత్యాయని కూడా మనసులో ఎంత స్వచ్ఛంగా ఉందామనుకున్నా సాధ్యం కావటం లేదు. ముసలావిడని ఇంత నిర్లక్ష్యం చేస్తూన్న అన్నయ్య కుటుంబం పట్ల క్షణక్షణానికీ ద్వేషం ఎక్కువవుతూంది. కనీసం పిల్లల్ని కూడా దగ్గరకు తీసుకోలేక పోతూంది. ఒకటి రెండుసార్లు వాళ్ళని దగ్గరకి పిలిచింది కాని వాళ్లు బూచాణ్ణి చూసినట్లు చూసి పారిపోయారు. అసలు ఆ ద్వేషభావం తన ముఖంలో ప్రస్ఫుటంగా కనిపిస్తూందో లేక ఆ తలిదండ్రులలోంచి పిల్లల్లోకి కూడా తన

పట్ల శత్రుభావం పాకిందో అర్థం కాలేదు. నిమిష నిమిషానికీ అది రగులుతూనే ఉంది. చివరికి అంటుకుంది.

కాత్యాయని వంటింటి పక్కనుంచి వెడుతూ పెద్దగా సత్యవతి కంఠం విని ఆగిపోయింది.

"...దున్నేటప్పుడు దూడల్లోకీ మేసేటప్పుడు ఎద్దుల్లోకీ అన్న సామెతగా ఉంది. మందులకీ డాక్టర్లకీ డబ్బు పోసి ఇల్లంతా గుల్లచేసుకొని రెక్కలు ముక్కలయేటట్లుగా చాకిరీ చేసిందంతా పోయింది. మమ్మల్ని గురించి అందరూ చెవుల్లోదూరి ఆడుకొనే గుసగుసలే చివరకు మాకు మిగిలేయి. అందరి బ్రతుకులూ తాకట్టు పెట్టి వైద్యం చేయించేం. చివరకు ఈ స్థితికొచ్చింది. ఈవిడ అభయ హస్తాలతో వచ్చింది. అందర్నీ ఉద్ధరించేందుకు! అయినా తానుంటే కాని ఇక్కడ ఏ సౌకర్యమూ కలగనట్టు అన్ని పనులూ కలిపించుకొని చేసుకోడానికి కూడా నేర్పుండాలి!..." సత్యవతి పొయ్యిముందు కూర్చొని పిల్లాడికి పాలిస్తూ పొయ్యిలో కట్టె ఎగతోస్తూ రాజుకుంది. సత్యవతి కంఠం విని కాత్యాయనిని వంటింటి గుమ్మం దగ్గర చూసి శంకరం కూడా వచ్చి నించున్నాడు. సత్యవతి ఇద్దర్నీ చూడలేదు. మళ్ళీ మొదలు పెట్టింది.

"... బోల్డెట్టి భోజనానికి పిలిస్తే మూకుడు తీసుకొని వీధిలోకి ముష్టికెళ్ళిందట. ఉన్న కాపురం సౌక్యం లేదు. పరాయి వాళ్ళింట్లో పరువు నమ్ముకొని తలదాచుకోడానికి తనకి వెరపులేకపోయినా లోకానికి వెరవాలి. ఇంతింత సాహసాలు మాయింటా వంటా ఎరగేం! అయినా మా ఖర్మ కాలింది! అయిన వాళ్ళు కులుకుతూంటే అందరూ మమ్మల్ని కాకుల్లా పొడుస్తున్నారు.... ఆరునెలలు వంటిమీద స్పృహ లేకుండా మనిషి మంచం పడితే చీమ కుట్టినట్లు లేదుకాని ఈ వేళ ఊడుతుందనే సరికి మూట కట్టుకోవద్దూ మరి!"

పొయ్యిమీద అన్నం పొంగింది. సత్యవతి ఏకపాత్రాభినయం ఆపి గిన్నె మీద మూత దించి గరిటెతో అన్నం కలుపుతూంది.

కాత్యాయనికి సత్యవతిఅరుపులు కుక్క మొరుగుల్లా వినిపించేయి. తనవరకూ ఎవరేమన్నా ఆమె లెక్క చేయదలచుకోలేదు. అయినా ఆ విధంగా తనను గురించి అనడానికి వదినెకు హక్కు కూడా లేదు. బయటివాళ్ళు కాకుల్లా పొడిచినా, పొడవక పోయినా ఇటువంటి మాటలు విన్న తరువాతైనా అందరూ లోకువ తీసుకుంటారు. ఒక రకంగా ఆలోచిస్తే అన్నిటికీ జవాబు చెప్పకుండా ఒదిగి ఉండడం వలననే వీళ్ళిలా రెచ్చిపోతున్నారనిపించింది.

అదీగాక తల్లి అసహాయతని లోకువగా తీసుకుని ఆవిడ పరిస్థితిని గమనించకుండ అన్నిన్ని మాటలనడం మరీ అమానుషంగా కనిపించింది. ఆమె నోటిముందు అన్నగారు నోరు మెదపలేడని కూడా తెలుసు! అందుకనే ఈ దండయాత్రను సాగనీయ కూడదని నిశ్చయించుకుంది కాత్యాయని. బిగిసిపోయి ఎదురుగా నిల్చునే విననట్లుగా ఉన్న అన్నగారిని ఉద్దేశించి కాత్యాయని అంది

"అన్నయ్యా! ఆరునెలలు అమ్మకి జబ్బుగా ఉంటే కనీసం నాకు ఉత్తరం కూడా రాయలేదు. ఆవిడ ఆస్తులేం

నేను దోచుకోవాలని రాలేదు. మీ ఆస్తు లంతకంటే దోచుకోవాలని రాలేదు. తల్లి ఇలా మంచాన పడిఉన్నప్పుడు నా కాపురం నేనేమి చేసుకున్నా నేను ఎంత పరాయి పంచన పడిఉన్నా ఆవిడను వచ్చి చూసే అధికారం నాకుంది. ఈ పరిస్థితుల్లో అమ్మను ఇక్కడ నుంచి కదిలించడానికి వీల్లేదు. ఈ రోజునుంచి నేను వేరే వండుకుంటాను. లేదా ఏ హోటలు నుంచో తెప్పించుకొని తింటాను. దేవుడి దయవల్ల అమ్మకు తగ్గిపోతే నాతో తీసుకొని పోతాను. అందుకని వీటికి పిల్లిమీదా ఎలుకమీదా పెట్టి సాధింపులూ, రాద్ధాంతాలూ అనవసరం..."

సత్యవతి పిల్లవాణ్ణి ఎగేసుకుని కాత్యాయని మీదకొచ్చింది.

"ఇప్పుడు నిన్ను లేని మాట ఏమన్నానమ్మా అంత పౌరుషం? ఉన్న మాటంటే ఉలుకెక్కువట!"

"ఏమిటి వదినా ఆ ఉన్నమాట?"

"ఎందుకు నా నోరు విప్పితే మంచిది కాదు. వినేందుకు నీకు సిగ్గున్నా లేకపోయినా, చెప్పేందుకు నాకు సిగ్గుండాలి!"

కాత్యాయనికి ఒళ్ళు మండిపోయింది. శంకరం వైపు తిరిగి అంది

"అన్నయ్యా! నీకు చెప్తున్నాను. ఎప్పుడూ ఇప్పటిదాకా విప్పలేదు కాని విప్పితే నా నోరు కూడా అంత మంచిది కాదు! ఎవరిహద్దుల్లో వాళ్ళు ఎవరి ఒళ్ళు వాళ్ళ దగ్గర పెట్టుకొని ఉండడం మంచిది. చెప్పుతో కొట్టి పువ్వులతో పూజ చెయ్యమంటే ఎప్పటికీ చెయ్యరు. అమ్మను గాని నన్ను గాని పల్లెత్తు మాటన్నా సహించేది లేదు. ఈ ఊరి కావూరెంతో, ఆ ఊరికీవూరూ అంతే నన్నా మాట మరచిపోవద్దు. ఇంట్లో చెట్టంత మగవాడుండగా ఆడది ఇంటి కప్పెగిరి పోయేటట్లు అరవడం చూడ్డానికీ వినడానికీ కూడా బాగుండదు!" కాత్యాయని గిరుక్కున వెనక్కు తిరిగి వెళ్ళిపోయింది.

సత్యవతి సహజమైన వాక్చాతుర్యం ఒక్కసారి ఎవరో పట్టి గొంతు బిగించినట్లుగా ఆగిపోయింది. అయిదు నిమిషాలదాకా ఆశ్చర్యంనుంచి కోలుకోలేక పోయింది.

కాత్యాయని వెళ్ళి తల్లి పక్కలో కూర్చుంది. మనసులో ఉన్నదంతా బయటకు అన్న తరువాత కొంత సంతృప్తి చెందింది ఆమె మనస్సు.

కూతురి ముఖంలో ఇంకా చెరగని భావాన్ని చూసి, "ఏమయింది చిట్టీ! వదినె కేకలేస్తూంది?" అంది సుందరమ్మ.

"ఏం లేదమ్మా!" తల్లి ముఖం మీద చెదిరిపడ్డ జుట్టును వెనక్కు తోసి ప్రసన్న వదనంతో చూసింది కాత్యాయని.

అరగంట తర్వాత ఏమను కున్నాడో ఏమో శంకరం అక్కడకు వచ్చేడు. ఏమీ జరగనట్లుగానే కాస్సేపు అదీ ఇదీ మాట్లాడేడు. తరువాత కాత్యాయనిని వచ్చి భోజనం చెయ్యమన్నాడు కాత్యాయని ముందు నిరాకరించినా అన్నగారు మరీ మరీ అడుగుతూంటే తాడు తెగే దాకా లాగడం ఇష్టంలేక సరేనంది.



# 6

కాత్యాయని వెళ్ళిన నాలుగు రోజులకు సుందరమ్మ కన్ను మూసింది. తాను వెళ్ళగానే తల్లి తనతో మాట్లాడిన తీరు చూస్తే తనతో ఆ మాటలు మాట్లాడ డానికే ఆవిడ శక్తి నంతా కూడ బెట్టు కొని కొన ఊపిరితో తన కోసం ఎదురు చూసి నట్టనిపించింది కాత్యాయనికి. ఎందుకంటే వచ్చిన రోజూ, మర్నాడూ సుందరమ్మ కాత్యాయనితో ఏం మాట్లా డిందో ఏమో, తరువాత ఇంచు మించుగా చనిపోయే వరకూ వంటిమీద స్పృహే లేదు. ఎప్పుడైనా కన్ను తెరచి చూసినా దగ్గర కొచ్చేది కూతురో, కోడలో, కొడుకో, డాక్టరో కూడా తెలుసుకొనే స్థితిలో లేదావిడ.

రోజూ తెల్లవారగానే కాత్యాయని వెళ్ళి తల్లి పక్క బట్టలు మార్చి చుట్టూ శుభ్రం చేసేది. ఆ రోజు ఉదయం వెళ్ళి మామూలుగానే బట్టలు మార్చడానికి తల్లి వంటిమీద చేయివేస్తే చల్లగా తగి లింది. కాత్యాయని గుండె ఝల్లుమంది. వెంటనే బయటి కొచ్చి శంకరాన్ని డాక్టరు దగ్గరకు పంపి తాను తిరిగివెళ్ళి తల్లి దగ్గర కూర్చుంది. శ్వాస లేదు. డాక్టరు రాక ముందే కాత్యాయనికి తెలి



సింది తల్లి చనిపోయిందని. డాక్టరు సంగతి చెప్పి వెళ్ళిపోయాడు. కాత్యా యనీ, శంకరం ఒకళ్ళ ముఖాలొకళ్ళు చూసు కున్నారు. భాస్కరాన్ని తీసుకొ స్తానని శంకరం బయలు దేరేడు.

కాత్యాయని ఒంటరిగా తల్లి మంచం పక్కనే కూర్చుంది. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. ఎండి పోయిన తల్లి శరీరం వైపు చూసింది. ఏనాడైనా ఇందులో జీవం ఉందా అన్నట్లుగా ఉంది శరీరం. రాజ శేఖరం ఇంటి దగ్గర తనను దింపడానికి వచ్చిన తల్లి ఆకారానికీ,తాను చూస్తూన్న తల్లి శవానికి పోలికే లేదు. కాత్యాయనికి తమ కుటుంబ పరిస్థితుల వల్ల కలిగిన దైన్యం తప్ప తల్లి చనిపోయిందని ఆ క్షణంలో ప్రత్యేకంగా ఏమీ విచారం కలగడం లేదు. మానసికంగా, శారీర కంగా కృశించి పోయిన తల్లి – కాని కాలంలో క్షణం కూడా ప్రాణంతో ఉండ డం అనవసర మనే అనిపించింది.

చివికి పోయిన తలుపుల్లో, చౌడుకారు తూన్న గోడల్లో రోజు రోజూ బూజు అల్లు కుంటూన్న ఇంటి కప్పులో, అన్నిటిలోనూ చావే ప్రతిబింబిస్తూంది. అలా మంచం ప్రక్కన కూర్చొని ఉండగా భవిష్యత్తుపై ఆశలూ, ఇన్నా ళ్ళుగా కన్న కలలూ అన్నీ కర్పూరంలా హరించి పోయాయి. గతం మాత్రం ఒక విషాద గీతంలా పదే పదే ముందుకు వస్తూంది. ఆస్తినే దృష్టిలో పెట్టుకొని, తల్లి గుండెలో తమ భవిష్యత్తు గూర్చి ఏర్పడిన గాయాన్ని గుర్తించ కుండా ఆమెను హింసించిన అన్నలపై వింతగా జాలి కలుగు తూంది. ఆ క్షణంలో ఇద్దరూ కూడా తనకంటే ఎన్నో ఏళ్ళు చిన్న వాళ్ళుగానే అనిపించింది.

కాత్యాయని మనసు రెక్కలు కట్టుకొని నల్లని మబ్బుల్లోకి మెల్లగా చొచ్చుకుపోతూంది.

భాస్కరం ఏడుపుతో ఉలిక్కిపడింది కాత్యాయని. తల తిప్పిచూసింది. రెండు చేతులతో తల పట్టుకొని పెద్దగా ఏడుస్తూన్న భాస్కరాన్ని చూడగానే ఎంతో ఆశ్చర్యం కలిగింది. శంకరం తల పక్కకు తిప్పుకొని నిలబడ్డాడు. అప్పటి దాకా వాళ్ళిద్దరంటే కాత్యాయని మనసులో కలిగిన జాలి వాళ్ళను చూడగానే అంతలో మాయమైంది. దుఃఖిస్తూ అతను తల్లిని గురించి వాపోతూన్న మాటలు వింటూంటే భాస్కరం పట్ల పూర్తిగా జుగుప్స కలిగింది. బ్రతికున్నన్నాళ్ళూ క్షణం ఆమె మనస్సుకు విశ్రాంతి నీయని మనుషులకు ఎందుకొచ్చిన కన్నీళ్ళు? అప్రయత్నంగా కాత్యాయని కళ్ళలో నీళ్ళు నిండేయి.

కాత్యాయని కళ్ళు తుడుచుకొని చూసింది చిన్న వదినా పిల్లలూ వచ్చేరేమోనని. ఎవరూ వచ్చినట్టు లేదు. ఎందుకు అనవసరంగా వాళ్ళను తీసుకొస్తే రూపాయో రెండో ఖర్చనుకున్నాడేమో ననుకుంది.

అయిదు నిమిషాల తరువాత భాస్కరం చల్లబడ్డాడు. మెల్లగా ఇరుగూ పొరుగూ నలుగు రైదుగురు పోగయ్యారు. శంకరం, భాస్కరం మెల్లగా పక్కకు జరిగి ఏమో మాట్లాడుకుంటున్నారు. కాత్యాయని కేదో అనుమానం వచ్చి రెండడుగుల్లో వాళ్ళ దగ్గర కెళ్ళింది.

"జరుగవలసిన వన్నీ సవ్యంగా జరగ నీయండి! మీరు డబ్బు పెట్టుకోలేకపోతే నేనిస్తాను" అంది కాత్యాయని. అన్నదమ్ము లిద్దరూ ఒకళ్ళ మొఖాలొకళ్ళు చూసుకున్నారు. ఇంతలో కుక్క లేడ్చినట్టుగా పెద్ద గొంతువిని ఉలిక్కిపడింది. అమ్మలక్కల మధ్య కుయ్యో మొర్రో మన్నట్టు ఏడుస్తున్న సత్యవతిని చూసి తల తిప్పుకొని తల్లి శరీరం ఉన్న గదిలోకి వెళ్ళింది.

మెల్లగా తన చెవుల పక్కనే అందరి కంఠాలూ వినబడుతున్నాయి. సుందరమ్మ బ్రతికున్న రోజుల్లో చేసిన ఘన కార్యాలను కీర్తిస్తున్నారు అందరూ. అదంతా అసత్యం. అవి సానుభూతి మాటలు. కాత్యాయని మనసు చలించ లేదు. తల్లియొక్క నిజమైన స్వరూపం ఆవేదనామూర్తిని అమాతృహృదయాన్ని తానే చూసింది. కాత్యాయని చెక్కిళ్ళ మీదనుంచి కన్నీటి ధారలు జారిపోయాయి.

మరో రెండు గంటలకు సుందరమ్మ శరీరాన్ని కట్టెమీద పెట్టేరు. కాత్యాయని గుండెల్లో గునపం దించి పెల్లగించినట్లయింది.

చివరకు తన తల్లికి నలుగురి భుజాల మీద చివరి యాత్ర మొదలయింది. వాళ్లు వేసిన అడుగుకు ఆమడ దూరమైపోతున్నట్లనిపించి తొందరగా కాత్యాయని రెండడుగులు ముందుకు వేసింది కళ్లు తుడుచుకుంటూ,

" అడదానివమ్మా ! కాటికెళ్ళ కూడదు. ఇటు రా !"

కాత్యాయని వెనుదిరిగి చూసింది. సత్యవతి. చుట్టూ ఇరుగుపొరుగు.

"నేను వెళ్లాలి !" అని వాళ్ళ మాటలు వినిపించుకోకుండా ముందుకు పరుగెత్తింది కాత్యాయని.

అనంతమైన ఆకాశం క్రింద విశాల

మైనభూతలం. ఆరడుగులమేర అమర్చిన చితిమీద కట్టెను దించేరు. శంకరం చితికి చిచ్చు పెట్టేడు. మంటలు మెలికలు తిరుగుతూ ఎగసిపోతున్నాయి. కాత్యాయని కళ్ళలోనీళ్లు సుడులు తిరుగుతున్నాయి. 'అమ్మా!' అని బేలగా అరచింది.

అరగంటలో అంతా అయిపోయింది.

సాయంత్రం వరకూ కాత్యాయని ఇంటిలో అందరికీ దూరంగా ఒంటరిగా కూర్చుంది. ఎవరేం మాట్లాడుకున్నారో, ఏమనుకున్నారో తెలియదు.

కాత్యాయని మనస్సు ప్రశాంతంగా ఉంది. చనిపోయేముందు తల్లి పడిన పశ్చాత్తాపాన్ని తలచుకుంటే తల్లి జీవితానికి సరియైన ముగింపు జరిగినట్లుగానే అనిపించింది.

అన్నలిద్దరకూ, తనకూ ఇన్నాళ్లూ ఉన్న పాశం ఏదో ఈ నాటితో పోయింది. ఏ అడ్డంకులూ లేకుండా తన యిష్టంవచ్చినట్టు తన జీవితాన్ని మలుచుకోవచ్చు. రాజశేఖరం కుటుంబం ఆలోచన వచ్చినప్పటినుంచి తాను ఎప్పుడక్కడికి వెడదామా అనిపించింది.

భాస్కరం మెల్లగా గొంతు సవరించుకొని మెల్లగా ఆ మాటా ఈ మాటా ముచ్చటించేడు; చివరకు.

"ఇద్దరన్నలుండగా దిక్కులేనిదానికిమల్లే పరాయి పంచకు చేరడమేమిటే?" అన్నాడు చివరకు.

"ఎవరు"

"నువ్వే!"

"దానికి జవాబు కావాలా?" భాస్కరంవైపు తిరగకుండానే అడిగింది కాత్యాయని.

"అమ్మని ఎంత నిర్లక్ష్యం చేశారు చివరికి! పోనీ మా యింటికి తీసుకుపోతానన్నాను. ససేమిరా వీల్లేదన్నారు. ఆస్థి కాస్తా నా కెక్కడ రాసేస్తుందోనని వీళ్ళ భయం." చటుక్కున మాట మార్చేడు భాస్కరం. కాత్యాయనికి ఎందుకో గతాన్ని గురించి వినడం ఇష్టంలేదు. మాట్లాడడం అంతకంటే ఇష్టం లేదు.

ఊఁ కొట్టి ఊరుకుంది. భాస్కరం చెప్పుకుపోతున్నాడు.

"...మా ఇంటి దగ్గర ఉన్నన్నాళ్లూ ఇలా అమ్మ ఒంటిమీద ఈగ వాలనీయలేదు. ఇక్కడ చెంబు తీసి అక్కడ పెట్టనిచ్చేలేదు. కాస్త తుమ్మేసరికి డాక్టరుకు చూపించేవాడిని. వయసు మీరింది కదా! ఈ సమయంలో ఆవిడకి కాస్త మనశ్శాంతి లేకపోతే ఎలా? అనుకోకూడదు కాని నా సంసారం అంతా ఒక ఎత్తు, అమ్మకు మందులు ఒక ఎత్తు. పసిపిల్ల దగ్గరనుంచి పాపం ఎప్పుడూ అమ్మమ్మదగ్గరే కూర్చొనేవారు......"

భాస్కరం చెప్పుకుపోతున్నాడు. కాత్యాయని వినలేకుండా ఉంది. కనీసం మంచిచెడ్డలు తెలుసుకోలేనివాడు, అవసానదశలో తల్లిని సరిగా చూడలేకపోయాడంటే అదో దురదృష్టం అనుకోవచ్చు. ఇన్ని విషయాలు తనతో చెప్పినవాడు తమమీదే ప్రాణాలు పెట్టుకొన్న మనిషిని అమానుషంగా బాధిస్తే తాను ఎంత దుష్టుడయి ఉండాలి!

ఇంతలో మెల్లగా శంకరం కూడా అక్కడికొచ్చేడు. అయిన ఖర్చు, ముందు పది రోజుల్లో కాబోయే ఖర్చు ఓ కాగితం మీద వేసి కాత్యాయనికి చూపించేడు.

దగ్గరదగ్గరగా మొత్తం ఆరు వందల రూపాయల వరకూ వచ్చింది. ఇద్దరూ చెరొక ప్రక్కన కూర్చుని ఉండగా మాటామాటా పెరిగి వారిరువురి దుష్టత్వం ప్రత్యక్షంగా చూడలేనేమోనని భయం కలిగింది కాత్యాయనికి. ఇప్పటికే వారి మీద చెప్పలేనంత అసహ్యం కలిగింది. వారి వికృత స్వభావాలు ఇంకా చూడదలచుకోలేదు. అందుకే తానే అంది.

"అమ్మ మిగిలిన ఆస్థి రెండెకరాలూ నా పేర రాసింది. అది మీ కివ్వడం ఇష్టంలేకా, నా మీద ప్రేమతోనూ కాదు. ఇప్పటివరకూ మీ చేత చిక్కిన ఆస్థి ముందు వెనుక లాలోచించకుండా ఖర్చు చేసుకున్నారు. ఇది కూడా అలా చేస్తారేమోననే భయంతో ఆ పని చేసింది. ఆవిడకు మీరేం సేవలు చేశారో, ఎవరెక్కువ ఖర్చు చేశారో తక్కువ ఖర్చు చేశారో నాకు తెలియదు. ఒకళ్ళొక పైస ఎక్కువ ఖర్చు చేసినా తప్పులేదు. నేను మాత్రం ఆ పొలాన్ని ఇద్దరికి చెరొక ఎకరమూ రాయించేస్తాను. దానికి శంకరం అన్నయ్య ఏర్పాట్లు చేస్తాడు. దీన్ని గురించి ఇంక బేరాలేమీ వద్దు. అమ్మ నగలు నాకిచ్చింది. అవి గుర్తుగా నా దగ్గర ఉండాలి. నేను ఎల్లుండే బయలుదేరి రాజశేఖరంగారింటికి వెడుతున్నాను. అందుచేత ఆ రాతకోతల ఏర్పాట్లు రేపు చేయిస్తే బాగుంటుంది. ఆవిడ నమ్మకాల ప్రకారం అమ్మకు చేయవలసిన కర్మలన్నీ మీరు చేయాలి" శంకరం ఏదో చెప్పబోయేడు కాని మళ్ళీ భాస్కరం ముఖంలోకి చూసి మాట్టాడక ఊరుకున్నాడు. కాత్యాయని అక్కడి నుండి లేచి వెళ్ళిపోయింది.

కాత్యాయని అన్నట్టుగానే అన్నీ మర్నాడు జరిగిపోయాయి. ఆ మర్నాడు రాజశేఖరం ఇంటికి ప్రయాణమయింది. ఎవరూ ఆ పది రోజులు దాటేవరకయినా ఉండమని అనలేదు. ఆ విషయం కాత్యాయనికి ముందే తెలుసు.

వెళ్ళిపోయేముందు మాత్రం – తల్లిని చనిపోయే ముందు ఉంచిన గదిలోకి వెళ్ళింది. అలికి ముగ్గుపెట్టిన గదిలో తల్లి ఆత్మ తిరుగాడుతూన్నట్లే ఉంది. ఒక్కసారి దుఃఖం పెల్లుబికి వచ్చింది. పెద్దగా ఏడ్చేసింది. తేరుకొని ఐదు నిమిషాల తరువాత వంటింట్లో ఉన్న సత్యవతితో "వెళ్తున్నాను వదినా!" అని చెప్పింది. జవాబు రాలేదు.

"బస్‌స్టాండుదాకా రమ్మన్నావా ?" అని భాస్కరం అడిగేడు. వద్దని కాత్యాయని ఒక్క చేతి సంచీతో వీధిలోకి నడిచింది.

బయట అడుగు పెట్టినది మొదలు రాజశేఖరం ఇంటికి ఎప్పుడు చేరుతానా అన్న ఆత్రుత మరీ ఎక్కువయింది కాత్యాయనికి. బస్సులో కూర్చోగానే తల్లి చనిపోయే ముందు రాజశేఖరాన్ని గురించి చెప్పిన మాటలు గుర్తుకొచ్చేయి.

తనకు రోజు గడవక ఆశ్రయం కోసం వాళ్ళ ఇంటికి వెళ్ళింది. తనకు కావలసిన అవకాశం వాళ్ళు ఇచ్చేరు. తనకు చేతనైన సేవ వారికి చేస్తూంది. తల్లి చెప్పిన స్థానానికి ప్రయత్నించడం దుష్టత్వమే అవుతుంది. తనను గురించిన ఆత్రుతలో తల్లి అలా అనుకుందేగాని ఆ ఆలోచన ఏమాత్రం సమంజసం కాదు. తనకు తన కాళ్ళమీద నిలబడే శక్తి

రాగానే అక్కడినుంచి తప్పుకోవాలి.

ఇంటికి వెళ్ళేసరికి రాజశేఖరంఇంట్లో ఉన్నాడు. అందరూ స్కూళ్ళకీ కాలేజీ లకీ వెళ్ళిపోయారు. రాధిక నిద్రపో తూంది. రాజశేఖరం తన గదిలో ఈజీ చైర్‌లో కూర్చున్నాడు. కాత్యాయనిని చూచి లేచేడు.

కాత్యాయని ఏదో మాట్లాడాలను కుంది. గొంతు పెగల్లేదు. ఎంత ఆపు కుందా మనుకున్నా దుఃఖం ఆగలేదు. వెక్కి వెక్కి ఏడ్చేసింది.

"పోవలసిన వాళ్ళను ఎవరు ఆప గలరు కాత్యాయనీ! ఏడవకు, నువ్వు ఎప్పుడు మాయింట్లో అడుగు పెట్టేవో అప్పుడే మాదానివై పోయేవనుకో! ఇక్కడ నీకేంలోటు జరుగదు. ఎప్ప టికీ ఇక్కడే ఉండి పోవచ్చు."

రాజశేఖరం ప్రతి మాటా కాత్యాయ నిలో దుఃఖాన్ని మరింత రెచ్చగొట్టింది. కుప్ప కూలినట్లుగా రాజశేఖరం కాళ్ళ మీద పడిపోయింది. రాజశేఖరం రెండు చేతులతోనూ కాత్యాయనిని లేవనెత్తేడు. ఆమె తలెత్తి రాజశేఖరం కళ్ళల్లో నిండిన నీళ్ళు చూసింది. ఆమెకు కావల సిన సానుభూతి ఇక్కడ దొరికింది. బాధకు కొంత నిజమైన ఉపశమనం కలిగింది. మనస్సు ఎంతో కృతజ్ఞతతో పొంగి పోయింది. మెల్లగా సంచి తీసు కొని లోపలకు వెళ్ళింది.

ఇల్లంతా ఒక అడవిలా ఉంది. చంద్రయ్య కనబడలేదు. రవి గది తలుపు తీసి చూసింది. బట్టలూ పుస్త కాలూ గదంతా చిందర వందరగా పడి ఉన్నాయి. వంటింట్లో గిన్నెలూ, దబ్బాలూ చెల్లాచెదురుగా ఉన్నాయి. ఇల్లంతా దుమ్ము దుమ్ముగా ఉంది.

"చంద్రయ్య ఏం చేశాడో తెలీదు. వాడిని రవి పట్టుకు చావకొట్టేడు. వాడు కుయ్యో మొర్రో మంటూ వెళ్ళిపోయాడు. మళ్ళీ ఈ గుమ్మం తొక్కనన్నాడు. వెళ్ళేటప్పుడు ఏమైనా డబ్బిద్దా మనుకు న్నాను. వాడు ఎంత చెప్పినా ఆగకుండా వెళ్ళిపోయేడు. ఆ వంటలక్క కొడుక్కి ఈ వూరి నుంచి ట్రాన్స్‌ఫరయి పోయిం దట. ఆవిడా వెళ్ళిపోయింది. చూస్తే నీ పరిస్థితి ఇలా ఉంది. ఏంచెయ్యాలో అర్థం కావటం లేదు" అన్నాడు రాజశేఖరం.

వారం రోజుల్లో ఇన్ని మార్పులు! ఆశ్చర్యం అనిపించింది కాత్యాయనికి. కొంగు బిగించి పనికి పూనుకుంది. ఇల్లంతా శుభ్రంచేసే సరికి పొద్దు తిరిగి పోయింది. పిల్లలందరికీ కాత్యాయనిని చూడగానే ప్రాణం లేచి వచ్చింది. తరు వాత పది రోజుల పాటు పనితో చదువు సరిగా కుదరలేదు కాత్యాయనికి. దాన్ని వదిలిన చోట అందుకో డానికి మరో రెండు మూడు రోజులు పట్టింది.

ఆ తరువాత మళ్ళీ తెలియనివి చెప్పించు కోవడం కోసం రవి దగ్గర కెళ్ళింది. చెప్పనంటాడేమోనని భయ పడింది కానీ అలాఏమీ జరగలేదు.

అయినా ఇద్దరి మధ్యా ఇంచుమించు ప్రతిరోజూ వాదనలు జరుగుతూనే ఉండేవి. కాని కాత్యాయని అప్పుడప్పుడు సందర్భాన్ని బట్టి కొంచెం పరుషంగా మాట్లాడినా ఇదివర కంత ఆవేశపడటం లేదు.

కాని రానురాను రవి చదువులో అశ్రద్ధ చూపిస్తున్నాడు. కాత్యాయని వచ్చిన



క్రొత్తలో ఏది ఎలా ఉన్నా చదువులో శ్రద్ధ చూపించేవాడు. ఇప్పుడది కూడా కనబడటంలేదు.

ఆ రోజు ఆదివారం, రెండుమూడు సారులు లేపడానికి ప్రయత్నిస్తే లేవ లేదు. పగలు పదిగంటలకు లేచాడు. కాఫీ ఇచ్చి కాత్యాయని మనసులోమాట అనేసింది.

"ఇంత ఆలస్యంగా లేవడం ఏం బాగు లేదు రవీ!" రవి కాఫీ త్రాగి, "అయితే ఏమిటి మీ సలహా ?" అన్నాడు.

"తెల్లవారకట్ల లేచి చదవడానికి ప్రయత్నించమంటున్నాను. లేపడానికి సర్వహక్కులూ నాకిస్తే ఏ నీళ్ళో చల్లి లేపేసి నీకు సహాయం చేస్తాను."

"చదువు ఎలా చదవాలో నేను నీకు చెప్పాలి. ఆ విషయంలో నువ్వు నాకు సలహా చెప్పడం..."

"చదువు చెప్పలేక పోవచ్చుగాని ఆ పద్ధతి చెప్పొచ్చుగా.

"అన్ని పద్ధతులూ తెలిసిన నువ్వు ఇన్నేళ్ళవరకూ కనీసం గ్రాడ్యుయేషన్ కూడా చెయ్యక పోడానికి కారణం ?"

"సరియైన పద్ధతిలో చదవక నిర్లక్ష్యం చెయ్యడమే ! ఆ పొరపాటు నువ్వు చెయ్యకూడదని చెప్తున్నాను."

"నా పద్ధతులతోనేనింతవరకూ మంచి మార్కులతోనే పాసవుతూ వస్తున్నాను"

రవి వితండవాదంతో కాత్యాయనికి

ఒళ్ళు మండిపోయింది.

"నువ్వు చదివిన చదువు ఒక చదువే కాదు. ఉద్యోగం సంపాదించడానికి పనికివచ్చే ఓ డిగ్రీ మాత్రమే. ఇప్పుడు నీలో ఉన్న స్వభావంతో నీ అంతట నీవు సమాజంలో ఒంటరిగా నిలబడ్డప్పుడు నువ్వెంత అసమర్థుడివో తెలుస్తుంది" అంది.

"నేను అసమర్థుడినని నువ్వెలా చెప్పగలవు ?"

"నాకు నీతో ఉన్న పరిచయంతోనే. లోకానికి వెలుగొచ్చిన నాలుగుగంటల లోపల మరోమనిషి సహాయం లేక నువ్వు వెలుగే చూడలేవు. మిగిలిన సమయంలో కూడా నువ్వు చేసే ఉపయోగకరమైన పనేముంది ?"

"నీకు చదువు చెప్పటంలేదూ !" కొంటెగా నవ్వుతూ అన్నాడు రవి.

"అంతవరకూ అది ఉపయోగకరమైన పనే ! ఒకరోజు నీకు అన్నింటికంటే నాకు చదువుచెప్పిన విషయమే సంతృప్తి నిస్తుందేమో ! ఎవరు చెప్పగలరు !"

"ఇన్నిమాటలు చెప్తున్నావు నీలో లోటు లేదా ?"

"లోటులేదని నేననను. అది నాలో లోటు అని తెలియగానే సర్దుకొనే బుద్ధి నాకుంది. ఆ బుద్ధిని పెంచుకోవడం ప్రతి మనిషికీ అవసరం. చదువుకున్న వాళ్ళలో ఆ బుద్ధిలేకపోతే వాళ్ళు చదువుకున్న చదువుకే అవమానం...." కాత్యాయని మాట్లాడుతూ తలతిప్పి రాజశేఖరం బయట తచ్చాడుతూండడం చూసి నాలుక కరుచుకుంది.

సంభాషణ ముగించి బయటకు వచ్చేసింది.

భోజనం వడ్డిస్తూంటే "వాడేమైనా అన్నాడా నిన్ను ?" అని అడిగేడు.

"ఏం లేదండి ! ఏదో మాటామాటా వచ్చిందంతే."

"జాగ్రత్త ! నిన్నోమాట అన్నా నేను భరించలేను."

"ఫరవాలేదులెండి. మాకీ మాటలు అలవాటే ! అయినా అంత వయస్సు వచ్చి ఏమీ పట్టించుకోకుండా ఉండడం, అలా గదిలోంచి ఊడిపడక పోవడం మంచిదికాదని ఏదో సందర్భం వచ్చినప్పుడు రెండు మాటలంటూంటానంతే!"

"నీ చదువెలా ఉంది ?'' అన్నాడు రాజశేఖరం మాట మారుస్తూ.

"చదువు దారి చదువుదే ! పోట్లాటలు పోట్లాటలే ! రవే చెప్తున్నాడు"

"మళ్ళీ ఇంకోవంటలక్క దొరికినా బాగుండును. ఇదంతా నీ నెత్తిన వేసుకున్నావు.

"ఇదోపని కాదునాకు. పొద్దున్న ఒకగంట సాయంత్రం ఒకగంట ! లేకపోతే టైమేగడిచిచావదు. నా మీద దయ ఉంచి వంటలక్కను మాత్రం వెతక్కండి" అంది కాత్యాయని



# 7

కాత్యాయని ఇటు ఇంట్లోపనితో పాటు టైపు షార్టుహేండు నేర్చుకుంటూ

పరీక్షలకోసం నిర్విరామంగా కృషి చేసింది. పరీక్షలు దగ్గర కొచ్చేసరికి పూర్తిగా ఆత్మవిశ్వాసం కలిగింది.

చివరకు ఎదురుచూసిన రోజురానే వచ్చింది. ఆ రోజే మొదటి పరీక్ష. తనతోపాటు సుజాతకీ రవికీ కూడా ఆ రోజునుంచే పరీక్షలు. ముందు రాత్రి సరిగా నిద్రపట్టలేదు. మనసులో ఉన్న ఆదుర్దాతో తెల్లవారకట్ల మూడుగంట లకే మెలకువ వచ్చేసింది.

తెల్లవారి ఎనిమిదయ్యేసరికల్లా అన్ని పనులూ ముగించుకుంది కాత్యాయని. రవి గదిలోకి వెళ్ళింది. ఎన్నిసార్లు లేపినా లేవలేదు. మరో అరగంటపోయాక మళ్ళీ ప్రయత్నించింది. అయినా రవి అటూ ఇటూ సర్దుకు పడుకున్నాడేకాని లేవలేదు.

తొమ్మిదిన్నరకల్లా పరీక్షకు వెళ్ళ డానికి తయారయింది. కాత్యాయని వెళ్ళే ముందు చూసినా రవి లేవలేదు. ఒక ఆలోచన వచ్చింది కాత్యాయనికి రవిని లేపకుండా పరీక్షకు వెళ్ళిపోతే! అతని వాదానికి సరైన జవాబు నిజంగా దొరుకు. తుంది. తానెంత తెలివైనవాడయినా మరో మనిషి లేపి పరీక్షకు పంపేటంతగా ఇతరుల మీద ఆధారపడడంలోని తెలివి తక్కువతనం తెలిసివస్తుంది. కాని ఒక రోజు గురించి ఒక్క సంవత్సరం వృధా అయిపోతుందే! అదేవిధమైన మలుపు తిప్పుతుందో అతని జీవితాన్ని! కానీ! ఇప్పుడున్న స్థితికంటే అవాంఛనీయ మైనదేముంది?

రవిని లేపకుండానే కాత్యాయని పరీక్షకు వెళ్ళిపోయింది. వెళ్ళింది కాని తాను చేసిన పనికి బాధపడుతూనే ఉంది. కనీసం రాజశేఖరంతోనయినా ఈ విషయం చెప్పవలసిందేమో! ఆయనే మనుకుంటారో!

చేతిలో క్వశ్చన్ పేపరు వచ్చే సరికి అప్రయత్నంగా దృష్టి పేపరు వైపుమరలింది.

పరీక్ష బాగానే రాసింది. ఇంటికితిరిగి వచ్చేసరికి మధు ఇంటి దగ్గర ఉన్నాడు. "రవి పరీక్షకు వెళ్ళేడా" అని అడిగింది కాత్యాయని.

"అన్నయ్యకు ఈ రోజు పరీక్ష ఉందా!" తెల్లబోయేడు మధు.

"అవును. పొద్దున్న పదిన్నరకు ఉంది."

"ఇప్పుడే ఓ గంటయింది బయటకు వెళ్ళి. అప్పటి వరకూ ఇంట్లోనే ఉన్నాడు."

కాత్యాయని మనసు బాగులేదు. తాను పొరపాటు చేశాననే అనిపించింది.

ఇంతలో సుజాత కూడా వచ్చింది. తను కూడా బాగా రాశానని చెప్పింది.

మరో గంటలో రాజశేఖరం వచ్చేడు.

కాత్యాయనికి తను చేసిన పని రాజశేఖరానికి చెప్పే వరకూ మనశ్శాంతి కలిగేటట్లు లేదు.

మెల్లగా టీ తీసుకొని రాజశేఖరం గదిలోకి వెళ్ళింది. చెప్పలేక చెప్పలేక మనసులో మాట చెప్పింది.

"అదేమిటి అలా చేశావు?" అన్నాడు రాజశేఖరం.

"ఏం చెప్పను?... తను ఇతరుల మీద చిన్న చిన్న విషయాలకు ఆధార పడినంత వరకు తానెంత చేసినా ఎలా వృధా అవుతుందో చూపించాలని పించింది. సరిగా ఆలోచించక ఈ తెలివి తక్కువ పని చేశాను."

"అది మరో విధంగా చెప్తే బాగుండేదేమో కదా! ఇప్పుడనవసరంగా ఓ సంవత్సరం వృధా అయిపోలేదూ!"

అతని కంఠంలోని అనంగీకారాన్ని గుర్తించింది కాత్యాయని. తల కొట్టేసినట్లయింది. తనకు అధికారం ఉన్న పరిస్థితుల్లో అయితే తను తప్పకుండా అదే పని చేసేది. కాని ఆశ్రయం ఇచ్చిన వారి కేదో నేర్పాలని ఈ పని చెయ్యడం సాహసమే అనిపించింది.

రాజశేఖరం కాత్యాయని ఆలోచన గుర్తించినట్లున్నాడు.

"పోనీలే! ఇప్పుడింకేం చేస్తాం! చూద్దాం పోనీ వాడి ధోరణిలో నువ్వు చెప్పినట్లు ఏమయినా మార్పు వస్తుందేమో" అన్నాడు.

కాత్యాయనికది పరిహాసంగా ధ్వనించింది. తలెత్తి అతని ముఖం చూడలేకపోయింది. ఒక్కక్షణం తనమీద తనకే అసహ్యం కలిగింది.

ఇంట్లో అందరూ ఏమీ జరగనట్లుగా తనతో మామూలుగా మసులుతూన్నా తను మాత్రం మామూలుగా తిరగలేకపోతూంది వాళ్ళతో. రాజశేఖరం మాటలు పదేపదే గుర్తు కొస్తున్నాయి. ఎప్పుడూ అతని కంఠంలోని కొద్దినిష్ఠూరం గుండెలు పిండుతూంది. సాయంత్రం నాలుగు దాటేక వచ్చేడు రవి. క్షమాపణ కోరి అతనికి జరిగిన నష్టాన్ని పూరించలేకపోయినా ఆ పనిచేసే వరకూ నిలువలేననిపించింది.

రవి గదిలోకి వెళ్ళి తలుపు దగ్గర నిలబడింది. కాత్యాయని వైపు చూసి నవ్వేడు రవి. ఎందుకో ఆ నవ్వు మరీ సిగ్గు పరచింది ఆమెను.

"చాలా పొరపాటు చేశాను రవీ! క్షమించు!" అని చెప్పాలను కుంది. కాని గొంతు పెగల్లేదు. కంఠంలో ఏదో అడ్డు పడినట్లనిపించింది. అప్రయత్నంగా కళ్ళ నిండా నీళ్ళు నిండిపోయాయి. ఏం చేయలేక తల పక్కకు తిప్పుకుంది. గుమ్మందాకా వచ్చి ఏదో మాట్లాడబోయి కన్నీళ్ళతో తల తిప్పుకున్న ఆమెను చూసి నిర్ఘాంత పోయాడు రవి.

"కాచీ!" అని ఒక్క అంగలో దగ్గర కొచ్చేడు.

కాత్యాయని కళ్ళ వెంబడి బొట బొటా కన్నీళ్ళు జారిపోయాయి. ఎంత మాటన్నా బాకులా జవాబిచ్చే ఆమెను ఈ పరిస్థితిలో చూసేసరికి ఏంచేయాలో తోచలేదు రవికి!

"ఎందుకు కాచీ! ఏమయింది?" అంటూ మధూ, సుజాతా కూడా అక్కడి కొచ్చేరు.

కంటి నీరు కారిపోవడంతో కొంచెం మనసు స్థిమిత పడింది. కళ్ళు తుడుచుకొని మెల్లగా రవితో అంది.

"పరీక్షకు నువ్వువెళ్ళాలని తెలిసుండి కూడా నిన్ను లేపలేదు రవీ! చాలా పొరపాటు చేశాను" అని అక్కడనుంచి వెళ్ళిపోయింది.

రాత్రి రవికి భోజనం తీసుకెళ్ళినప్పుడు రవి అన్నాడు

"నేనోమాట చెప్తాను నమ్ముతావా?"

"ఏమిటి ?"

"ఈరోజు నువ్వు లేపి నన్ను పరీక్షకు పంపినా నేను పాసయేవాడిని కాదు"

"ఎందుకని?"

"నేనేమీ చదవలేదు".

"లేదు. నా తప్పు కప్పడం కోసం

అంటున్నావ్ !"

"కాదు. అయినా నువ్వంత బాధపడ వలసిన విషయం ఏముంది ఇందులో?... పోనీ నేను బాగా చదువుతే పరీక్షకు వెళ్ళ లేకపోయినందుకు బాధ పడేవాణ్ణిగా ! ఇప్పుడదేమీ లేదు. నేను సంతోషంగానే ఉన్నాన".

"చెప్పేనుగా నా కోసం అలా ఉన్నావని"

"అంత మంచి గుణం నాలో ఉందం టావా!"

"సరేలే! అయిపోయిందికదా ఇప్పుడు చేసేదేముంది?"

"నిన్ను అనవసరంగా బాధపడవద్దం టున్నాను".

"అలాగే"

రాజశేఖరం ఇంటికి రాగానే జరిగిన విషయం సుజాత చెప్పింది. అతను తిన్నగా కాత్యాయని దగ్గరకొచ్చేడు.

"పిల్లలకు ఇంత సేవచేస్తూన్న నీకు వాళ్ళ మంచి కోసం ఒక నిర్ణయం తీసుకునే అధికారం తప్పక ఉంది. నీది సున్నితమైన మనసు కావడంచేత నే నేమయినా అనుకున్నాననుకున్నా వేమో ! నేను మరోలా అనుకోలేదు. నువ్వు మంచి పనే చేశావు. బాధపడకు" అన్నాడు. కాత్యాయని పేలవంగా నవ్వింది. ఏమయినా మనసుకు కొంత ఊరట కలిగింది.

సబ్జెక్ట్స్ ఇదివరకే బాగా చదివి ఉండడంవలన అంత చదవాల్సిన అవ సరం కూడా అన్పించలేదు. మర్నాడు పొద్దున్న అలవాటు ప్రకారం ఓసారి లేపడానికి రవి గదిలోకి వెళ్ళింది. యథా లాపంగా టేబిల్ వైపు చూసి తెరచివున్న డైరీలో తన పేరు చూసి ఆశ్చర్య పోయింది. పేజీలు వెనక్కు తిప్పి చూడ కుండా ఉండలేకపోయింది. మూడు నెలల నుండీ ప్రతిరోజూ తనను గురించే రాసు కున్నాడు. రవిలో ఎంతో మార్పు వచ్చింది. తను గుర్తించలేకపోయింది. తనను వాగించడానికీ, అవి వినడానికీ అతను మారనట్లు నటిస్తున్నాడు. మనసుకు కొంత శాంతి చిక్కింది.

ఆ రోజు పేపరుకూడా తేలికగానే ఉన్నట్లనిపించింది. మూడు వంతులు పేపరు రాసి ఒక్క నిమిషం విశ్రాంతి తీసుకుందామని పెన్ను కిందపెట్టి తల ఎత్తింది కాత్యాయని. కుర్చీదగ్గర నిలబడి రెప్ప వాల్చకుండా తనవైపే చూస్తూన్న వ్యక్తిని చూడగానే షాక్ తగిలినట్లయింది. మరోక్షణం తేరిపార చూసింది. ఆయనే! రమణ సందేహం లేదు. ఏదో రిసెర్చి చెయ్యాలనే ఉద్దేశంలో ఉన్నారు ఇది వరకు. ఇప్పుడిక్కడ లెక్చరర్‌గా పని చేస్తున్నారేమో! ఆలోచించడానికి టైము లేదు. తల దించుకుని పేపరు పూర్తి చేసింది. బాగానే రాసింది. పేపరిచ్చి బయటపడింది.

ఒక్కసారిగా ఆలోచనలు ముప్పిరి గొన్నాయి.

దగ్గర దగ్గరగా తన భర్తను విడచి వచ్చి ఐదు సంవత్సరాలయింది. ఇక్కడ లెక్చరర్‌గా పని చేస్తున్నారన్నమాట ! అత్తగారెలా ఉన్నారో! ఏమయినా తనకు వాళ్ళతో ఇక ఎటువంటి సంబంధమూ లేదు.

మళ్ళీ రెండు రోజుల తర్వాత రమణ ఆమె వున్న హాలుకు ఇన్విజిలేటరుగా వచ్చేడు. వస్తూనే తిన్నగా కాత్యాయని దగ్గరకొచ్చేడు. ఆమె లేచి నిల్చుంది.

"బాగున్నావా ?"

"ఆఁ..."

"అన్ని సబ్జెక్టులూ రాస్తున్నావా?"

"ఊఁ."

"ఇప్పటివరకూ పేపర్లన్నీ బాగా రాసేవా?"

"బాగానే రాసేను".

"నువ్వు కనబడినట్లు ఉమాదేవికి చెప్పేను. నిన్నొకసారి ఎలాగైనా తీసుకొని రమ్మంది. ఒక్కసారి మా యింటికి రా! మరోలా అనుకోవనుకుంటున్నాను".

"ప్రస్తుతం పరీక్షలుకదా! ఖాళీలేదు. ఆలోచించి చెప్తాను".

గంటయింది. కాత్యాయని కూర్చుంది. రమణ ఆన్సరు పేపర్లు పంచుతూ వెళ్ళిపోయాడు.

రాత్రి కాత్యాయని తీవ్రంగా ఆలోచించింది. రమణ ఇంటికి వెళ్ళడమా, మానడమా ! తామిద్దరూ ఎప్పుడూ పోట్లాడుకోలేదు., ఆయన తనకు మరో స్త్రీపై మనసు ఉందని చెప్పేరు. తాను తప్పుకుంటే కాని ఆమెను పెళ్ళి చేసుకో. డానికి వీలుండదని చెప్పేరు. తనకు ఆయనతో ఇక ఉండబుద్ధి కాలేదు. ఆయన కోరిన విధంగా ఆయన మళ్ళీ పెళ్ళికి సమ్మతి పత్రం రాసిచ్చి వచ్చేసింది. అటువంటప్పుడు ఆయనతో మళ్ళీ పరిచయం ఎందుకు ? లేనిపోని సమస్యలు సృష్టించుకోవడం ఎందుకు.

ఇందులో సమస్యలేమున్నాయి ! ఆవిడకు తన్ను చూడాలని ఉందట ! వెళ్ళిపస్తే తప్పేముంది. భార్యగా ఆయన జీవితంలోంచి తప్పుకున్నా కావాలని దూరంగా పరుగెత్తిపోవడం దేనికి? తన ఆత్మవిశ్వాసం చెదరనంతవరకూ తాను ఎలా వున్నా ఫరవాలేదు.

మర్నాడు కాలేజీలో రమణ కనబడగానే చెప్పింది చివరి పరీక్షరోజు కాలేజి నుంచి వాళ్ళింటికి వస్తానని.



## 8

చివరి పరీక్ష రోజు. పరీక్ష కాగానే ఆన్సరు పేపర్లు ఆఫీసులో ఇచ్చి కాత్యాయని దగ్గరకు వచ్చేడు రమణ. బస్టాండు దాకా ఇద్దరూ నడిచి వెళ్ళేరు. దారిలో కుటుంబాల యోగక్షేమాల గురించి మాట్లాడుకున్నారు.

"బహుశా నేను బాధ్యతా రహితంగా ప్రవర్తించి నీకు కొన్ని పెద్ద సమస్యలే సృష్టించినట్లున్నాను." అన్నాడు రమణ

"ఆ ఒక్క విషయం తప్ప మరేదైనా మాట్లాడుదాం" అంది కాత్యాయని.

అతను ఆమె ముఖంచూసి మనసులో భావాన్ని గ్రహించడానికి ప్రయత్నించి విఫలు డయ్యాడు. ఆమె ముఖం మీద ప్రశాంతత అతన్ని ఆశ్చర్య పరచింది.

ఇంటిదాకా వెళ్ళేక "నేను పది నిమిషాల్లో వచ్చేస్తాను. నువ్వు లోపలకు నడు" అని ఆమె జవాబు కోసం ఎదురు చూడకుండానే బయటకు వెళ్ళేడు రమణ.

కాత్యాయని లోపలకు వెళ్ళింది.

ముందుగదిలో ఒక సోఫాసెట్ ఉంది. మధ్యలో టీపాయ్. ఆ గదికి తరువాత

గదికీమధ్య తెర వ్రేలాడుతూంది ఓ సారి చుట్టూ కలియ చూసి తెరతప్పించ బోయింది కాత్యాయని.

తెర అదే తొలగి పోయింది.

ఒక దేవత ప్రత్యక్ష మయినట్లుగా ఆశ్చర్యంతో అలాగే చేష్టలుడిగి నిలబడి పోయింది కాత్యాయని, ఎదురుగా నిలబడి ఉన్న యువతిని చూస్తూ.

"మీతో ఆయన వచ్చేరుగా! ఏరీ?" దేవత నోరు విప్పి మాట్లాడింది.

"పది నిమిషాల్లో వస్తానని వెళ్ళేరు" రెప్పవాల్చ కుండా చూస్తూ జవాబు చెప్పింది కాత్యాయని.

"రండి లోపలకు రండి!" ఆమె మర్యాదగా తెర పక్కకు తీసి పట్టు కుంది. కాత్యాయని లోపలకు వెళ్ళింది.

ఆమె ఏదో మాట్లాడబోయి కాత్యా యని చూపు చూసి కొంచెం ఆగి "ఏమి టలా చూస్తున్నారు?" అంది.

కాత్యాయని తన ఆశ్చర్యాన్ని దాచుకో దలచుకోలేదు. జవాబు చెప్పకుండానే మరోసారి పైనుండి కిందిదాకా చూసింది.

అదొక ముగ్ధమోహన రూపం! ముదురు తోపురంగు చీరలో బంగారు వన్నెతో ఆమె అప్సరలా ఉంది. అపు రూపమైన అందం!

"నేను మీ అంత అందమైన మనిషిని ఇప్పటివరకూ చూడలేదు" ఆమె సిగ్గుపడింది కాత్యాయని మాటలకు. రమణ ఆమె కోసం పడ్డ తపన అప్పుడు పూర్తిగా అర్థంచేసుకోగలిగింది కాత్యా యని.

"ఎప్పటినుంచో మిమ్మల్నొకసారి చూడాలని ఉంది. నాలుగు రోజుల క్రితం మీరు కనబడినట్లు చెప్పేరు. మిమ్మల్ని గురించి చాలా ఆలోచించేదాన్ని. మీరు ఈ వూళ్ళోనే ఉన్నారని తెలిసిన తర్వాత ఓసారి చూసేదాకా మనసు నిలువలేదు. మిమ్మల్ని తీసుకొని రమ్మ నడం సాహసమే అయినా మీరు ఎటు వంటి పరిస్థితుల్లో ఎక్కడ ఉంటున్నారో తెలియక..."

"ఫరవాలేదు."

"రండి. ఇలా కూర్చోండి" ఉమా దేవి కాత్యాయనిని మంచం మీద కూర్చో పెట్టింది.

అక్కడనుంచి కాత్యాయని ఎక్కడ ఉంటూన్నదీ, ఏం చేస్తూన్నదీ ప్రశ్నల వర్షం కురిపించింది.

ఆమె కళ్ళల్లో నైర్మల్యం, ముఖంలో అమాయకత్వం కాత్యాయనిలో కొద్ది క్షణాల్లో ఎంతో ఆత్మీయత సృష్టించేయి.

ఉమాదేవి టిఫిన్ పెట్టి కూల్ డ్రింకు ఇచ్చింది. ఆ తరువాత మాటల మధ్య ఉన్నట్లుండి ఆమె కాత్యాయని చేతిని చేతిలోకి తీసుకొని తలవంచుకొని అంది.

"ఏమిటో అప్పుడు నాకు తెలీలేదు. నా ఆనందం, నా భవిష్యత్తూ, నా స్వార్థం తప్ప మరేమీ కనబడలేదు. ఇప్పుడు నాకు పాల పొంగులాంటి వయసు దాటింది. ఆలోచించ గల్గు తున్నాను. ఆలోచించినకొద్దీ నా సుఖం కోసం మీ కెంత హాని కలిగించేనో తెలిసి కుమిలిపోతున్నాను..."

కాత్యాయని ఆశ్చర్యపోయింది. మెల్లగా ఉమాదేవి తలెత్తింది. గులాబి రేకు మీద మంచు ముత్యంలా ఆమె కను రెప్పల్లో నిలచిన కన్నీటి బిందువులు చూడగానే మనసు చివుక్కుమంది.

"ఛ! ఏమిటిది !" చనువుగా తీసుకొని

కన్నీటిని తుడిచింది.

"మీరు మా కోసం చాలా అసాధారణమైన త్యాగం చేశారు."

"నా మనసులో మాట చెప్పమంటారా ?"

"చెప్పండి."

"మీరు దాన్ని త్యాగంగా చూడగలగడం మీ గొప్పతనం. నా వరకు నాకే మనిపిస్తుందంటే నా మీద అంతగా మనసులేని మనిషితో ఉండడానికి తిరుగుబాటు చేసిన అహంకారం అనిపిస్తుంది. అయినా ఆ అహంకారం నా కున్నందుకు నాకు కొంచెం సంతృప్తిగానే ఉంటుంది"

"మీరు చక్కగా మాట్లాడుతారు."

"కాదు. నా మనసులో మాట ఎప్పుడూ వీలయినంత స్పష్టంగా చెప్పాలని అనుకుంటాను."

తరువాత ఉమాదేవి తమ కథ చెప్పింది.

ఆమె తల్లిదండ్రులకు ఆఖరి బిడ్డ. రమణతో సాన్నిహిత్యం వాళ్ళ వాళ్ళకు తెలిసి కూడా ఊరుకున్నారు. వాళ్ళ వివాహానికి సుముఖంగానే ఉన్నారు. కాని అనుకోకుండా రమణ తన ఊరికి వెళ్ళి వేరే పెళ్ళి చేసుకురావడంతో దెబ్బ తిన్నారు. పెళ్ళయిన తర్వాత రమణ ఉమాదేవితో చనువుగా ఉండడానికి ప్రయత్నించడం చూసి ఇద్దర్నీ తీవ్రంగా మందలించేరు. తన భార్య తనను విడిచి వెళ్ళిపోయిందనీ, తాను ఉమను పెళ్ళి చేసుకోడానికి సిద్ధంగా ఉన్నాననీ రమణ చెప్పినపుడు అతన్ని అసహ్యించుకున్నా చాలా తీవ్రంగా అతన్ని వారించేరు. కాని ఉమాదేవి అతన్ని మరచిపోలేకపోవడం, అది ఆమెకు జీవన్మరణ సమస్య కావడం వాళ్ళను కలవరపరచింది. కాత్యాయని రమణ మళ్ళీ పెళ్ళికి అంగీకరిస్తూ రాసిన ఉత్తరం చూసేక అది రెండో పెళ్ళికి రక్ష కాకపోయినా చేసేది లేక పెళ్ళి ఏ హడావిడీ లేకుండా రిజిస్ట్రారు ఆఫీసులో జరిపించేరు. దీనివల్ల ఏముప్పు వస్తుందోననీ, ఉమాదేవి బ్రతుకు ఏ క్షణాన అల్లరి పాలవుతుందోననీ భయపడుతూనే ఉన్నారు. ఈమధ్య కొంచెం మెల్లగా పాత విషయాలు మరచిపోయి మసలగలుగుతున్నారు. అంతా చెప్పి ఆఖరున అడిగింది ఉమాదేవి. "మీకు మమ్మల్నందర్నీ చూస్తే అసహ్యం కలుగుతూంది కదూ !" కాత్యాయని ఆమె కళ్ళల్లోకి చూసింది. ఇంత స్వచ్ఛమైన మనసు గల ఈమెతో ఎవరూ సన్నిహితంగా రాకుండా ఉండలేరనిపించింది. ఆమెకు ఎంత వయసు వచ్చినా ఎన్ని అనుభవాలు కలిగినా ఆమెలో ఒక దివ్యమైన పసితనం కనబడుతుంటుంది.

"మీలాంటి స్త్రీకి మనసిచ్చిన పరిస్థితుల వలన ఇంకొకళ్ళను పెళ్ళి చేసుకోవడం జరిగితే మిమ్మల్ని మరచిపోవడం మాత్రం అసంభవమని నాకూ అనిపిస్తుంది. మా పెళ్ళిని కాదనలేకపోవడానికి ఆయన ఏ బలహీనతకు లోనయ్యారో కాని, పెళ్ళి చేసుకున్న తర్వాతనయినా తన మనసులో విషయాన్ని పైకి చెప్పకుండా దాచి మీ బ్రతుకులోనూ, నా బ్రతుకులోనూ, తన బ్రతుకులోనూ నిప్పులు చెరగకుండా తన బాధ నాతో చెప్పడంలో ఆయన మంచి పనే చేశారనుకుంటున్నాను. మిమ్మల్ని చూడగానే నాకే మనిపిం



చిందో చెప్పమంటారా?"

"ప్లీజ్!"

"మనసుకు చెప్పలేని ఆనందం కలిగింది. మనిద్దరికీ ఎన్నాళ్ళనుంచో పరిచయమున్నట్లే అనిపించింది"

"థ్యాంక్యూ వెరీ మచ్!"

ఉమాదేవి కళ్ళల్లో కన్నీళ్ళు మెరవడం చూసింది కాత్యాయని. ఇంతలో రమణ వచ్చేడు. మరో అరగంట కూర్చొని కాత్యాయని లేచింది.

రమణ ఇంటి దాకా వస్తానన్నాడు. అక్కడ నుంచి డైరెక్టు బస్ లేదనీ రిక్షాలో వెడతాననీ అంది ఆమె. రమణ రిక్షా ఎక్కించి వెళ్ళిపోయాడు.

ఇంటి దగ్గర రిక్షా దిగి లోపలకు వెళ్ళబోతూంటే 'చిట్టి!' అని పిలుపు వినబడి ఆశ్చర్యంతో వెనక్కు తిరిగి చూసింది కాత్యాయని.

శంకరం!

"రా అన్నయ్యా!" అని లోపలకు తీసుకెళ్ళి ముందు హాలులో కూర్చోపెట్టింది. చుట్టూ చూసిన శంకరం మనసులో ఏ ఆశలు కలిగేయో ముఖం మీద ఆశ్చర్యం ముద్ర వేసుకుంది. మంచి నీళ్ళిచ్చి, ముందు కూర్చుంది కాత్యాయని. కుశల ప్రశ్నలయిన తర్వాత "ఏమిటిలా వచ్చేవ్! ఊళ్ళో ఏమయినా పనుందా!" అంది.

"ఇక్కడ నాకు పనేమిటమ్మా

నిన్ను చూసి పోదామనే వచ్చేను."

ఇది దేనికో ఉపోద్ఘాతంగా ఊహించింది కాత్యాయని. కొంతసేపయిన తర్వాత శంకరమే బయటపడ్డాడు.

"... ఇంట్లో నీకు తెలియనిదేముంది చిట్టీ! రోజు గడవటంలేదు. రోజురోజుకూ నోటికీ చేతికీ దూరమైపోతూంది"

ఇటువంటి పరిస్థితి వస్తుందని కాత్యాయనికెప్పుడో తెలుసు. కాని ముందు చూపులేని ఆ మనుష్యుల మధ్య ఆ సమస్యకు పరిష్కారం లేదు.

"ఏమిటి పరేం చేద్దామని..."

"అదే తోచటం లేదు. భాస్కరమూ అలాగే ఉన్నాడు. ఓ దానికి కాక పోయినా మరోదానికయినా అసలువాడు గడపే తొక్కనివ్వడు. నీతో ఆలోచిద్దామని ఇలా వచ్చేను"

"అన్నీ హరించిపోయేక ఇప్పుడాలోచించి చేసేదేమిటి?"

"పోనీ నువ్వేం సాయం చెయ్యలేవా చిట్టీ?"

"నేనా!" ఆశ్చర్యపోయింది కాత్యాయని. "నేనే నా వరకూ పరాధీననయి బతుకుతున్నాను. నేనేం నీకు సాయం చెయ్యగలను!"

"అమ్మ నగలు నీకిచ్చింది. ఇప్పుడు నాకూ సమయం కాని సమయం వచ్చింది. అవి నాకిస్తే ముందుముందు బాగున్నప్పుడెప్పుడయినా నీకు తిరిగి ఇచ్చేస్తాను. "శంకరం ఆత్రుతగా చెల్లెలి జవాబు కోసం ఎదురు చూస్తున్నాడు.

"లక్షరూపాయల విలువచేసే ఆస్తిని పంచుకొని ఈనాటికి – రేపటికి ఏమీ లేకుండా చేసుకున్నావు. ఈ నగలమ్మి వచ్చే డబ్బుతో నీకూ నీ కుటుంబానికీ ఎన్నిరోజులు గడుస్తుంది! ఆ తర్వాత ఏమిటి? అయినా అవి అమ్మకు గుర్తుగా నా దగ్గరుండాలి. వాటిని ఎవరికీ ఇవ్వను"

"అలా అంటే ఎలా చిట్టీ? ఇదివరకు జరిగిన పొరపాట్లు జరుగనివ్వను. చాలా జాగ్రత్తగా ఉంటాను"

నాకు నమ్మకం లేదు"

"చిట్టీ!" శంకరంకి కొంచెం ఆవేశం వచ్చింది. "నా యింట్లో అత్తారింటి దగ్గర్నుంచి వచ్చి అన్ని రోజులున్నావు. కనీసం ఆ కృతజ్ఞతతోనైనా..."

కాత్యాయనికి శంకరం మీద అసహ్యం కలిగింది. తాను అక్కడ ఉన్నన్నాళ్ళూ తిన్న ప్రతి మెతుక్కూ విలువ కట్టి అన్నలిద్దరూ తల్లిని పీడించి డబ్బు వసూలు చేసిన సంగతి తెలుసు. అందుకనే అంది.

"కృతజ్ఞత అనేది ఉండాలికాని చెప్తే కలిగేదికాదు."

"అంతేనా ?"

"అంతే."

శంకరం కొంచెంసేపు మాట్లాడలేదు. తర్వాత,

"రమణ ఈ వూళ్ళోనే ఉన్నాడు తెలుసా ?" అన్నాడు.

మరో కొత్త బాణం తీసేడనుకుంది కాత్యాయని.

"రమణ ఎవరు ?" అంది.

"మీ ఆయన."

"నీ కెలా తెలుసు ఆయన ఇక్కడ వున్నట్లు?"

"నీ కెప్పుడూ కనబడలేదూ ?"

"కనబడ్డారు."

"మరి చెప్పవేం ?"

"చెప్పేందుకేముంది ఇందులో !"

"ఏం చేస్తున్నాడో తెలుసా ?"

"కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తు న్నారు."

"నీ కెలా తెలిసింది. కలిశావా ఎప్పు డైనా ?"

"ఆ ఇప్పుడు వాళ్ళింటినుంచే వస్తు న్నాను."

"ఏమంటాడు ?"

"దేన్ని గురించి ?"

"అదే ! నీ కాపురాన్ని గురించి ."

"ఆయన ఇంకో అమ్మాయిని పెళ్ళి చేసుకున్నారు."

"ఎవరా అమ్మాయి ?"

"నాకు తెలీదు."

"అయితే నువ్వేం చేస్తావ్ ?"

"నేను చేసేదేముంది ! ఏమీ లేదు."

"ఛీ! నువ్వు నా చెల్లెలివని చెప్పుకో డానికే సిగ్గనిపిస్తూంది నాకు."

బాణంముల్లు కనబడుతూంది అను కుంది కాత్యాయని.

అయినా లొంగదలుచుకోలేదు.

"అంత పనిగట్టుకొని చెప్పుకోవలసిన అవసరం ఏమొచ్చింది ?" అంది రెప్ప వాల్చకుండా కళ్ళలోకి చూస్తూ.

"సిగ్గూ ఎగ్గూ లేకుండా అతను మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడని చెప్తున్నావ్ ! నడి రోడ్డుమీద అతనితో తైతక్కలాడు తున్నావ్! ఏదో నీ పొట్టపోసుకోడానికి ఇక్కడుంచేనని అమ్మ చెప్పింది. ఇంత నీచంగా బ్రతక్కపోతే......"

"నా చావుబతుకుల గురించి మనసు పాడుచేసుకోకు. నేను చెయ్యవలసిందేదో నేను చేస్తాను. నీకు రోజు గడిచే ఉపాయం నువ్వే చూసుకో !"

కాత్యాయని లేచింది.

"నీ బండారం బయటపెట్టి మరీ వెడ తాను" అంటూ రోషంతో లేచేడు శంకరం.

"నువ్వు ఏం చేసినా సరే అమ్మ నగలు నీకిచ్చేది లేదు. నీ బండారం బయటపెట్టుకుంటావో నా బండారమే బయటపెడతావో నీ యిష్టం..." కాత్యా యని నిర్లక్ష్యంగా నవ్వింది.

శంకరం నిప్పులు కురిపిస్తూ చూసేడు. చివరకు ఏమీ చేయలేక బుసలు కొడుతూ బయటకు నడిచేడు. కాత్యాయని పెద్దగా ఊపిరి పీల్చి సోఫాలో కూలబడింది. మనసు కొంత తేలికపడింది.

"ఎవరది కాత్యాయనీ ?"

రాజశేఖరం కంఠం విని కాత్యాయని వెనక్కు తిరిగి చూసింది. అతను ఇంట్లో ఉన్నట్టు గమనించనేలేదు.

"ఎవరది ? అంత కోపంగా మాట్లాడుతున్నారు ?"

మెట్లు దిగివస్తూ మళ్ళీ అడిగేడు రాజ శేఖరం.

—

"మా అన్నయ్య."

"ఎవరు భాస్కరమా ?"

"కాదు, శంకరం."

"వెళ్ళిపోయాడా ?"

"అవును."

"పోనీ రెండు రోజులుండమనలేక పోయావా ?"

"నేనే వెళ్ళిపొమ్మన్నాను."

ఏమనుకున్నాడో ఏమో మరో ప్రశ్న వెయ్యకుండా రాజశేఖరం బయటకు వెళ్ళిపోయాడు.

[redacted]

# 9

వంటింటి గుమ్మం దగ్గర రవిని చూసి ఆశ్చర్య పోయింది కాత్యాయని.

"ఏమిటీ రోజు రవి పడమటింట్లో ఉదయించేడు?" అంది.

"ఇంకా వంట కాలేదా?"

"ఏం ఆకలేస్తూందా?"

"లేదు. నీతో కొంచెం పనుంది."

"ఏమిటి?"

"మాట్లాడాలి."

"వస్తున్నా. పదినిమిషాలాగు."

రవి వెళ్ళి పోయాడు. వంట ముగించి కాత్యాయని రవి గదిలోకి వెళ్ళింది.

రవి కిటికీ దగ్గర ఈజీ చైర్లో కూర్చొని కాళ్ళు కిటికీలో పెట్టి ఆకాశం లోకి చూస్తున్నాడు.

"యస్సర్!" అన్న కాత్యాయని కంఠం వినగానే రవి కుర్చీలోంచి లేచి సరిగా కూర్చొని కాత్యాయనికి ఎదురుగా ఉన్న కుర్చీ చూపించేడు.

"ఏమిటీవేళ దొరగారు ప్రత్యేకంగా మర్యాద చేస్తున్నారు?"

వేళాకోళం చేస్తూన్న కాత్యాయని ముఖంలోకి నవ్వుతూ చూశాడు రవి.

"నీకు కథ చెప్పాలని పిలిచేను. కాని నువ్వు సీరియస్‌గా విని నీ అభిప్రాయం చెప్పాలి."

"ఈ మధ్య ఇదికూడా మొదలు పెట్టేవా?"

"కథంటే కథకాదు. కథలాంటి నిజం."

"సరే కానీ."

"ప్రమీల గుర్తుందా?"

"ఎవరు? నువ్వు ప్రేమించి పగతీర్చుకుందా మనుకున్న అమ్మాయి కదూ!"

"అవును."

"ఊఁ"

"ఆ అమ్మాయి నాకు ఇంచుమించుగా మూడు సంవత్సరాల నుంచీ తెలుసును. ఆమె అంటే నాకు చాలా ఇష్టం కలిగిన సంగతి నీకు తెలుసు. ఆ అమ్మాయి ఎప్పుడూ తలవంచుకొనే నడిచేది. ఎప్పుడూ ఎవరితోనూ మాట్లాడడం నేను చూడలేదు. ఇంచు మించుగా ఆమెకు నీడలా ఉంటూండే వాడిని నేను. ఒక సంవత్సరం తరువాత ఆమెలో హఠాత్తుగా మార్పు వచ్చింది. అందరిలో నవ్వుతూ తుళ్ళుతూ కనబడేది. బట్టలు కొంచెం ఫాషనబుల్‌గా వేసుకొనేది. ఆమెలో వచ్చిన మార్పు నాలో కొంత సందేహం కలిగించింది. అన్నాళ్ళు ముభావంగా ఉండే ఆమెతో సాహసించి నేను మాట్లాడనే లేక పోయాను. నా మనసులో ఆమె అంటే కలిగిన భావం చెప్పనేలేక పోయాను.

ఒకరోజు కాలేజి ముందు ప్రమీల నిలబడి నలుగు రైదుగురు స్టూడెంట్సుతో మాట్లాడుతూంది. వాళ్ళలో నా స్నేహితుడు కూడా ఉన్నాడు. నేనూ వెళ్ళి నిలబడ్డాను. వాళ్ళ క్లాసంతా పిక్నిక్ ప్రోగ్రాం వేస్తున్నారు. ఆమెను కూడా రమ్మని బలవంతం చేస్తున్నారు. ఆ పిక్నిక్‌కు నేనూ వెళ్ళేను. నేను ఆమెతో

స్పష్టంగా మనసువిప్పి చెప్పక పోయినా ఉల్లాసంగా గడిపేను. ఆటలు ఆడేము. పాటలు పాడేము. ఫొటోలు తీయించు కున్నాము. అందరి కంటే ఆమెతో నేను దగ్గరగా ఉంటున్నా ననుకున్నాను. ఆమె నా సొత్తే అనే అపోహలో పడ్డాను.

కొన్ని రోజుల తర్వాత ఆమెను ఒక సినిమాహాల్లో చూసేను. ఆమె నాముందు వరుసలో ఉంది. ఆమె ప్రక్కనే మా కాలేజి లెక్చరర్ ఒకతను ఉన్నాడు. ఇద్దరూ కలసి వచ్చేరను కున్నాను. ఏవో మాట్లాడుతూనే ఉన్నారు. మాటల మధ్య అతను ఆమె చేతిని తన చేతు ల్లోకి తీసుకోవడం చూశాను. నాకు కోపంతో తల తిరిగి పోయింది. ఆమె నవ్వుతూనే మాట్లాడడం చూసి నిలుప లేక పోయాను మధ్యలో లేచి ఇంటికి వచ్చేశాను. ఒక్కక్షణంలో ప్రమీల అంటే పగ పెరిగి పోయింది.

అప్పుడే ప్రమీలను గురించి నీతో మాట్లాడడం జరిగింది. నేను ప్రమీలను మనసారా ప్రేమించేసని నమ్మేను. ప్రమీల నన్ను మోసం చేసిందనిపిం చింది. కాని నువ్వు నేనామెను నిజంగా ప్రేమించ లేదన్నావు. ప్రేమించి ఉంటే ఆమెకు కీడు తలపెట్టే వాడినే కాద న్నావు. నీమాటలు నిజమేకావచ్చు. కానీ ఆవేశంలో నీమాటల్లో నిజాన్ని గ్రహించే శక్తి లేకపోయింది.

అయినా నీ మాటలు నా మనసులో నుండి తీసెయ్య లేకపోయాను. నాకు తెలియకనే నీమాటల కెంతో విలువనిచ్చే వాడిని. ప్రమీలను నిజంగా ప్రేమిస్తే ఆమె మీద పగ తీర్చుకోవడ మేమిటి? ప్రమీల ద్వారా కలిగిన షాక్, నీ వాదన లలో ఉన్న తర్కం కారణంగా నా ఆలో చనల్లో ఎన్నో మార్పులొచ్చేయి. నా దృష్టిలో అంతటి వరకూ ఉన్న జీవితపు విలువలు తారుమారయ్యేయి. అదంతా అప్రస్తుతం అనుకో! అయినా ఎందుకు చెప్తున్నానంటే ప్రమీల మీద నా దృష్టి మారింది. క్రమంగా ఆమె మీద ద్వేషం పోయింది. దానికి బదులుగా జాలీ, సానుభూతీ కలిగేయి. ఆమె ఆ లెక్చరర్‌తో సుఖంగా ఉండా లని కోరుకోగలిగే స్థితికి వచ్చేను. నిన్న ఒక స్నేహితుడి కోసం యూనివర్శిటీ హాస్టలుకు వెళ్ళేను. ఆ లెక్చరరు వేరే పెళ్ళి చేసుకున్నాడని తెలిసింది. ప్రమీల పదిహేను రోజులుపైగా కాలేజీకి రావటం లేదట! నా హృదయమంతా కలచివేసినట్లయింది.

ఈ రోజు వాళ్ళింటికి వెళ్ళేను. అప్ర సన్నంగా ఉన్న ఆమె ముఖంలోకి చూడ లేకపోయేను. చివరకు ఎలాగో "మీతో కొంచెం మాట్లాడే పనుంది" అన్నాను.

ఆమె ముఖంలో ఆదిలోఉన్న నిరా డంబరమూ లేదు. తర్వాత తెచ్చుకున్న ఉత్సాహమూ లేదు. విసుగూ,ఒకరకమైన బాధ స్పష్టంగా కనబడుతున్నాయి.

"చెప్పండి" అంది.

"నేను మీతో ఏకాంతంగా కొన్ని విషయాలు చెప్పాలి. మీరు దానికి అవ కాశం ఇవ్వాలి" అన్నాను.

ఆమె ముఖం మీద చికాకు మాత్రం చెరిగిపోలేదు. ఏదో వెతుకుతున్నట్లు నా ముఖంలోకి చూసింది. ఆమె గుమ్మం మీదా, నేను కిందా కొంత సేపు నిలబడి ఉన్నాము.

"లోపలకు రండి" అందామె.

"బయటకు వెడితే బాగుంటుందను

కుంటాను" అన్నాన్నేను.

"ఫరవా లేదు. లోపలకు రండి" అని దారి తీసిందామె. నేను వెనకాలే వెళ్ళను. అయినా ఆ వాతావరణం, అందులో రెండు మాటలు మాట్లాడగానే నన్ను బయటకు పంపుదామన్నట్లు ఆమె నిలబడడం—అంతా ఇబ్బందిగానే వుంది. అయినా నా మీద ఒక దురభిప్రాయం ఏర్పరచుకున్నట్లు ఆమె చూస్తుంటే నేను నా మనసులో ఆమె పట్ల మొదటి నుంచీ కలిగిన భావాలు స్పష్టంగా చెప్పగలిగేను. చివరకు అన్నాను. "ఇన్ని సంవత్సరాలు కష్టపడి చదివిన చదువు అర్ధాంతరంగా మానెయ్యడం మంచిది కాదు. నేను మీకు ఏ విధంగా సహాయ పడగలిగినా చాలా సంతోషిస్తాను."

ఆమె ముఖంలో భావం మారింది. ఒక రకమైన కుతూహలంతో నా కళ్ళల్లోకి చూసింది.

"నాకు కావలసింది మీరు చెయ్యలేరేమో!" అంది.

"చెయ్యగలనో లేనో నాకు ఆలోచించుకోడానికేనా అవకాశం ఇవ్వాలిగా!" అన్నాన్నేను.

"అయితే నన్ను పెళ్ళి చేసుకుంటారా" అంది ప్రమీల.

అంత సూటి ప్రశ్న అంత తక్కువ వ్యవధిలో ఊహించలేదు నేను. ఒక్కసారి ఆలోచనలన్నీ చెదిరిపోయాయి. అసలు అంతరాంతరాల్లో నా మనసులో కూడా అదే ఆలోచన ఉన్నా, ఆమె ప్రశ్న వినగానే అంతా తుడిచివేసినట్లు చెరిగిపోయింది. నువ్వా, నాన్నా అందరూ మనసులో మెదిలేరు. తేరుకొనేసరికి కొంచెం టైము పట్టింది.

"అది నేను ఆలోచించవలసిన విషయం. మా వాళ్ళతో సంప్రదించేందుకు మీ గురించి కొన్ని వివరాలు తెలియాలి" అన్నాను.

ప్రమీల తర్వాత చాలా సేపు చెప్పింది. ఆమె వైఖరిలో ఎంతో మార్పు వచ్చింది. ఎంతో మర్యాదగా మాట్లాడింది. చివరకు ఒక విధమయిన సీరియస్‌నెస్‌తో అంది.

"...నేను వంచింపబడ్డాను. మంచిని అర్థం చేసుకోలేని మనుషులకు మనసిచ్చి తిరగడం ఎంత తెలివి తక్కువో తెలుసుకున్నాను. మీరు నా మీద ఇంత అభిమానాన్ని వ్యక్తం చేశారు కనుక ధైర్యం చేసి ఈ మాట అడిగేను. నేను చేసిన పొరపాటు తెలిసుండీ మీరు నన్ను స్వీకరించగలిగితే నా సర్వస్వం మనస్ఫూర్తిగా మీకు అర్పించగలను. మీరు నాకు భిక్షగా మాత్రం దాన్ని ఇయ్యనక్కర్లేదు. మీ పరిస్థితులు నన్ను పెళ్ళిచేసుకోడానికి అనుకూలించకపోతే మీ నుండి నాకు మరే సాయమూ వద్దు. మీ సానుభూతికి ఎంతో కృతజ్ఞురాలిని. మీరు చెప్పినట్లు ఇదే మన ఆఖరు కలయిక అనుకోండి" అంది.

నేను ఆలోచించి చెప్తానని వచ్చేశాను.

ప్రమీలతో నా జీవితం చాలా సుఖంగా గడుస్తుందని నాకనిపిస్తుంది. నాతో పోల్చుకుంటే ఆమె అన్ని విధాలా ఉత్తమురాలు... అందుకని..." కాత్యాయని ముఖంలోకి చూస్తూ రవి ఆగియాడు.

రవిలో వచ్చిన మార్పు నిజంగా కాత్యాయన్ని ఆశ్చర్య పరిచింది. మరో

మనిషితో చనువుగా తిరుగుతుందని ఆమె మీద పగ బూనిన మనిషి ఆమెను భార్యగా స్వీకరించడానికి సిద్ధపడుతూంటే మనసులో అభినందించకుండా ఉండలేకపోయింది.

"ఇప్పుడు చెప్పు ! నీ అభిప్రాయం ఏమిటి ?" అడిగాడు రవి. కాత్యాయని కొంచెంసేపు ఆలోచించి చెప్పింది.

"నేను మాత్రం పూర్తిగా నీ ఆలోచనతో ఏకీభవిస్తాను". రవి ఎగిరి గంతేశాడు. "నువ్వు మనస్ఫూర్తిగా నా ఆలోచన సమర్థిస్తే నాకు మిగిలిన ప్రపంచమంతా ఎదురొచ్చినా లెక్కలేదు" అన్నాడు.

కాత్యాయని వెంటనే అంది. "కానీ కొన్ని విషయాలు మాత్రం గుర్తు పెట్టుకో. నిన్నటిదాకా దేవతలా కనిపించిన వ్యక్తి రేపు చేతికింద కొచ్చిన తర్వాత చాలా సామాన్యంగా కనబడుతుంది. ప్రమీల చెప్పినట్టు నువ్వు ఆమె మీద సానుభూతితో ఈ పని చేస్తున్నావనుకుంటే అది మానెయ్యడమే మంచిది. అన్నిటికంటె ముఖ్యమైన విషయం ఏమిటంటే ముందుముందు మీ మధ్య ఎన్నో భేదాభిప్రాయాలు, కలతలు రావచ్చు. కాని అటువంటప్పుడు ఎన్నడైనా ఆమె పొరపాటును వేలెత్తి చూపేవో మీ ఇద్దరి మధ్యా అన్యోన్యతకి అదే ఆఖరు రోజు"

"నాన్న అన్నం పెట్టమంటున్నాడు" రాధికొచ్చింది.

"అరె! మీ నాన్నగారు వచ్చేశారా?" అని కాత్యాయని లేచి "నడు భోంచేద్దువుగాని" అంది రవితో.

"ఇక్కడికి తీసుకురావా !" అన్నాడు రవి.

"నాన్సెన్స్ ! ఇంతసేపూ నీ కథ విని ఇక్కడికి ఇంకా అన్నం తీసుకొచ్చి పెడతానా ! నడు ఈ రోజు మీ నాన్నగారితో భోజనం చేద్దువుగాని" కాత్యాయని వెళ్ళిపోయింది.

ఆ రోజు డైనింగ్ టేబిల్ చుట్టూ ఇంట్లో అందరూ మొదటిసారిగా భోజనానికి కూర్చున్నారు.

భోజనాలయిన తర్వాత "ఇప్పుడు నాన్నగారితో పోయి మాట్లాడతాను." అన్నాడు రవి.

"విష్యూ గుడ్ లక్ !" అంది కాత్యాయని.

వంటిల్లు సర్దుతూంటే రాజశేఖరం వంటింట్లోకి వచ్చేడు.

"ఏమిటి కథంతా నీకు చెప్పినట్టున్నాడు !" అన్నాడు.

"చెప్పేడు. మీకు చెప్పలేదా !"

"అమ్మాయి, వాళ్ళ కుటుంబాన్ని గురించిన వివరాలు చెప్పేడు. అంతకంటె ఇంకేమైనా ఉందా ?"

అసలు విషయం రాజశేఖరానికి చెప్పడం అనవసరం అనిపించింది. అందుకనే ఏమీ లేదని చెప్పింది.

"నీ అభిప్రాయం ఏమిటి ?" రాజశేఖరం అడిగేడు.

"అతను అంత మనసు పడుతూన్నప్పుడు ఎవరి అభిప్రాయాలతో పనేముంటుంది, మీరేమన్నారు?"

"సరేనన్నాను....ఏమిటీవేళ భోజనానికి ఇక్కడికి వచ్చేడు ?"

'అతని కథ నేను విన్నందుకు లంచం" కాత్యాయని నవ్వింది.



# 10

రవి వివాహం ప్రమీలతో నిరాడంబరంగా జరిగిపోయింది.

అప్పటిదాకా మానసికంగా ఒంటరి జీవితాన్ని గడిపిన రవికి ప్రమీల భార్యే కాక మంచి స్నేహితురాలు అయింది. సంస్కారపూరితమైన మనసుండి కూడా తెల్లనివి పాలూ, నల్లనివి నీళ్ళూ అని నమ్మి మోసపోయి చేసిన పొరపాటుకు పశ్చాత్తాపపడుతూన్న ప్రమీలకు రవి చేయూతతో ఉత్సాహం, శక్తి వచ్చేయి.

రవి మళ్ళీ సంవత్సరందాకా పరీక్షకు వెళ్ళేందుకు లేదు. అప్పటిదాకా చదువుకుంటూనే సరదాకు ఏదైనా ఉద్యోగం చెయ్యాలనిపించింది. మద్రాసు దగ్గర ఓ చిన్న పట్టణంలోని కాలేజీలో డిమాన్‌స్ట్రేటరుగా ఉద్యోగం వస్తే ప్రమీలను తీసుకొని వెళ్ళేడు. రవి ఓ దారిన పడటంతో రాజశేఖరానికి కొంత అతని గురించి దిగులు తగ్గింది.

ఉతికిన బట్టలన్నీ మధ్యహాల్లో టేబిల్ మీద వేసుకొని ఇస్త్రీ చేస్తూంది కాత్యాయని.

వీధిలో 'టెలిగ్రాం' అన్న కేక విని పడి ప్లగ్ డిస్కనెక్ట్ చేసి తొందరగా వెళ్ళింది కాత్యాయని. టెలిగ్రాం ఆమెకే వచ్చింది. ఏం జరిగినా తనకు టెలిగ్రాం ఇచ్చే వారెవరున్నారని ఆలోచించింది. ఎవరూ స్ఫురించలేదు. టెలిగ్రాం విప్పి చూసింది.

రవి తాను పరీక్షలో ఫస్టుక్లాసులో పాసయినందుకు అభినందనలు తెలుపుతూ టెలిగ్రాం ఇచ్చేడు. కాత్యాయని ఆశ్చర్యపోయింది. పేపరుకోసం రాజశేఖరం గదిలోకి వెళ్ళి చూసింది. ఫస్టుక్లాసులో తన నెంబరు చూసుకుంది. మనసంతా ఆనందంతో నిండిపోయింది.

కాత్యాయనికి హఠాత్తుగా తల్లీతండ్రీ గుర్తుకొచ్చేరు. ఇద్దరూ మరణశయ్య మీద విభిన్న పరిస్థితుల్లో తన క్షేమాన్ని గురించి ఆందోళన పడుతూనే మరణించేరు. ఈ క్షణం వాళ్ళుంటే ఎంత బాగుండేది! ఆమె మనసులో ఆనందం పట్టలేకుండా ఉంది. దాన్నెవరితోనైనా పంచుకోవాలి. సాయంత్రంవరకూ పిల్లలెవరూ రారు. మరోగంటకు రాజశేఖరం వస్తాడు, మంచి టిఫిన్ ఏదైనా చెయ్యాలనిపించింది. ఆ యింట్లో అందరిమీదా ఆ క్షణంలో ఎంతో కృతజ్ఞత కలిగింది. అయినా తానేం చెయ్యగలదు! వాళ్ళింట్లో సామానులతో వాళ్ళకు విందు చెయ్యగలదు. వంటింట్లో కెళ్ళి గోధుమ గవ్వలూ, పకోడీలూ చేసింది. చేస్తూన్నంతసేపూ మనసు నిండా ఎన్నో ఆలోచనలు. ఇటుపైన తన కాళ్ళమీద తాను నిలబడగలగాలి! పేపరు చూసి ఏ ఉద్యోగం కనబడితే దానికి అప్లికేషను పెట్టాలి తాను స్వతంత్రంగా జీవించాలి! కాత్యాయని వంటింట్లోంచి లేచేసరికి మధ్యాహ్నం ఒంటిగంటన్నర అయింది. రాజశేఖరం ఒంటిగంటకే రావలసింది రాలేదు.

కాత్యాయనికి ఉమాదేవి గుర్తు

రోజులు దాటింది కూడాను. ఆమెకీవార్త చెప్పినట్లూ అవుతుంది. నెలలు నిండుతూన్న ఆమె నోటికి తీపి అందించినట్లూ అవుతుంది. వెంటనే గవ్వలూ పకోడీలూ ఒక చిన్న టిఫిన్ బాక్సులో వేసుకొని తలుపు తాళంపెట్టి బయులుదేరింది.

తీరా అంత దూరమూ వెడితే ఉమాదేవి లేదు. రమణ ఉన్నాడు.

"కూర్చో కాత్యాయనీ!" అన్నాడు సోఫా చూపించి. "ఉమ ఊళ్ళోలేదు. అనుకోకుండా వాళ్ళ నాన్నగారు రెండు రోజులముందు ఏదో పనిమీద ఇక్కడకు వచ్చి ఉమకు ఎలాగూ నెలలు నిండేయి కదా అని పురిటికి తీసుకెళ్ళేరు" అన్నాడు.

కాత్యాయని తిరిగి వచ్చేద్దామనుకుంటూంటే "అంత దూరంనుంచి వచ్చేవు పది నిమిషాలు కూర్చో" అన్నాడు రమణ. చేసేదిలేక కాత్యాయని కూర్చుంది.

"ఉమకోసం ఏదో తెచ్చినట్లున్నావే" రమణ బాక్సుచూసి అన్నాడు.

కాత్యాయని తన రిజల్ట్సు సంగతి చెప్పింది "తీసుకోండి" అని బాక్సు మూతతీసి అతని ముందుంచింది.

"వెరీగుడ్, కంగ్రాచ్యులేషన్స్!" అన్నాడు రమణ ఒకటితీసి నోట్లో పెట్టుకుంటూ. "మొత్తానికి సాధించేవన్న మాట!"

కాత్యాయని జవాబుగా చిరునవ్వు నవ్వింది కిందికి చూస్తూ. పనికట్టుకొని వెళ్ళిపోవడం బాగుండదని కాస్సేపు కూర్చుందికాని కాత్యాయనికి అతనితో ఏం మాట్లాడాలో తోచటంలేదు. అతను ఎప్పుడూ పరిచయంలేని మనిషిలా అని పించేడు.

"ఇన్నాళ్లనుంచీ నువ్వేంచేస్తున్నావ్" అన్నాడు రమణ.

జవాబు చెప్పడం ఇష్టం లేకపోయినా మరేం మాట్లాడాలో తోచక "రెండు మూడేళ్ళు అమ్మదగ్గర ఉన్నాను. రాజశేఖరంగారని ఒకాయన మా దూరపు చుట్టం ఇక్కడ ఉంటున్నారు. ఈ మధ్య చాలా రోజుల్నుంచి ఇక్కడ ఉంటున్నాను" అంది.

నిన్ను తలచు కున్నప్పుడల్లా నాకేదో తప్పు చేసినట్లని పిస్తుంది. స్వతంత్రంగా నిలబడగల శక్తిలేని నిన్ను బాధ్యత లేకుండా వదిలెయ్యడం..."

"మీరు నన్ను వదిలెయ్య లేదుగా! నేనే వెళ్ళేను."

"ప్రేరేపించింది నేనేకదా! ఉమమీద నాకున్న ఆలోచనలు చెప్పకపోతే నువ్వు వెళ్ళేదానివే కాదు."

"పోనీండి. ఇప్పుడా మాటల వలన ప్రయోజనం ఏమిటి?"

"ప్రయోజనం ఉన్నా లేకపోయినా గతాన్ని మరచి పోలేం కదా!"

"ప్రయోజనం లేని జ్ఞాపకాలు కాలాన్ని వృధా చెయ్యడానికి తప్ప మరెందుకూ పనికిరావు."

"నీమాటలు కటువుగా ఉంటాయి... కాని వాటిలో ఏదో ఆకర్షణ కూడా ఉంది..." అని రమణ పదినిమిషాల పాటు తనకుటుంబ విషయాలు చెప్పేడు. కాత్యాయనికి ఈ సంభాషణంతా అనవసరం అనిపించింది.

"అయితే వస్తాన్నేను" అని లేవబోయింది.

"కూర్చో కాత్యాయనీ! ఎలాగూ ఓ గంట కూర్చుందామనే కదా వచ్చింది.

గంట కాకపోతే అరగంట కూర్చోవచ్చు నేను అంత మాట్లాడ కూడని వాడిని కాదుగా!" అన్నాడు రమణ తను కూర్చున్న సోఫాలోంచి ముందుకు వంగేడు. ఏదో ముఖ్యమైన విషయాన్ని చెప్తున్నట్లుగా చెప్పేడు.

"జీవితంలో మనం పొందే అనుభూతుల్లో మార్పులు -ఒక్కొక్కప్పుడు విచిత్రంగా ఉంటాయి కాత్యాయనీ! ఒకప్పుడు మన మనసును పూర్తిగా వశం చేసుకొనే అనుభవాలు మరొకప్పుడు ఏమాత్రం ఆసక్తి కలిగించకుండా ఉంటాయి. అలాగే ఒకప్పుడు మనసుకు నచ్చని మనుషులు..."

కాత్యాయనికి రమణలో ఏదో మార్పు కనబడుతూంది. అతని చేతులు కొద్దిగా వణకడం గమనించింది.

"—కాత్యాయనీ! ఏడేళ్ళ ముందు ఉమను చూస్తూంటే ప్రపంచంలో ఆమెకెవరూ సాటి రారనిపించింది. అనుక్షణమూ ఆమె రూపం కనుల ముందు నిలిచేది. దానికి నేనెంత లొంగి పోయేనంటే ఆమెను పొందలేని సమయంలో ఆమె లేకుండా ఉండలేనని తాళికట్టిన భార్యతో కూడా చెప్పుకున్నాను..."

"ఉమ అసమాన సౌందర్యవతి. మీ కష్టాన్ని అప్పటికంటె ఇప్పుడెక్కువ తెలుసుకున్నాను."

"కాని కాత్యాయనీ ! ఎందుకో ఇప్పుడామె అంత ఆకర్షణీయంగా కనబడటం లేదు. నాకు ఆమె ముందు ఎటువంటి భావోద్వేగం కలగటంలేదు. ఆమెమనసు పరిపక్వం చెందలేదనిపిస్తుంది. జీవితం మీద ఆమెకు సమగ్రమైన అభిప్రాయం లేదు."

"అది నే నొప్పుకోను. మీరు చెప్పిన మాటలనుబట్టి జీవితంమీద సమగ్రమైన అభిప్రాయం మీకే లేదనిపిస్తుంది..."

రమణ కాత్యాయని మాటలు విన్నట్లు లేడు. తానే చెప్పుకుపోతున్నాడు.

"...ఒకప్పుడు చాలా సామాన్యంగా కనబడిన నీలో ఏవో అపూర్వమైన అందాలు కనబడుతున్నాయి. ఒకప్పుడు ఇద్దరం కలసి మసలిన వాళ్ళమే! మనం తిరిగి ఎందుకు సన్నిహితంగా ఉండకూడదు ! తిరిగి ఇద్దరం ఒకటి ఎందుకు కాకూడదు !" రమణ తన రెండు చేతులతో కాత్యాయని చేయి పట్టుకున్నాడు.

కాత్యాయనికి రమణంటే చెప్పలేని వెగటు కలిగింది. సూటిగా రమణ ముఖంలోకి చూసింది. ఆమె చూపు భరించలేక అతను తల పక్కకు తిప్పేడు.

"చేయి వదలండి" కాత్యాయని నిశ్చలంగా అంది. రమణ తిరిగి ఆమె ముఖంలోకి చూసేడు. వెంటనే చేయి వదిలేడు.

"మీతో పెళ్ళయిన తర్వాత మీ మనసు ఉమమీద లగ్నమైఉందని తెలిసినపుడు మీ బలహీనతను నేను అర్థం చేసుకోగలిగేను. కాని వలచిన ఆమెను పొంది ఇన్ని సంవత్సరాలు కాపురం చేసి ఇప్పుడు తిరిగి నా చెయ్యి పట్టుకున్న మీ బలహీనతను నేను అర్థంచేసుకున్నా అసహ్యించుకోకుండా ఉండలేను. మారుతూన్న మీ అభిరుచుల మూలంగా ఉమాదేవికి ఏ అన్యాయం జరిగినా అది మీరు చేయగల చాలా నీచమైన పనుల్లో ఒకటి. పసిపిల్లలా అమాయకంగా అందంగా ఎప్పుడూ నవ్వుతూ వుండే



ఆమె ముఖంలోని విషాదరేఖ మీ జీవితంలో వినాశాన్నే సూచిస్తుంది. మీ విద్యకూ అంతస్థుకూ తగినట్లుగా నడుచుకోండి "

కాత్యాయని లేచి బయటకు వచ్చేసింది.

అక్కడికి వెళ్ళేవరకూ ఆనందంతో పొంగిపోయిన కాత్యాయని మనసు పూర్తిగా కలగిపోయింది. తిరిగి ఇంటికి చేరేసరికి కొంత స్వస్థత కలిగింది,

పిల్లలు, రాగానే వాళ్ళకు టిఫిన్ పెట్టి తను ఫస్టుక్లాసులో పాసయినట్లు చెప్పింది. పసిపిల్లలతోనైనా మనసులో సంతోషాన్ని పంచుకుంటేకాని సంతృప్తి. కలుగకపోవడం తనకే చిత్రమనిపించింది. "విచారాన్ని దాచుకున్నవాడు గొప్పవాడే! కాని సంతోషాన్ని దాచుకున్నవాడు ఇంకా గొప్పవాడు" ఎక్కడో చదివిన వాక్యం గుర్తుకొచ్చి అదెంత నిజమా అని ఆశ్చర్యపోయింది.

కాత్యాయని మేడమీదకు వెళ్ళింది. ఉన్నట్లుండి గుండెలో ఏదో దిగులు అలుముకుంటూంది. దూరంగా సముద్రంలోకి చూస్తూ దానికి కారణం తెలుసుకోడానికి ప్రయత్నిస్తూంది. కంగ్రాచ్యులేషన్స్ చెప్తూ మేడమీద కొచ్చిన సుజాత కంఠం విని ఉలిక్కిపడింది కాత్యాయని.

"ఒక్కర్తెవూ ఇక్కడున్నావేం ?" అంది సుజాత.

"ఏంలేదు ఊరికెనే."

"ఇంటి దగ్గర ఇన్ని పనులు చేస్తూ ఫస్టుక్లాసులో పాసవడంచాలా బాగుంది."

"దానికేముంది ! ఈ వయసులో ఇదో గొప్పా !"

"అయితే తరువాత ఏమిటి ?"

"ఏముంది ? ఏదైనా ఉద్యోగానికి ప్రయత్నించాలి."

"ఇక్కడనుంచి వెళ్ళిపోతావా ?"

"వెళ్ళాలికదా ! ఈ యింటి బిడ్డవు. నీకే ఇది శాశ్వతమైన చోటుకాదు. ఏదో ఆశ్రయాన్ని అర్థించి వచ్చినదాన్ని అవకాశం వెదుక్కొని వెళ్ళకపోతే ఎలాగ?"

మరో పది నిమిషాలు ఉండి సుజాత కిందకు వెళ్ళిపోయింది. ఆకాశం అంతా మబ్బు కమ్మేసింది. ఈ మారే ప్రకృతికి గంట ముందు సూచన కూడా లేదు. మరికొద్దిసేపట్లో టపటప మని పెద్ద చినుకులతో ప్రారంభమై ధారాపాతంగా వర్షం మొదలయింది. కాత్యాయనికి కదలబుద్ధి కాలేదు. మరు క్షణంలో సుజాత గొడుగుతో పైకొచ్చింది.

క్రిందికి వెళ్ళే సరికి కాత్యాయని ఇంచు మించుగా తడిసి ముద్దయింది.

కాత్యాయనికి హఠాత్తుగా రాజశేఖరం గుర్తుకొచ్చేడు. మనసులో దిగులు కంతకూ అతనే కారణం అనిపించింది. బయట పిడుగు పడింది. కాత్యాయని గుండె దడదడా కొట్టుకోవడం మొదలు పెట్టింది.

అందరూ భోజనాలు చేశారు. కాత్యాయని తినలేదు. కాళ్ళు కాలిన పిల్లిలా ఇల్లంతా తిరిగింది. ఒకళ్ళ తర్వాత ఒకళ్ళు మెల్లగా నిద్రపోయారు.

తలుపు తీసుకొని వీధిలోకి వచ్చింది కాత్యాయని. వర్షం కొంచెం కూడా తగ్గ లేదు. రోడ్డు మీద మోకాలి లోతు నీరు వచ్చింది.

నీళ్ళల్లో నడుస్తూన్న చప్పుడయి చీకట్లోకి చూసింది. మరో నిమిషంలో రాజశేఖరం వచ్చి గుమ్మంలో నిలబడ్డాడు. అతని ఆకారం చూసేసరికి కాత్యాయనికి మతిపోయి నట్లయింది.

తుడుచు కొనేందుకు తువ్వాలిచ్చి, ఇస్త్రీ బట్టలిచ్చి, బట్టలు మార్చుకోమని చెప్పి వంటింట్లో కెళ్ళి గబగబా అన్నం వడ్డించింది. తిరిగివచ్చే సరికి రాజశేఖరం బట్టలు మార్చుకొని మంచం మీద పడుకొని ఉన్నాడు.

"రండి అన్నం పెట్టేను." అంది. అతను కళ్ళు తెరచి నీరసంగా తలనిటు తిప్పేడు. కళ్ళు చింత నిప్పుల్లా ఉన్నాయి.

"ఏం అలా ఉన్నారు! వంట్లో బాగు లేదా?"

రాజశేఖరం జవాబు చెప్పకుండా కళ్ళు మూసుకున్నాడు. శరీరం వణుకుతూంది. కాత్యాయని రగ్గుకప్పి నుదుటి మీద చెయ్యివేసి చూసింది. జ్వరం ఉన్నట్లుగా ఉంది.

"డాక్టరుకు ఫోన్‌చెయ్యమన్నారా?"

అతను అడ్డంగా తల ఊపేడు.

క్రమంగా కొంత సేపటికి వర్షంలో తడిసిన చల్లదనం తగ్గిపోయి జ్వరంవేడి పూర్తిగా కనబడింది.

కాత్యాయనికి అన్నం తిన బుద్ధి కాలేదు. వడ్డించినవి మళ్ళీ గిన్నెల్లో సర్ది పెట్టింది.

రాజశేఖరం పెద్దగా మూలుగు

తున్నాడు. అతని గదితలుపులు తెరచి ఉంచి ఎదురుగా పక్కవేసుకు పడుకుంది కాత్యాయని. బయట వర్షంతో ఈదురు గాలులు చప్పుడు చేస్తున్నాయి.

రెండు మూడు నిమిషాలకు ఉరుములు మెరుపులు. కాత్యాయని మనసులోని ఆందోళన అంత కంతకూ ఎక్కువయి పోతూంది. అటూ ఇటూ దొర్లిదొర్లి రెండు మూడు గంటలకు నిద్రపోయింది.



# 11

నిద్రలో ఎవరో పిలిచినట్లయి కళ్ళు తెరచి చూసింది కాత్యాయని.

రాజశేఖరం తన వైపే చూస్తున్నాడు.

"నిద్రరావటం లేదా?" కాత్యాయని అడిగింది.

రాజశేఖరం నీరసంగా అడ్డంగా తల తిప్పేడు.

"ఇప్పుడే వస్తున్నా నుండండి" అని ఒళ్ళో నిద్రపోయిన రాధికను వేరే మంచం మీద పడుకొబెట్టి వచ్చింది. వస్తూ టైము చూసింది. పన్నెండున్నర అయింది. రాజశేఖరం గదిలో రాధికను ఒడిలో పెట్టుకొని కూర్చున్న తనకు ఎప్పుడో నిద్ర పట్టేసింది. రాజశేఖరం మంచం దగ్గరకు వెళ్ళి "నన్ను మీరు పిలిచేరా?" అని అడిగింది. అవునన్నట్లు తల ఊపేడతను.

"ఏం కావాలి?"

అతనేం మాట్లాడలేదు. అలాగే చూస్తున్నాడు

"ఏమిటలా చూస్తున్నారు? ఏమైనా బాధగా ఉందా?"

"ఊఁ హూఁ."

"మరేమిటి?"

"ఇలా కూర్చో" అతని మాట నూతిలోంచి వచ్చినట్లుగా ఉంది.

కాత్యాయని మంచంమీద కూర్చుంది.

రాజశేఖరం ముఖం మీద చిరు చెమటలు కమ్మి ఉన్నాయి.

కనురెప్పల అంచులు మెరుస్తున్నాయి.

"నాకెందుకో భయ-గా ఉంది" అన్నాడు.

"భయమా! భయం దేనికి?"

"నేనింక బ్రతకను."

కాత్యాయని ఉలిక్కిపడింది. ఆమె మనసు జాలితో బాధతో నిండిపోయింది.

"ఛ! ఏం ఫరవాలేదు. ఎందుకలా అనుకుంటున్నారు? కల వచ్చిందా?" ముఖం మీద చెమటను తుడిచింది

అతని కనుకొలకుల్లో నీళ్ళు నిలిచేయి.

"నాకు తెలుసు."

"ఏంతెలుసు మీకు! జ్వరం పూర్తిగా తగ్గిపోయింది. రేపో ఎల్లుండో పథ్యానికి వస్తుందని చెప్పేడు డాక్టరు"

"ఈ వేళ ఎన్నో రోజు?"

"ఇరవయ్యో రోజు. ఇంకో రెండు రోజుల్లో తగ్గిపోతుందని ..." ధైర్యం చెప్పబోయింది కాత్యాయని.

"నీకు తెలీదు ..." రాజశేఖరం కాత్యాయని చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు. "...ఇన్నాళ్ళు ఆశగా ఉంది కాని ఇప్పుడుపోయింది. దేవుడి దయ వల్ల ఇంకొక్క రోజు ఉన్నా చాలు. తెల్లవారగానే మన ఆఫీసుకు ఫోను చేసి

మన లాయరును ఒకసారి పిలిపించమను..."

"ఎందుకు?"

"విల్లు రాయించాలి. బ్రతకాలనే ఆశ ఉంది. బ్రతుకుతాననే నమ్మకం లేదు. అది రాయకుండా పోతే ఆత్మ శాంతి ఉండదు."

"ఏం మాటలండీ ఇవి! హాయిగా కళ్ళు మూసుకు పడుకోండి! మీకు జ్వరం తగ్గిపోయింది."

రాజశేఖరం కాత్యాయని చేతిని తన హృదయం మీదికి తీసుకున్నాడు. ఆమె చేతికి తీవ్రంగా కొట్టుకుంటున్న అతని గుండె చప్పుడు తెలుస్తూంది. కృశించి పోయిన అతని శరీరం మీద చేయి వేస్తే ఎముకలు తగులుతున్నాయి.

"నన్ను చెప్పనీ! మరి కొంత టైము పోతే ఈ శరీరంలో శ్వాస ఆగిపోతే నోట్లోంచి మాట రాదు. ఎందుకు మాట్లాడనియ్యలేదా అని అప్పుడు బాధ పడతావు."

"మీ మాటలతో ప్రాణాలు తీస్తున్నారు" అంది కాత్యాయని.

రాజశేఖరం మళ్ళీ మొదలుపెట్టేడు. అతనేదో ఆవేశంలో ఉన్నాడు. కొంత చెప్పనిచ్చినా ఉపశమనం కలుగుతుందేమోననే ఆశతో కాత్యాయని అడ్డు పెట్టలేదు.

"... నేను చేసుకున్న ఏనాటి పుణ్యమో నీ రూపం నా యింట్లో కాలు పెట్టింది. లేకుంటే నా కుటుంబం ఏమైపోయి ఉండేది? నా పిల్లలెలా ఉండేవారు? వాళ్ళూ నేనూ నీ ఋణం తీర్చుకోలేనిది... రేపు లాయర్ని సంప్రదించి ఆస్తిలో ఒక భాగం నీకు చెందేటట్లుగా..." కాత్యాయని వినలేకపోయింది.

"ఏమిటండి ఇదంతా? వయసు వచ్చిన కొలదీ పిల్లల బాధ్యతలు వాళ్ళకు మామూలుగానే తెలిసివస్తున్నాయి. ఇందులో ఎవరు చేసిందీ ఏమీ లేదు ... అయినా ఇప్పుడేమయిందని ... "

"...... నన్నిప్పుడు అడ్డుపెట్టక నా మనసులో ఉన్నదంతా చెప్పనీ! నీకు ఆస్తి నిచ్చేది నువ్వు నాకు చేసిన సేవకు కృతజ్ఞతగా కాదు. అంతా నీకిచ్చినా దానిని గడ్డి పరక కంటె తేలికగా విడిచి వేయగలవని నాకు తెలుసు... అయినా అందులో ఎప్పుడైనా ఒక్క పైసయినా నీ అవసరం తీర్చగలిగితే అదే నాకు ఆనందం! ... ఇప్పుడు రవి ఉంటే ఎంత బాగుండేది! వాడికి నువ్వంటే ఎంతో గౌరవం. ఒక్కసారి నీ విషయం వాడికి నా నోటితో చెప్పి ఉంటే...రవికి టెలిగ్రాం ఇస్తే రేపు సాయంత్రానికి రాలేడూ! ... అదృష్టవశాత్తూ అప్పటి వరకైనా ఉంటే..."

కాత్యాయని చేత్తో రాజశేఖరం నోరు మూసేసింది. ఏమయినా జ్వర లక్షణమేమోననుకుంటే ఒళ్ళంతా చల్లగా వుంది. "మీరు మరోటేదైనా మాట్లాడండి. ఈ మాటలు వినలేకుండా ఉన్నాను...విశ్రాంతి తీసుకోండి. మీకేం ఫరవా లేదు."

"కాని నా గుండె కొట్టుకుంటూంటే నాకే భయంగా ఉంది కాత్యాయనీ! ఎందుకో అది ఆగిపోయే టైము వచ్చినట్లనిపిస్తోంది. బహుశా ఇంకో లక్షసార్లు కొట్టుకుంటుందేమో! ... అంటే ఒక రోజా! రెండు రోజులా! ... నా మనసులో ఇప్పుడెన్ని కోరికలున్నాయో తెలుసా! ... కాత్యాయనికి కొంచెం భయం కలిగింది. కొంత మందికి చని

పోయే ముందు తెలుస్తుందంటారు. అటు వంటిది కాదు కదా! నిజంగా ఏమయినా జరిగితే!...ఆయన లేకుండా ఎలా?ఆమె ఆలోచనల్లో అతని మాటలు కొన్ని దొర్లిపోయాయి. కాత్యాయని అప్రయత్నంగా భగవంతుడిని ప్రార్థించింది. కాత్యాయనికి నాస్తిక భావం లేదు. కాని ప్రతి దానికీ దేవుడి మీద ఆశలు పెట్టుకోవడం అలవాటు లేదు. ఏదో పూజలూ పునస్కారాలూ అప్పుడప్పుడు నలుగురితో చెయ్యడం తప్ప మనస్ఫూర్తిగా ఎప్పుడూ దేవుణ్ణి ప్రార్థించలేకపోయింది. ఆ విషయాన్ని గురించి ఆమె కెన్నో సందేహాలున్నాయి. కాని ఆత్మ విశ్వాసం అప్పటివరకూ అవసరాల్ని గడిపేసింది. ఇప్పుడు మాత్రం ఎందుకో మనసంతా ఆ దేవుణ్ణి ఊహించడానికి తహ తహలాడుతోంది.

ఆయన్ను బ్రతికించమని దేవుణ్ణి అడగడం ఎలా? దానికేమిటి విధానం? పిచ్చిగా తన మనస్థైర్యాన్నంతటినీ కాత్యాయని దానికి ముడుపు పెట్టింది.

"మీకేమీ కాదు..."అప్రయత్నంగా ఆమె నోట్లోంచి వచ్చేయి మాటలు. అతనికి ఆమె చేతులు రెండూ పట్టుకుంటే మృత్యువులోకి జారిపోకుండా ఏదో ఆధారం దొరికినట్లు ఉపశమనం కలిగింది. క్రమంగా మనసులోని భయం కొంత తగ్గింది. ఆవేశం అణిగింది. మెల్లగా కళ్ళు మూతలుపడ్డాయి. తను కదిలితే లేస్తాడేమోననే భయంతో తలవైపు కమ్మికానుకొని అలాగే కూర్చుంది కాత్యాయని. ఎప్పుడు నిద్రపట్టిందో తెలీదు—

కాత్యాయని కళ్ళుతెరచి చూసేసరికి ఎదురుగా సుజాత నిలబడి వుంది. తల తిప్పి చూసింది. రాజశేఖరం నిద్రపోతున్నాడు. కాత్యాయని చేయి ఇంకా అతని హృదయంమీదే వుంది. మెల్లగా చేయి తీసుకొని లేచింది. సుజాతతో బయటికొచ్చింది.

"రాత్రి మీ నాన్నగారి ధోరణిచూస్తే భయంవేసింది. మాట్లాడిమాట్లాడి చివరకి అలసిపోయి నిద్రపోయేరు"

"ఇప్పుడెలా వుంది?" అంది సుజాత.

"జ్వరం లేదు".

"నీ కళ్ళుచూడు ఎలా వున్నాయో! నీకు నిద్ర చాలటంలేదు" అంది సుజాత కాత్యాయని కళ్ళల్లోకి చూసి.

నిజంగా కాత్యాయనికి ఒళ్ళంతా నెప్పులుగా తల బరువుగా వుంది. కనురెప్పలు మూసుకుంటే కారం చల్లినట్లు భగ్గున మండుతున్నాయి. చలిచలిగా వుంది. కాత్యాయని పైటకొంగు చెవుల మీదుగా వేసుకుంటూ "చలిగా వుంది కదూ!" అంది.

"లేదు. బహుశా నీకే జ్వరమైనా వచ్చిందేమో!" అని దగ్గరగావచ్చి వంటి మీద చెయ్యివేసి చూసింది సుజాత. "ఒళ్ళు కొంచెం వేడిగానే వుంది. ఈరోజు డాక్టరు వచ్చినప్పుడు నువ్వు కూడా మందు తీసుకో! నాన్నకు జ్వరంవస్తే ధైర్యం చెప్పేదానివి నువ్వున్నావు కాబట్టి సరిపోయింది. నీకు జ్వరంవస్తే నా పైప్రాణాలు పైనే పోతాయి.

కాత్యాయని పది నిమిషాలు విశ్రాంతి తీసుకొని లేద్దామని మంచంమీద ఒరిగింది.

ఆ పడకపడక పదకొండు గంటలకు డాకరు వచేవరకూ ఒళె రకుండా



నిద్రపోతూనే వుంది.

డాక్టరు వచ్చేడని సుజాత లేపబోతే కళ్ళు సరిగా తెరువబడలేదు. గునపంతో పొడిచినట్లు తల పోటు. మెడ వెనుక నరాలన్నీ బిగిసిపోయాయి. సరిగా లేచి నిలబడలేకపోయింది. టెంపరేచర్ చూస్తే నూట మూడు వుంది.

డాక్టరు విశ్రాంతి తీసుకోమని ఇంజక్షను ఇచ్చి వెళ్ళాడు. రాజశేఖరానికి ఆరోజు సగ్గుజావ ఇయ్యమన్నాడు.

సుజాత కాలేజీకి వెళ్ళకుండా ఇంట్లోనే ఉండిపోయింది. కాత్యాయనికి మధ్యాహ్నం మూడు గంటలకు కాస్త ఒళ్ళు తెలిసింది. మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ రాజశేఖరం గదిలోకి వెళ్ళింది.

"చూసేరా రాత్రి జ్వరం తగ్గిపోయిందంటే విన్నారుకాదు!"

"అవును. ఏమిటో అప్పుడదోలా అనిపించింది".

"ఇప్పుడెలా వుంది".

"బాగానే వుంది".

"రవికి ఉత్తరం రాస్తే ఓసారి చూసి వెడతాడు. టెలిగ్రాం ఇస్తే ఖంగారు పడతాడు. ఏమంటారు?" అంది కాత్యాయని.

"సరే" అన్నాడతను.

సుజాతతో రవికి ఉత్తరం రాయమంది.

కాత్యాయనికి ఫ్లూ జ్వరం వచ్చింది. మూడురోజులకు తగ్గింది. జ్వరం మూడు

రోజులయినా నీరసం వారం రోజులకు గాని తగ్గలేదు.

రాజశేఖరానికి మరో జన్మ ఎత్తినట్లని పించింది

రవి ప్రమీలతో వచ్చేడు. తండ్రినీ, కాత్యాయనినీ చూసి ఆశ్చర్యపోయేడు. ముఖ్యంగా అస్థిపంజరంలా వున్న తండ్రినిచూస్తే నోటమాట రాలేదు.

''కాత్యాయని లేకపోతే ఈ రోజిలా ఉండేవాణ్ణి కాదు'' అన్నాడు రాజశేఖరం రవితో. మొదటిసారిగా అందరినీ వదలి వెళ్ళడంతో రవికి తనవాళ్ళ విలువలు తెలిసి వచ్చేయి. ఉన్నన్ని రోజులూ ఎంతో ఆప్యాయంగా వున్నాడు.

అందరూ ఇంట్లో ఆత్మీయతతో తిరుగుతూంటే రాజశేఖరం మనసులో కొత్త ఆనందం నిండింది.



## 12

రాజశేఖరం పూర్తిగా కొలుకొనే సరికి రెండునెలలు పట్టింది.

కన్ను తెరచినప్పటి నుంచి రాత్రి కన్నుమూసే వరకూ క్షణానికోసారి ఏవో పరిచర్యలు చేస్తూ కంటిముందు కనబడే కాత్యాయనిని కన్నుమూసినా దూరం చేయలేకపోతున్నాడురాజశేఖరం. ఇంట్లో పిల్లలతో ఆమె చూపే ఓర్పు, నేర్పు రోజుకు రోజు అతనికి ఆమె మీద అభిమానాన్ని,గౌరవాన్ని పెంచేయి. ఎన్నడైనా ఆమె తన యింట్లోంచి బయటకు వెళ్ళినట్లుగా ఊహించుకోడానికే భయం కలుగుతోంది.

కాత్యాయని రోజూ పేపరు చూస్తూ కనబడిన ఉద్యోగాని కల్లా అప్లికేషను పంపిస్తూనే ఉంది. ఒకటి రెండు ఇంట ర్వ్యూలు కూడా వచ్చేయి. కాని దూర మని ఒకటీ, భారమని మరొకటీ రాజ శేఖరం నిరుత్సాహపరచేడు. చివరకు హైదరాబాదులోని ఓ పేరు పొందిన ఎరువుల మాన్యుఫాక్చరింగ్ కంపెనీలో స్టెనోగ్రాఫరు ఉద్యోగానికి ఇంటర్వ్యూ వచ్చింది. ఈసారి ఆమెను నిరుత్సాహ పరచడానికిరాజశేఖరంచేసిన ప్రయత్నం ఫలించలేదు. ఉద్యోగం వచ్చినప్పుడు చూద్దాంలే అని సరిపెట్టుకున్నాడు.

కాత్యాయనికి ఇంటర్వ్యూకివెళ్ళడానికి తోడుగా కూడా ఉన్నట్లుంటుందని హైదరాబాదులో తన వ్యాపార విష యాన్ని పురస్కరించుకొని ఆ తేదీకే తాను హైదరాబాదు ప్రయాణం పెట్టు కున్నాడు రాజశేఖరం.

హైదరాబాదులో స్టేషనుకు దగ్గరగా ఉన్న హోటల్లో దిగేరు.

ఇంటర్వ్యూ టైముకు రాజశేఖరం కాత్యాయనిని కంపెనీ ఆఫీసు దగ్గర దిగ బెట్టి తన పనులు చూసుకొనేందుకు వెళ్ళి పోయాడు.

కంపెనీలో ముందు టైపురైటింగు లోనూ, షార్టుహేండులోనూ అందరి దగ్గరా పరీక్ష తీసుకున్నారు. రెండింటి లోనూ బాగానే చేసే ననుకుంది కాత్యా యని. మరో అరగంటకు ఇంటర్వ్యూలు మొదలయ్యేయి.

అప్పటి వరకూ బాగానే ఉన్నా,ఇంట

ర్వ్యూ దగ్గర కొచ్చేసరికి కొంచెం ఆందో ళన కలిగింది కాత్యాయనికి. ఇంటర్వ్యూ చేస్తూన్న గదిలో అడుగు పెట్టేసరికి కొంచెం వణుకు పుట్టింది. అందులోనూ అది ఎయిర్ కండిషన్డు కావడంవలన మరింత చల్లగా ఉంది. కాత్యాయని కూర్చోగానే అక్కడ ముగ్గురిలో ఒకా యన ఆమె చదివిన సబ్జెక్ట్సులో ప్రశ్నలు వేశాడు. ఆ తర్వాత రెండో ఆయన మొదలు పెట్టేడు.

హైదరాబాదులో ఎక్కడ ఉండేదీ, ఏ బండిలో వచ్చిందీ వగైరా వగైరాలు...

"మీకు ఇరవై ఎనిమిది నడుస్తూంది కదూ!" అన్నాడు ఆమె అప్లికేషను చూస్తూ.

"అవును"

"ఇదివరకెక్కడా పని చేయలేదా ?"

"లేదు."

"ఎందుకని ?"

"అప్పటికి నాకు సరైన క్వాలి ఫికేషన్సులేవు."

"ఎందుకు సంపాదించలేదు ?"

"అశ్రద్ధ చేశాను."

"మరి సడెన్‌గా మీకు ఉద్యోగం చెయ్యాలనేఉద్దేశం ఎందుకు కలిగింది.?"

"కుటుంబ పరిస్థితులను బట్టి."

"మీకు పెళ్ళయిందా ?"

కాత్యాయని ఒక్క క్షణం సందే హించింది. బహుశా తన పరిస్థితిలో ఉన్న స్త్రీని సూచించడానికి తగిన చిన్న మాట ఏదీ లేదేమో! పైటలోంచి మంగళసూత్రం అస్పష్టంగా కనబడు తూంది.

"అయింది."

"పిల్లలు ?"

"లేరు."

"మీ భర్త ఏం చేస్తూంటారు ?"

కాత్యాయని బరువుగా ఊపిరిపీల్చింది "మేమిద్దరం కలసి ఉండటంలేదు."

ఓసారి ముగ్గురూ ఒకళ్ళముఖా లొకరు చూసుకున్నారు. ప్రశ్నలు వేసే ఆయన మరింత ఉత్సాహంగా అడగడం మొదలు పెట్టేడు.

"విడాకులు తీసుకున్నారా ?"

"లేదు."

అయితే ఇప్పుడు మీ పేరెంట్స్‌తో ఉంటున్నారా?"

"లేదు"

"మరి...?"

కాత్యాయనికి ఈ ప్రశ్నలకు జవాబు చెప్పడం చికాకనిపిస్తూంది. రాజశేఖరం గారితో ఉంటున్నానంటే ఆయనెవరంటా రేమో!

"వీటన్నిటికీ జవాబులు మీకు అవ వసరమా ?" జవాబు చెప్పలేక అడిగింది కాత్యాయని.

"మీకిష్టం లేదా ? దెన్ ఐయామ్ సారీ!" అని ఆయన ఓ నవ్వు నవ్వి ఊరుకున్నాడు.

ఓ క్షణం నిశ్శబ్దం తర్వాత ఇక మీరు వెళ్ళొచ్చు. అన్నారు.

"ఉద్యోగం వచ్చేదీలేనిదీ ఎన్నాళ్ళల్లో తెలుస్తుంది" కాత్యాయని అడిగింది.

"ఓ అరగంట బయట వెయిట్ చెయ్యండి, చెప్తాము" అన్నారు.

కాత్యాయని బయటకువచ్చి కూర్చుంది ఎందుకో తాను తప్పకుండా సెలెక్టవు తుందనిపించింది. అరగంటసేపూ ఏవో గాలి మేడల్లో విహరిస్తూ గడిపేసింది.

తర్వాత ఒకతను బయటకువచ్చి

సెలెక్టుకాని వాళ్ళ పేర్లు చదివేడు. అందులో కాత్యాయని పేరు కూడా ఉంది.

కాత్యాయని చాలా నిరుత్సాహపడింది అయితేవాళ్ళు ఇంటర్వ్యూలో అడిగిన ప్రశ్నలకూ, ఉద్యోగానికి సంబంధం ఏమిటి ?

కాత్యాయని ఇంటర్వ్యూ చేసిన రూమ్ లోకి మళ్ళీ వెళ్ళింది. ముగ్గురూ ఆమె వైపు ప్రశ్నార్థకంగా చూశారు.

"ఈ ఉద్యోగంలో చేయవలసిన పని స్టెనోగ్రఫీయేనా?"

"అవును"

"అయితే నేనెందుకు సెలెక్టుకాలేదో తెలుసుకోవచ్చునా?"

"మీ పెర్ఫార్మెన్సు బాగులేదు"

"ఎందులో?"

"స్టెనోగ్రఫీలో"

"అయితే ఇంటర్వ్యూ ఎందుకు చేసినట్లు?"

ప్రశ్నలడిగిన ఆయన తెల్లబోయాడు.

"అవన్నీ మీరు అడగవలసిన ప్రశ్నలు కాదు" అన్నాడు.

"ఉద్యోగం కోసం మీముందు కొచ్చామని, సెలెక్టు కానని ముందు తెలిసి కూడా అడ్డమైన ప్రశ్నలూ వెయ్యడం మీకు కూడా అనవసరమనుకుంటాను"

"అయితే మిమ్మల్ని అనవసరమైన ప్రశ్నలు వెయ్యడం తప్ప మాకు పనేం లేదను కుంటున్నారా ?"

"దానికి జవాబు నాకంటే మీకే బాగా తెలిసుండాలి! కాత్యాయని విసవిసా బయటకు నడిచి వచ్చేసింది. హోటల్‌కు వెళ్ళగానే హోటల్ కుర్రవాడు ఒక టెలిఫోన్ నెంబరిచ్చి రాజశేఖరం గారు ఆ నెంబరుకు టెలిఫోన్ చెయ్యమన్నారని చెప్పేడు. కాత్యాయని వెంటనే ఫోన్ చేసి తాను సెలెక్టు కాలేదని చెప్పింది. వద్దంటూంటె అనవసరంగా ఉద్యోగం అంటూ వచ్చావనీ, సెలెక్టు కాలేదని బాధపడవద్దనీ రాజశేఖరం అన్నాడు. తానో స్నేహితుడి బలవంతం మీద ఓ పార్టీకి వెళ్ళవలసి ఉందనీ, రాత్రి పది గంటలకు వస్తాననీ చెప్పేడు. కాత్యాయని ఫోను పెట్టేసి పడుకుంది. రాత్రి ప్రయాణంలో సరిగా నిద్రలేకపోవడం వలన వెంటనే నిద్రపట్టేసింది. టెలిఫోను చప్పుడుకు తిరిగి మెలకువ వచ్చింది. రాజశేఖరమే అయి ఉంటాడని టెలిఫోను తీసుకుంది. ఆమె ఆశ్చర్యానికి అంతు లేదు. ఆమె ఇంటర్వ్యూకి వెళ్ళిన కంపెనీ నుంచి వచ్చింది టెలిఫోను. ఆమెను ఉద్యోగంలో సెలెక్టు చేశారనీ, వీలయినంత త్వరగా చేరాలనీ చెప్పేరు. అపాయింటుమెంటు ఆర్డరు ఆమె ఎడ్రసుకు పంపిస్తూన్నట్లు కూడా చెప్పేరు.

కాత్యాయని సంతోషానికి మేరలేదు. రాజశేఖరానికి టెలిఫోను చేసి చెప్దామా అనిపించింది. మళ్ళీ వచ్చేక చెప్పొచ్చులే అని ఊరుకుంది.

గదిలోంచి బాల్కనీలోకీ, బాల్కనీ లోంచి గదిలోకీ పచార్లు చేసింది. కింది కెళ్ళి ఏవో పత్రికలు కొనుక్కొచ్చి అవి చదువుకుంటూ కూర్చుంది.

రాత్రి పదిన్నరకు తలుపు చప్పుడయితే ఉలిక్కిపడి లేచి తలుపు తీసింది కాత్యాయని.

తలుపును పట్టుకొని వ్రేలాడుతున్నట్లుగా నిలబడ్డాడు రాజశేఖరం. కాత్యా

యని ఒక్క ఉదుటునపోయి పట్టుకుంది. అతని దగ్గర భరించరాని వాసన గుప్పున కొట్టింది.

ఓ చేయి భుజం మీదకు తీసుకుని మెల్లగా మంచం దగ్గరకు తీసుకొని వెళ్ళింది. అప్పుడప్పుడే కోలుకొంటూన్న అతని ఆరోగ్యానికి ఏమి భంగం కలుగుతుందోనని భయపడింది కాత్యాయని.

మంచం మీద పడుకొని బరువైన కళ్ళతో ఆమె వైపే చూస్తున్నాడు రాజశేఖరం. ఓ కుర్చీ లాక్కొని మంచం దగ్గరగా కూర్చుంది కాత్యాయని. అతను తనలో తానే మాట్లాడుకుంటూన్నట్టుగా ఏవో మాటలు మొదలు పెట్టేడు. ఎప్పుడూ ఎక్కువగా మాట్లాడని అతని మాటలు అసందర్భంగా ఉండడం చేత బాధ కలిగిస్తున్నాయి.

ఉన్నట్లుండి దగ్గు తెరవచ్చింది రాజశేఖరానికి వాంతి అయేటట్లు కనబడితే చేయి పట్టుకొని బాత్‌రూమ్ వైపు నడిపించింది. అతను భళ్ళున వాంతి చేసుకున్నాడు. కాత్యాయని వాసన భరించలేకపోయింది. అతన్ని మళ్ళీ మంచం దగ్గరకు తీసుకొచ్చి బాత్‌రూమ్‌లో నీళ్ళు కొట్టి తలుపు మూసి వచ్చింది. రాజశేఖరం కళ్ళు ఎర్రగా జ్యోతుల్లా ఉన్నాయి. అతనింకా మాట్లాడుతూనే ఉన్నాడు.

''నా మాట వింటారా?'' కాత్యాయని అంది.

''ఏమిటది? నీ మాట ఎప్పుడు కాదన్నాను'' అన్నాడు రాజశేఖరం.

''మాట్లాడకుండా కళ్ళు మూసుకొని నిద్రపోండి'' ఆమె వెళ్ళి తన మంచం మీద పడుకుంది.

కాత్యాయని రెండో వైపు తిరిగింది. అప్రయత్నంగా కళ్ళల్లోంచి కన్నీళ్ళు జారిపోయాయి. కారణం స్పష్టంగాస్ఫురించలేదు. మనసంతా – ఏ ఆలోచనా నిలకడగా లేక అలసిపోయి నట్లుంది. రాజశేఖరం గొణుగుతూన్నది వినకుండా ఉండడానికి బలవంతాన ఉద్యోగం రాగానే ఏయే వస్తువులను కొనుక్కోవాలో ఆలోచించడం మొదలు పెట్టింది. కొంత సేపటికి మెల్లగా కళ్ళు మూతలు పడ్డాయి. కాత్యాయని ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది. మీద దగ్గరగా వాలి ఉన్న రాజశేఖరాన్ని చూసి హడలిపోయింది. ఒక్కసారి లేవబోయింది. కాని సాధ్యం కాలేదు.

"నన్ను వదలండి ! లేవనివ్వండి!" దీనంగా అరిచింది.

"ప్లీజ్! కాత్యాయనీ!"

"మీకిది న్యాయం కాదు."

"కాత్యాయనీ!"

కాత్యాయనికి గొంతు పెగిలి మాట రాలేదు. పెనుగులాడింది. రాజశేఖరాన్ని తప్పించుకోలేక పోయింది. అప్రయత్నంగా కెవ్వున కేక పెట్టి శక్తినంతా పుంజుకొని లేచింది.

కాత్యాయని కేక విని చుట్టు పక్కల వాళ్లు ఇద్దరు ముగ్గురు కిటికీ దగ్గరకొచ్చి నిలబడ్డారు. ఎవరో తలుపు కొడుతున్నారు. రాజశేఖరం అప్రతిభుడై నిలబడ్డాడు.

కాబోయే అల్లరిని తలుచుకుంటే వణుకు పుట్టింది కాత్యాయనికి. తన కళ్ళ ముందు రాజశేఖరానికి అవమానం జరగడం సహించలేనిది. మరుక్షణంలో తాను బ్రతకలేదు. క్షణం ఆలస్యం చేయడానికి వీలులేదు. డాక్టరు ఆయనను తాగ వద్దన్నారనీ, ఆ మాట మీద ఘర్షణ

జరిగిందనీ వచ్చిన వాళ్ళకు నచ్చ చెప్పే సరికి కాత్యాయని తల ప్రాణం తోక కొచ్చింది. వాళ్ళకు నమ్మకం కలగాలన్న ఆత్రుతలో తాము భార్యా భర్తలమని అప్రయత్నంగా అబద్ధమాడింది. మెల్లగా వచ్చిన వాళ్ళు వెళ్ళిపోయారు.

కాత్యాయని రాజశేఖరం దగ్గరకొచ్చి తల వంచుకొని అంది "క్షమించండి. మిమ్మల్ని నలుగురిలో అల్లరి చేయాలని నేనేమీ చెయ్యలేదు. అన్నీ అనుకోకుండా జరిగి పోయాయి" రాజశేఖరం మాట్లాడలేదు. మెల్లగా వెళ్ళి తన మంచం మీద ఒరిగేడు. బరువుగా కళ్ళు మూసుకున్నాడు. కాత్యాయని తన మంచం మీద వాలిపోయింది. గుండెదడ ఇంకా తగ్గలేదు.

మరో అయిదు నిమిషాల తర్వాత రాజశేఖరం తలుపు వైపు వెళ్ళడం చూసింది.

"ఎక్కడికి?" ఆమె లేచి కూర్చుంది.

"వేరే గది తీసుకుంటాను"

"వద్దు. ఎక్కడికీ వెళ్ళొద్దు"

"అది కాదు కాత్యాయనీ!"

"వద్దు రండి! మీ మనసు నాకు తెలుసు. ప్లీజ్! వెడితే నా మీద ఒట్టే!" అతన్ని తీసుకొచ్చి మంచంమీద కూర్చోపెట్టింది

తెల్లారి కాత్యాయని లేచేసరికి రాజశేఖరం ఇంకా లేవలేదు. ఆమె స్నానం చేసి వచ్చేసరికి రాజశేఖరం బోర్లా పడుకొని కళ్ళు తెరిచి నేలవైపు చూస్తున్నాడు.

"లేవండి" అంది కాత్యాయని ముందుకు వచ్చి.

రాజశేఖరం కళ్ళెత్తి ఆమె వైపు చూశాడు. అతను సరిగా నిద్రపోయినట్లు లేదు.

"రాత్రి సరిగా నిద్ర పోలేదా? కళ్ళెలా ఉన్నాయో చూడండి!" అంది కాత్యాయని.

"జరిగిన దానికి చాలా సిగ్గుపడుతున్నాను" అన్నాడతను.

"మీరన్నీ మనసులో పెట్టుకోకండి! ఏమీ జరగలేదు. అయినా అంత ఒళ్ళు తెలీకుండా తాగు తారా ఎవరయినా! ఇంకా నయం! రూమ్‌కు సరిగా వచ్చారు"

"అసలు విషయం మీతో చెప్పడం మరచి పోయాను. నన్ను ఉద్యోగానికి సెలెక్టు చేసుకున్నారు."

రాజశేఖరం ఉలిక్కి పడ్డాడు. "నిన్న కాలేదన్నావు!"

"అవును. ఇంటర్వ్యూ కాగానే నన్ను సెలక్టు చేసుకోలేదనే చెప్పేరు. కాని ఎందుకో సాయంత్రం మళ్ళీ హోటల్‌కు టెలిఫోన్ చేసి చెప్పేరు"

"లేవండి. చాలా టైమయింది. నాకు ఆకలిగా ఉంది" అని ట్రూత్‌బ్రష్ తీసుకొచ్చి రాజశేఖరం చేతిలో పెట్టింది



# 13

అందమైన ఒక పెద్ద ఉద్యాన వనం.

అందులో పూర్తిగా తామర పూవులతో, తామరాకులతో కప్పబడిన ఒక కోనేరు. కోనేటి ఒడ్డున రాజశేఖరం పిలలంగగా ...

కోనేటిలో ఒక పడవ. పడవలో కాత్యాయని. పిల్లలందరూ దగ్గరకొచ్చి ఆప్యాయత ఉట్టిపడుతూ ఆమె వైపు చూస్తున్నారు. పడవ మెల్లగా కోనేటిలోకి కదిలింది. పిల్లలు నవ్వుతూ చేతులూపుతున్నారు. కాత్యాయని పిల్లలు కనబడేంత మేరకు రెప్ప వాల్చకుండా చూసింది. తరువాత పడవ నడుస్తూంటే తొలగిన తామరాకుల మధ్య ఏర్పడిన పాయలోకి చూసింది. పడవ కొమ్ము పట్టుకొని నీళ్ళలో వస్తూన్న రాజశేఖరం రెప్ప వాల్చకుండా పిచ్చిగా కాత్యాయని వైపు చూస్తున్నాడు.... కాత్యాయని గుండె ఎగిసి పోయింది. కెవ్వున కేక పెట్టింది.

కాత్యాయని కళ్ళు నులుముకొని చూసింది. కల కరిగి పోయింది. కాని ఇన్నాళ్ళూ ఆమె ఇదమిత్థంగా గుర్తించని ఒక నిగూఢమైన భావం కలలోని తన రూపంలో గోచరించింది. రాజశేఖరాన్ని వెంటనే చూడాలని పించింది. మనస్సు ఆందోళనగా ఉంది. మంచం మీద పడుకొని ఉండలేక లేచింది.

టైమెంతయిందో తెలీదు తెరచి ఉన్న కిటికీలోంచి పాల నురుగులాంటి వెన్నెల లోపలకు వస్తూంది. కాత్యాయని కిటికీ దగ్గరకొచ్చి తోటలోకి చూసింది. అదే తన కలలోని తోటగా గుర్తుపట్టింది.

నైట్‌క్వీన్ తావులు ముక్కు పుటాల్లోకి దూరి మనసుకు మత్తెక్కిస్తున్నాయి. కాత్యాయని తోటలోకి నడిచింది.

గడచిన నాలుగు సంవత్సరాల కాలం మనసులో మెదిలింది. యాదృచ్ఛికంగా జరిగిన సన్నివేశాలు జీవితంలో ఎంత ప్రాముఖ్యం వహిస్తున్నాయో తలుచుకుంటే ఆశ్చర్యం కలిగింది. తాను ఈ యింటికి రావడం, అందరి ఆదరణా తనకు దొరకడం, భవిష్యత్తుకాక జీవనాధారం లభ్యం కావడం... ఇందులో తాను ఏదీ ముందు ఊహించలేదు. కొద్ది రోజుల్లో అందరినీ వదిలి ఏకాంతంగా ఉండాలి. మనసులో దిగులనిపించింది.

కాత్యాయని మనసులో ఒక పరిశోధన మొదలయింది. ఈ పరిసరాలు విడిచి పోవాలంటే తన కెందు కింత దిగులు! వీళ్ళందరూ తనకేమవుతారు! తనకు తెలీకుండానే రాజశేఖరాన్ని గెలుచుకోవాలని ప్రయత్నించిందా ?— గెలుచుకోవడం మాట ఏమోకాని ఒక విధంగా తాను ఓడిపోయిన మాట మాత్రం నిజం ! ఆయన ఆరోగ్యంగా ఉల్లాసంగా వుంటే తన కేదో వుల్లాసం ! మనసుకు శాంతి, ధైర్యం! బాధపడుతున్నారంటే దిగులు! ఆయన సాయంత్రం ఇంటి కొచ్చేవరకూ మనసులో ఆరాటం! బహుశా తల్లి మనసులో ఆలోచన తనకు తెలిసినప్పటినుంచే తనలో ఈ భావం మొదలయిందేమో!

కాని తాను ఇక్కడ వుండటానికి వీల్లేదు. ఆ ఉద్దేశంతో తానీ యింటిలో కాలుపెట్టలేదు. ఈ స్వార్థపూరితమైన ఆలోచన మనసులోనికి రానియ్యకూడదు.

కాత్యాయని చుట్టూ చూసింది. ప్రకృతిలో కూడ మనిషి మనసును బలహీన పరచే కొంటెతనం ; మనిషిలోని వివేకానికి ముసుగు కప్పుతూ మత్తుకలిగిస్తూంది. ఎంత ప్రయత్నించినా రాజశేఖరం ఆమె మనసులోంచి కదలటం లేదు.

అతని ఆలోచన రాగానే ఆమె మనసులో ఉద్వేగం కలుగుతూంది. ఏవేవో సేవలు చేయాలనిపిస్తుంది. ఎప్పుడూ అతని సమక్షంలో వుండగలిగితే! అతని పాదాలవద్ద కూర్చొని ఒడిలో తల దాచుకోగలిగితే! ... కాత్యాయనికి తనంటే తనకే జుగుప్స కలిగించి. తానీ బలహీనతకు లొంగడానికి వీల్లేదు. వెంటనే బయలుదేరి గదిలోకి వచ్చింది.

గదిలో రాజశేఖరాన్ని చూసి ఆశ్చర్యపోయింది. తన మంచానికి దూరంగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు. ఆమె వైపు చూసి చిన్నగా నవ్వేడు.

''ఇంత రాత్రి ఎక్కడికి కెళ్ళేవ్ ?''

''నిద్రలో మెలకువ వచ్చింది. మళ్ళీ నిద్రపట్టలేదు. బయట చల్లగా ఉందని ఓసారి అలా వెళ్ళివచ్చేను.''

''టైమెంతయిందో తెలుసా ?''

''ఎంతయింది ?''

''ఒంటిగంట!'' అని ''కొంచెంసేపు కూర్చోవచ్చునా ?'' అని అడిగేడు రాజశేఖరం.

''కూర్చోండి. దానికేం !''

''నాకూ నిద్రపట్టలేదు. ఇటు చూస్తే నీ గదిలో లైటు వెలుగుతూంది. తీరా వస్తే నువ్వు గదిలో లేవు. తోచక ఇక్కడే కూర్చున్నాను.''

''నేను తోటలోకి వెళ్ళేను.''

ఇద్దరూ ఒక్క క్షణం ఒకరివైపు ఒకరు చూసుకున్నారు. కొన్ని భావాలు ప్రసారమయ్యాయి. కాత్యాయని చూపు కిందికి దించింది.

''నీతో ఒక విషయం మాట్లాడాలనుకున్నాను'' రాజశేఖరం అన్నాడు.

''ఏమిటది ?'' తలెత్తకుండానే అడిగింది కాత్యాయని.

''ఈపాటికి నేను చెప్పదలచుకున్నది నువ్వు గ్రహించే వుంటావు.'' కాత్యాయని నవ్వింది. ''మీరు చెప్పందే నాకెలా తెలుస్తుంది !'' ''చెప్పేముందు నిన్ను గురించి కొన్ని వివరాలు తెలుసుకోవాలనుంది.''

''నన్ను గురించా !''

''అవును.''

''ఏం వివరాలు ?'' తనలాంటి పరిస్థితిలోనే రాజశేఖరం కూడా ఇరుక్కున్నాడేమోనని భయపడింది కాత్యాయని.

''మా యింటికి రాకముందు నిన్ను గురించి తెలుసుకోవాలని.''

''ఆరాత్రి మా అమ్మ చెప్పిందిగా!''

రాజశేఖరం ఆశ్చర్యపోయేడు. ''అయితే మీ అమ్మ నీతో ఆలోచించే నాకు చెప్పిందా ?''

''లేదు. నేను లేననుకునే చెప్పింది. కాని నేను పక్కగదిలో వుండి అన్నీ విన్నాను.''

''నీలాంటి మనిషి గురించి మీ అమ్మ చెప్పినా అది ఆవిడ అభిప్రాయమే అవుతుంది....''

''మా అమ్మ ఏదో సందర్భంలో మీరు ఆవిడకు చిన్నతనంనుంచీ తెలుసునని చెప్పింది. మా అమ్మ మీకు ఎంత సన్నిహితంగా తెలిసినా ఆవిడలో కొంత స్వభావం మీకు తెలియక పోవడానికి అవకాశం ఉంది. అంటే మీ చిన్నతనంలోని పరిచయాన్నిబట్టి గాని, లేదా చుట్టపు చూపుగా ఆవిడ ఎప్పుడైనా మీ యింటికి వచ్చినప్పుడుగాని మీరు ఆవిడపై ఏర్పరచుకున్న అభిప్రాయం ఆమెకు పూర్తిగా వర్తించదు

మా నాన్నతో మీకు ముఖపరిచయం కంటె ఎక్కువ లేదనుకుంటాను. అంత కంటె మించి ఏమయినా ఎక్కువ తెలిసినా మా అమ్మ మాటలద్వారా తెలిసి ఉండాలి. నాకు పద్దెనిమిదేళ్ళు వచ్చేసరికి ఆయన పోయేరు. అప్పటివరకూ ఆయన్ని గురించి నేనెక్కువ పరిశీలనగా ఏమీ చూడలేదు. కాని ఆయన పోయిన తరువాత మాత్రం ప్రతి సందర్భంలోనూ ఆయన గుర్తుకొచ్చేవారు. ఆయన మాటలు ఆయన అలవాట్లు గుర్తుకొచ్చేవి. ఆయనను గురించి గంటల తరబడి ఆలోచిస్తూ పోయిన తరువాతనే ఆయన్ను పూర్తిగా అర్థంచేసుకున్నాను.''

ఆయన అసలు చదువుకో లేదు. వ్యవసాయం చేసుకునేవారు. అమ్మ చిన్నతనంలో బస్తీలో ఉండేదట. మూడవ ఫారం వరకూ చదుకొని మాని వేసిందట! ఆ విషయం మీకు బాగా తెలిసి ఉంటుంది. ఆవిడకు ఎందుకు ఏర్పడిందో తెలీదుకాని, నాన్నకు ఏమీ తెలీదనే అభిప్రాయం ఉండేది. ఆయన ఏ పని చేయదలచుకున్నా అమ్మకు అందులో ఏదో లోపం కనబడేది. తన వ్యతిరేక భావాన్ని పదేపదే బయటకు చెప్పి ఎదుటివాళ్ళ మనసును నొప్పించ లేరు నాన్న. ఆయన ఆ మంచి తనాన్ని అమ్మ లోకువగా తీసుకుంది. నాన్న మనసులోని మాటపైకి ఎక్కువగా చెప్పక పోయినా అతి సున్నితమైన మనస్తత్వం కలవారు. ఆయనకు నిత్య జీవితంలో ఎన్నో విషయాలక్షైన నిశ్చితమైన అభిప్రాయాలు ఉండేవి. ఆయన అభిప్రాయాలలోని వివేకం అమ్మ చూడలేక పోయింది. తనపట్ల ఆయన మనసులో ఉన్న అమితమైన అనురాగాన్ని అర్థం చేసుకోలేక పోయింది. ప్రొద్దున్న నుంచి సాయంత్రం వరకు ఆయనను ఏదో రకంగా ఎదుర్కొంటూనే ఉండేది. అమ్మ యొక్క ఈ పద్ధతి వారిద్దరికీ పరస్పరమైన విషయాల్లో ఎటువంటి సంఘర్షణలను సృష్టించేదో తెలీదు. కాని ఒక్క విషయంలో మాత్రం అది చెరిగి పోకుండా నిలచి పోయింది. అది పిల్లల పెంపకం విషయంలో.

నాన్న దృష్టిలో చిన్న తనంలో పిల్లలు చాలా నిరాడంబరంగా పెరగాలి. చిన్నతనం నుంచీ వాళ్ళ మనస్సు ఒక క్రమశిక్షణలో పెరగాలి. దురదృష్టవశాత్తు వాళ్ళు ముందు జీవితంలో ఆర్థికంగా విజయం సాధించలేక పోయినా వాళ్ళు నిరాడంబరమైన జీవితానికి ఎక్కువ బాధ పడకుండా మలచుకో గలగాలి. వాళ్లకి జీవితం విలువా, మనిషి విలువా పూర్తిగా తెలిసేలా చెయ్యడానికి వాళ్ళకు ఆర్థిక పరిస్థితులను బట్టి అవసరం లేకపోయినా పరిశ్రమ కోసం కొంత వరకూ కష్టం తెలిసేలా చేయాలి. కాని అమ్మదృష్టి వేరు. ఆయన ఆలోచనల్లోని ఔన్నత్యం ఒక్కనాటికీ అర్థం చేసుకోలేదు. నాన్న పద్ధతులు ఆవిడ దృష్టిలో పల్లెటూరి పద్ధతులు. మనుష్యులు పెద్దయిన తరువాత, సంసారాలు పెద్దవయిన తరువాత వాళ్ళకు వాళ్ళు ఎలాగు కష్టపడక తప్పదు అప్పుడు బ్రతికే తెలివి తేటలు, వాళ్లకు పరిస్థితులే నేర్పుతాయి. పిల్లలకే శ్రమా కలుగ కూడదు. వాళ్ళ ముద్దు ముచ్చటా అన్నీ తీర్చాలి. అదీకాక నాన్న ఒక రకంగా ఆలోచిస్తారు కనుక దానికి వ్యతి

రేకంగా పోయి విజయం సాధించాలని కూడా ఆవిడ కొంత వరకూ అలా అనుకొనేదేమోనని నా అనుమానం. నాన్నకు పిల్లల పట్ల మనస్సులో ఉన్న గాఢమైన ప్రేమను ఆవిడ గుర్తించలేక పోయింది

ఫలితంగా అన్నయ్యల నిద్దరినీ తనకు చాలా సన్నిహితం చేసుకోవడంలో నాన్నకు దూరంచేసింది. ఆయన నీడను వాళ్ళిద్దరి మీద పడనిచ్చేదే కాదు. తనకు తానే అన్నయ్య లిద్దరినీ చెరొక దిక్కూ నిలబెట్టి ప్రపంచం అంతా పరిపాలించేలా చేయాలనుకుంది. కొడుకులపై నాన్న కున్న సహజమైన అభిమానాన్ని కూడా వ్యక్త పరచుకోలేని పరిస్థితి ఏర్పడింది. అన్నిటికంటె నాన్నను ఎక్కువగా కృంగదీసింది అదే.

ఆ వాతావరణంలో నేను పుట్టేను. అమ్మకు ఎందుకో అన్నయ్యలపై ఉన్నంత మోజు నా మీద కలగలేదు. ఆ కారణంగా నేను నాన్నకు ఎక్కువ సన్నిహితంగా జరిగేను. అయినా క్రమశిక్షణ లేని అమ్మ పద్ధతులు నాలో ఎన్నో లోపాలను సృష్టించాయి. చదువుకోవలసిన సమయంలో, ఏదైనా పని చేయవలసిన సమయంలో అమ్మ వైపు చేరి దాన్ని తప్పించుకోడానికి ప్రయత్నించేదాన్ని. అయినా ఎందుకో నేను మానసికంగా నాన్నకే ఎక్కువ చెందేను. ఇంట్లో ఉన్న ఈ రెండు వ్యక్తిత్వాల సంఘర్షణలోనూ నా చదువు విజయవంతంగా జరుగక పోయినా, నాన్న స్వభావం మాత్రం నా హృదయంలో ఎప్పటికీ చెరగని ముద్రవేసింది. చివరి రోజుల్లో నాన్న నా భవిష్యత్తును గురించి



ఎంతో కలత చెందేరు. చివరకు నాకు ఒక సంబంధాన్ని నిశ్చయం చేశారు. అమ్మ మళ్ళీ దానికి వ్యతిరేకించింది. కారణం ఒకటికట్నం ఇయ్యవలసి రావడం, రెండు వరుడు పల్లెటూరివాడు కావడం, పెద్దగా చదువుకున్నవాడు కాకపోవడం. నాన్న ఈ విషయంలో చాలా పట్టు పట్టేరు. ఆయన అంత పట్టుదల చూపించడం నేనెన్నడూ చూడలేదు. వాళ్ల కుటుంబం ఆయన కెంతో తెలుసునన్నారు. వరుని తండ్రి తనకు ప్రాణస్నేహితుడన్నారు. అది ఎంత వరకూ వెళ్ళిందంటే నాకు తెలిసినంత వరకూ మొదటిసారిగా నాన్నగారు అమ్మ మీద చెయ్యి చేసుకున్నారు. అమ్మ కూడా ఊరుకోలేదు. ఆ పెళ్ళి ఎలా జరుగుతుందో చూస్తానంది. పెళ్ళిని తానాపలేక పోతే తన శవమైనా అపుతుందంది. నాన్న నన్ను చేతుల్లోకి తీసుకొని దీనంగా కంటతడి పెట్టడం కంటె ఏమీ చెయ్యలేక పోయారు. ఏడాది తిరక్కుండానే అమ్మకు తెలిసిన సంబంధం ఒకటి కుదిర్చింది. అది మీకు తెలిసిందే. పెళ్ళయిన ఆరునెలలకు నాన్న పోయేరు. అమ్మ తాను చనిపోయే ముందు చెప్పింది నాన్నకు తెలియకుండా వాళ్ళకు పది వేల రూపాయలు కట్నం ఇచ్చిందని.

అన్నయ్యలు ఏ రకంగానూ పైకి రాలేక పోయారు. వాళ్ళల్లో ఉన్న సంస్కారంలేని స్వభావాలు నాన్న బ్రతికి ఉన్నన్నాళ్ళు పూర్తిగా బయటకు రాలేదు. నాన్న పోగానే అమ్మ చేసిన పనులన్నిటికీ ఒకదాని తరువాత ఒకటి ఫలితాలు కనబడడం మొదలు పెట్టేయి. ఎక్కడదాకా వచ్చిందంటే బంగారం లాటి లక్షరూపాయల ఆస్తిని ఇద్దరూ నాలుగేళ్ళు, అయిదేళ్ళలో

పూర్తిగా తగలేశారు. అమ్మను చివరి రోజుల్లో మిగిలిన రెండెకరాల ఆస్థి కోసం పీడించుకు తిన్నారు. చాలా హింసించేరు. అమ్మ ఆ ఆస్థిని నా పేర రాసింది వాళ్ళెలాగూ తగలేస్తారని. వాళ్ళు అమ్మకు కర్మలు కూడా చెయ్యరని అది వాళ్ళ కిచ్చేశాను. అది కూడా హరించి పోయింది. అమ్మ నా కిచ్చిన నగల కోసం మా పెద్దన్నయ్య వచ్చాడు. మీరూ చూశారుగా!..."

కాత్యాయని ఆగింది. రాజశేఖరం హృదయం ఆమె పట్ల జాలితో పొంగింది. "నీ కేమీ అభ్యంతరం లేక పోతే... ఓమాట అడగనా!" అన్నాడు.

"నాకు దేనికీ అభ్యంతరం లేదు. అడగండి! చెప్తాను."

"నువ్వేం బాధపడవుకదా !"

"లేదు."

"అయితే... నువ్వు నీ భర్తతో వుండే అవకాశం లేదా ?"

"లేదు."

"ఎందుకు లేదు ?"

"ఆ ఆలోచన మాలో లేదు. ముఖ్యంగా నాలో లేదు. అదీగాక ఆయన మళ్ళీ పెళ్ళిచేసుకున్నారు."

"మొన్న మీ అన్నయ్య వచ్చినప్పుడు అన్నాడు. గుర్తుందా ?"

"ఏమిటి ?"

"అదే !... నువ్వు వాళ్ళింటికి నిజంగా వెళ్ళేవా ?"

"వెళ్ళేను."

"ఎలా వెళ్ళగలిగేవు?"

"నేనంటే ఆమెకు చాలా అభిమానం."

"అంటే అతని భార్యకా?"

"అవును."

"... మీరు విడాకులు తీసుకున్నారా?"

"లేదు."

"మరి ఎలా విడిపోయారు?"

"ఆయన,ఆమెను పెళ్ళిచేసుకోవాలని మా పెళ్ళి ముందే నిశ్చయించుకున్నారనీ, కొన్ని కారణాలవల్ల నాతో పెళ్ళి ఆపలేకపోయారనీ, ఆమె మీద మనసు మార్చుకోలేక పోతున్నాననీ చెప్పేరు. వాళ్ళు పెళ్ళి చేసుకోడానికి వీలయేటట్లు ఆయన్ను విడిచి వచ్చేశాను."

రాజశేఖరం కొంచెం సేపు ఏమీ మాట్లాడలేదు. తర్వాత అన్నాడు

"ఆ విషయాలు గుర్తుకొస్తే బాధ కలగదా నీకు?"

"నాకు సంతృప్తే కలుగుతుంది. ఒకరి మనసు ఒకరు తెలుసుకొని ఆర్భాటం లేకుండా విడిపోయినందుకు."

"నువ్వు చాలా ధైర్యవంతురాలివి!"

"ఏమో! నా అభిప్రాయం వేరు. ఇందులో ధైర్యం ప్రసక్తే లేదు."

"నా మనసులో మాట చెప్తే నువ్వు బాధ పడతావేమోనని భయంగా వుంది."

"నేను బాధ పడకూడదని మీరింత ఆలోచిస్తుంటే నేనెందుకు బాధపడతాను. చెప్పండి"

రాజశేఖరం కొంచెం సేపు ఆలోచించి చివరకు అన్నాడు.

"మొన్న రాత్రి హైదరాబాదులో హోటల్లో నువ్వన్న మాటలు నిజం కాకూడదా?"

దీనంగా ఉన్న అతని ముఖం చూస్తుంటే కాత్యాయనికి ఎంతో ప్రేమ కలిగింది. గతంలో ఎవ్వరినీ ఎన్నడూ



అభిమానించనంతగా ఈ మనిషిని అభిమానిస్తున్నానని తెలుసుకుంది. అయినా ఆమె నిశ్చయం సడలిపోలేదు. మరో సమయంలో అయితే సూటిగా చెప్పేదేమో! కాని ఇప్పుడు అతని మనసుకు నొప్పి కలిగించ బుద్ధి కాలేదు. ఎలా చెప్పాలా అని ఆలోచిస్తూంది కాత్యాయని.

"నిన్ను ఇన్ని మాటలూ అడిగింది నీ పరిస్థితి స్పష్టంగా తెలుసుకోవాలనే కాని నిన్ను సందిగ్ధంలో పెట్టడానికి కాదు" అన్నాడు రాజశేఖరం.

"నేను దానిని గురించి ఆలోచించటంలేదు. వినండి ... నిజానికి ఇంతసేపూ తోటలో కూర్చొని నేను కూడా దీన్ని గురించే ఆలోచించాను. ఒక నిర్ణయానికొచ్చాను ... కాని ఒక్క విషయం. అన్నీ విన్న తర్వాత మీరు నా నిర్ణయాన్ని మార్చుకోమని అడగడానికి వీల్లేదు" కాత్యాయని రెండు నిమిషాలాగి మళ్ళీ మొదలు పెట్టింది "... నేను అమ్మతో ఇక్కడికి వచ్చినప్పుడు రెండు రోజులు ఇక్కడ ఉండి వెళ్ళిపోతాననుకున్నాను. ఆ రాత్రి ఆవిడ మీతో మాట్లాడిన మాటలు వినేవరకూ నన్నిక్కడ ఉంచడానికే తీసుకొచ్చిందన్న విషయం తెలీదు. తెలిసేక అది నాకు నీచంగా తోచింది. కాని మార్గాంతరం తోచలేదు. అప్పటికే కాపురం విడిచిపెట్టి అన్నయ్యల దగ్గర రెండేళ్ళున్నాను.

వాళ్ళు అమ్మనే సహించలేనప్పుడు నన్నెలా సహించగలరు! అది ఆలోచించే చివరకు ఊరుకున్నాను. కనీసం నా తిండికి మీకయ్యే ఖర్చు వరకూనైనా నేను ఈ ఇంట్లో చాకిరీ చెయ్యాలనుకున్నాను.

కానీ నాకీ యింట్లో తిండే కాదు సమస్తమూ దొరికింది. ఇన్నాళ్ళూ ప్రేమ అంటే ఏదో ఊహించే దాన్నే కాని దాని శక్తి నాకు తెలీదు. అది మనిషిని ఎంత వేధించగలదో తెలీదు. ఇప్పుడు తెలిసింది...నిజం చెప్పాలంటే మీ వశమయిపోయి మీ ధ్యాసతోనే నిండిపోయిన నా మనసును అదుపులో పెట్టుకోడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాను. ఎప్పుడూ మీ సమక్షంలోనే ఉండి మీకు సేవలు చేయగల అవకాశం నాకు దొరికితే వేరే ఇంకేమీ అక్కరలేదు నాకు... కాని నాకా అవకాశం లేదు. నేను ఇక్కడకు రోజు గడవక వచ్చేను. మీ సహకారం వలన ఓ దారి ఏర్పరచుకున్నాను. ఇప్పుడు నేను మీ జీవితంలో ప్రవేశిస్తే తాత్కాలికంగా మీకూ నాకూ అవి ఆనందాన్నిచ్చినా అది అవివేకమే అవుతుంది. చుట్టంగా వచ్చిన నన్ను గౌరవించిన పిల్లలు వాళ్ళ కన్నతల్లి స్థానంలో నిలబడితే, అసహ్యించుకుంటారు. స్నేహంచేసి మోసం చేసినట్లవుతుంది..."

"అది కాదు కాత్యాయనీ!..." రాజశేఖరం ఏదో చెప్పబోయాడు.

"...నన్ను పూర్తిగా చెప్పనివ్వండి. ఇంక మీ విషయం. వాళ్ళమ్మ చోటుమీరు నా కివ్వడం వలన మీ మీద కూడా వాళ్ళకు గౌరవం తగ్గుతుంది. అదృష్టమున్నన్నాళ్ళు మీ భార్యతో మీరు కాలం గడిపేరు. మీ సంసారానికి గుర్తుగా పిల్లలున్నారు. వాళ్ళ భవిష్యత్తును తీర్చిదిద్దాల్సిన బాధ్యత మీకుంది. మీ జీవితంలో కొన్ని ఆశలు తీరేయి. మిగిలినవి మీరు మీ పిల్లల కోసం వదులుకోక తప్పదు.

......చివరకు చెప్పేదేమంటే మీ హృదయంలో చోటుందనే ఆనందంతో జీవితం గడుపగలను. కాని మీ కుటుంబంలో ఏ ఒక్కరి అసంతృప్తికైనా నేను కారణమనే ఆలోచన భరించలేను..."

కాత్యాయని ఆగింది. ఆత్మవిశ్వాసంతో వెలుగుతున్న ఆమె కళ్ళలోకి రాజశేఖరం మంత్రముగ్ధుడిలా చూస్తున్నాడు. కాత్యాయనిలో అతనికొక సంపూర్ణమైన వ్యక్తి కనబడింది.

"నువ్వులేని విషయాల నెన్నింటినో ఊహించుకుంటున్నావు. అంత తీవ్రమైన సమస్యా ఇది?!" అన్నాడు.

"అవును." కాత్యాయని నిశ్చయంగా చెప్పింది.

అప్పుడే జేబులోంచి బయటికి తీసిన రాజశేఖరం చేయిచూసి ఆశ్చర్యపోయింది కాత్యాయని. తెల్లగా మందంగా మెరుస్తూన్న మంచి ముత్యాలహారం అతని చేతిలో వేలాడుతూంది. దాని వైపు చూస్తూ రాజశేఖరం అన్నాడు.

"ఇది జానకి... నా భార్యకు చేయించాను. నీ మెడలో అలంకరించాలని ఉంది. కాదనకు" రాజశేఖరం లేచి ముందుకు వచ్చాడు. అతని చూపులో తానాపలేని ఆకర్షణశక్తి కనిపించింది కాత్యాయనికి. అడ్డుపెడదా

మంటే నోటమాట రాలేదు. అంతా ఒక సెకనులో జరిగిపోయింది. ఆ ముత్యాల హారం ఆమె మెడలో అలంకరించి రెండు చేతులు చాచి ఆమెను హృదయానికి బలంగా హత్తుకున్నాడు.

కాత్యాయని మనసు మంచులా కరిగి పోతూంది. ఒక్క-క్షణం సర్వం మరచి పోయింది. తాను ఎప్పుడూ చవిచూడని మధురానుభూతుల్లోకి తేలిపోతూంది.

వెంటనే కొరడాతో కొట్టినట్లయింది. తన నిర్ణయమేమిటి ? తను చేస్తున్న దేమిటి ?... విడిపించుకుందామని ప్రయత్నించింది. సాధ్యంకాలేదు. అంత నిగ్రహం మనసుకు రావటంలేదు. కాని తాను పొందబోతూన్న పరాజయం గుండెలో శూలంలా పొడుస్తూంది. అసహాయతను తట్టుకోలేక ఏం చేయాలో తెలియక పెనుగులాడింది. రాజశేఖరం చేతులు వదిలేడు. కాత్యాయని కళ్ళు నిండా నీళ్ళు చూసి బెదిరిపోయాడు.

ఆమె రెండడుగులు దూరంగా నడిచింది. పైటకొంగుతో కళ్ళుతుడుచుకుంది.

కాత్యాయని కళ్ళలో ఎప్పుడూ కన్నీళ్ళు చూడని రాజశేఖరం సిగ్గుపడి పోయాడు.

"క్షమించు కాత్యాయనీ !" అన్నాడు.

కాత్యాయని కొంచెంసేపు మాటాడలేదు. తరువాత నిశ్చలమైన గొంతుతో అంది.

"పెళ్ళిలో సంస్కృతంలో అగ్ని సాక్షిగా ఏవో ప్రమాణాలు చేయించారు. వాటి అర్థాలు నాకు తెలియలేదు. కాని ఇప్పుడు మాత్రం నాకు తెలిసిన భాషలో మనస్ఫూర్తిగా చెప్తున్నాను. నేను మీకు దగ్గరగా లేకపోయినా నా మనసెప్పుడూ మీ దగ్గరే ఉంటుంది. అవసరమైనపుడు మీ దగ్గర వచ్చివాలడానికి నేనెప్పుడూ సిద్ధమే. కాని శారీరకంగా ఇంతకంటె మీకు నేను దగ్గరగా వస్తే అది సరియైన పనికాదు దయ ఉంచి ఇక ఎన్నడూ మనం ఏకాంతంగా మాట్లాడుకోవద్దు. నలుగురి మధ్య మాట్లాడలేని మాటలు, చేయలేనిచేతలు మాట్లాడవద్దు చేయవద్దు. పిల్లలందరూ నాపై చూపిస్తున్న అభిమానాన్ని తరగనివ్వకండి. మీరు నానుండి ఏం కోరినా కాదనేశక్తి నాకులేదు. నన్ను బలహీనురాలిని చెయ్యకండి. నా మెడలో ఈ హారం పిల్లలు చూస్తే బాధపడతారు. ఇది తీసుకొని పొండి."

రాజశేఖరం వంచిన తలెత్తి కాత్యాయని ముఖంలోకి చూశాడు. ఎప్పటిలాగే ఆమె ముఖం చిరునవ్వుతో వెలుగుతూంది.

"మిమ్మల్ని నొప్పించడం నా ఉద్దేశ్యంకాదు. తీరికగా ఆలోచిస్తే నా మాటల్లో న్యాయం మీకే స్ఫురిస్తుంది." కాత్యాయని ఇచ్చిన హారాన్ని తీసుకొని రాజశేఖరం వెనుదిరిగేడు.

"ఉద్యోగంలో చేరడానికి నాలుగైదు రోజుల్లో బయలు దేరివెడుతున్నాను"

రాజశేఖరం ఆగివిన్నాడు. "తప్పకుండా వెళ్ళాలా ?" అన్నాడు.

"అవును"

మరొకసారి ఆమె ముఖంలోకి చూసి రాజశేఖరం వెళ్ళిపోయాడు.

కాత్యాయని సంతృప్తితో కిటికీలోంచి బయట వెన్నెల చూస్తూ మంచం మీదకు ఒరిగింది.



## 14

వారం రోజుల తర్వాత ఉద్యోగంలో చేరాలని నిశ్చయించుకుంది కాత్యాయని.

రాజశేఖరం సాధ్యమైనంత వరకు ఇంటిదగ్గరే వుంటున్నాడు. సుజాత ఎంతో చనువుగా ఆప్యాయంగా కూడా తిరుగుతూండడం ఆశ్చర్యం కలిగించింది కాత్యాయనికి.

ఒకరోజు సాయంత్రం ఉష పూలు కోసి మేడమీద కూర్చున్న కాత్యాయని ముందు పోసి మాల కట్టమంది. ఉషతో ఏదో మాట్లాడుతూ ఆమె అందించిన పూలను ఒక్కటొక్కటే తీసుకొని మాల కడుతూంది కాత్యాయని. వాటిలోంచి ఒక గులాబిపూవు తీసి ఆమె తలలో పెడుతూంది రాధిక.

చప్పుడు కాకుండా కెమెరాతో వచ్చి ముగ్గుర్నీ ఫొటో తీసింది సుజాత.

అప్పుడే ఇంటికి వచ్చి ఎవ్వరూ కనబడక మేడమీదకు వచ్చేడు రాజశేఖరం.

కొంత వెలిసిపోయిన నారింజ పండు

రంగు చీర ధరించిన కాత్యాయని సన్యాసినిలా కనిపించింది అతని కళ్ళకి. కాని ఈ సన్యాసినికి దూరంగా ఉండడం కూడా కష్టమనే అనిపించింది.

"అందులో ఫిలింస్ ఉన్నాయా ?" కాత్యాయని అడిగింది సుజాత చేతిలో కెమేరా చూసి:

"ఆఁ ఇంకా అయిదున్నాయి" అంది సుజాత.

"ఇటియ్యి. మీ అందర్నీ ఫొటోలు తీసి అల్బమ్‌లో ఉంచుకుంటాను" అని మాల త్రుంచి ముగ్గురి తలల్లోనూ పెట్టి కెమేరా తీసుకుంది కాత్యాయని.

అప్పుడే రాజశేఖరాన్ని కూడా చూసింది. అతను దగ్గరగా వచ్చేడు.

కాత్యాయని అందరినీ ఫొటోలు తీసింది.

"మీకు తోటలో ఫొటోలు తీస్తాను రండి !" అంది సుజాత చెల్లెళ్ళతో. వాళ్ళు ఆమె వెనకాలే గెంతుతూ వెళ్ళిపోయారు.

రాజశేఖరం పిట్టగోడకానుకొని నిలబడ్డాడు.

కాత్యాయని మాల కట్టగా మిగిలిన కుంటి పువ్వు చెక్కిలిమీద రాసుకుంటూ నిలబడింది.

పైన ఆకాశం నీలంగా, నిర్మలంగా ఉంది.

"తొందరగా వచ్చేశారేం ?" కాత్యాయని అడిగింది.

"ఉద్యోగానికి వెళ్ళొద్దని గట్టిగా చెప్పాలని వుంది. ఏవో మాటలు అల్లి నా నోరు కట్టేసి వెళ్ళిపోతావు. నువ్వు పట్టిన కుందేలుకి ఎప్పుడూ మూడు కాళ్ళేగా ! తర్వాత కావాలనుకున్నపుడు చూడడానికి ఎలాగూ వీలుపడదు. రెండు రోజులైనా కాస్త నీ దగ్గర కాలక్షేపం చేద్దామని వచ్చేశాను".కొంచెం పరుషంగా మాట్లాడిన రాజశేఖరం మాటలు కాత్యాయనికి సంతోషం కలిగించాయి. నవ్వుతూ రాజశేఖరంవైపు చూసింది.

"అసలు నీకు ఉద్యోగం చెయ్యవలసిన అవసరం ఏమిటి ?" నిస్సహాయంగా అడిగేడు రాజశేఖరం.

"ఉద్యోగం చెయ్యాల్సిన అవసరం నాకున్నంతగా ఎవరికుంది ?"

"మొదలెట్టేవు లాయరులా వాదన!" చికాగ్గా చూసేడు రాజశేఖరం. "...నీకు ఈ యింట్లో స్వేచ్ఛకు అడ్డు వుండదు. ఏ లోటూ జరగదు. ఇంట్లో పనులకు ఎవరినో పెట్టుకుంటాము. నువ్వు ఇక్కడే ఎందుకు ఉండిపోగూడదు?"

"ఇన్నాళ్ళూ నాకు గడవక ఉన్నాను. అదీ ఎప్పుడో ఒకప్పుడు నా దారి నేను చూసుకోగలుగుతాననీ, స్వతంత్రంగా బ్రతుకగలననీ అనుకుంటూ వున్నాను. ఇప్పుడు ఎలా ఉండను? నేను బయటకు వెళ్ళడమే సరైన పని. నేను ఎవరి ఆధారామూ లేకుండా బ్రతగ్గలననే ఆత్మవిశ్వాసం నాకు కావాలి. దానికోసం నేను ఎన్నాళ్ళనుంచో ఎదురు చూస్తున్నాను" కాత్యాయని రాజశేఖరంవైపు చూసింది. "మీరు అలసిపోయినట్లున్నారు" అంది.

"అవును అలసిపోయాను. ఏంచేస్తే నువ్వు వెళ్ళకుండా ఉంటావోనని ఆలోచించి అలసిపోయేను. నీతో వాదించలేను. నువ్వు వెళ్ళిపోతే ఉండలేను. నాకు నీమీద వున్న ప్రేమ నాకే తెలుసు. నా మనసులో భావాన్ని నేనెప్పుడూ సరిగా చెప్పలేక పోయాను. చెప్తే

తప్పటడుగులు వేసి నట్లుంటుంది. నాలో ఇదో బలహీనత"

రాజశేఖరం హఠాత్తుగా ఆగిపోడం చూసి కాత్యాయని అతని ముఖంలోకి చూసింది. అస్తమిస్తున్న సూర్యుడి కిరణాలు అప్పుడే చిప్పిల్లిన అతని కళ్ళ ల్లోని కన్నీళ్ళలో తళుక్కుమన్నాయి. తలెత్తిన కాత్యాయనిని చూసి చటుక్కున తల తిప్పుకున్నాడు రాజశేఖరం.

ఆమె మనసు చివుక్కుమంది.

"పరిస్థితులను అర్థం చేసుకోండి. సమస్యలు లేక మీరూ, నేనే ఉంటే నేను మిమ్మల్ని విడిచేదాన్నే కాదు. అనుభవం ఉన్న మీరు దేన్నయినా కొంత వరకు నిగ్రహించుకోగలరనే ధైర్యంతో ఉన్నాను. మీరే ఇలా బేలగా ఉంటే నాకు మనశ్శాంతి ఉండదు" అంది కాత్యాయని. రాజశేఖరం తల తిప్ప లేదు. "అయితే ఎప్పుడు ప్రయాణం?" అన్నాడు.

''ఎల్లుండి రాత్రి బండికి. రండి క్రిందికి వెడదాం"

కాత్యాయని వెనుకనే క్రిందికి దిగేడు రాజశేఖరం. తర్వాత రెండు రోజులూ రెండు క్షణాల్లా గడిచిపోయాయి. కాత్యాయని ప్రయాణం కావలసిన రోజు రానే వచ్చింది. సుజాత, కాత్యాయనిని ఆరోజు వంట దగ్గరకు రానీయ లేదు. అన్నీ తానే చేసింది. డైనింగ్ టేబిల్ మీద అన్నీ తానే అమర్చింది. రోజూ అందరూ భోజనాలు చేశాక తాను భోజనం చేసేది కాత్యాయని. ఆ రోజు పిల్లల బలవంతంతో వాళ్ళతో పాటే కూర్చోవలసి వచ్చింది. టేబుల్‌కు ఒక చివర రాజశేఖరం, అతని కెదురుగా కాత్యాయని ఇటూ అటూ పిల్లలూ కూర్చున్నారు.

కాత్యాయని తలెత్తి చూసింది. రాజశేఖరం తన కళ్ళల్లోకే చూస్తున్నాడు. పిల్లల వైపు చూసింది. అందరూ తన వైపే చూస్తున్నారు. ''ఏమిటి అందరూ అలా చూస్తున్నారు! కానివ్వండి!" అంది సుజాత.

కాత్యాయని అన్నం కలుపుకొని ముద్ద నోట్లో పెట్టుకుంది. గొంతుకేదో అడ్డు పడ్డట్లనిపించింది. అందరూ తనకిస్తూన్న విలువతో కడుపు నిండిపోయి నట్లనిపించింది.

ఎలాగో భోజనం అయిందనిపించింది.

తర్వాత కూడా ఎవ్వరూ ఒక్క క్షణం కాత్యాయనిని వదిలిపెట్టి ఉండ లేదు.

మధ్యాహ్నం మూడు గంటలకు సుజాత తను చీరలు కొనుక్కోవాలని తోడుగా కాత్యాయనిని బట్టల షాపుకు తీసుకొని వెళ్ళింది.

షాపులో సుజాత ఒకదాని తర్వాత ఒకటి అన్ని రకాల చీరెలూ బయటకు తీయించి వాటిలో ఐదారు కాత్యాయని సెలెక్టు చేసినవి తీసుకుంది.

''ఒక్కసారి ఇన్ని చీరలెందుకమ్మా. ఎప్పుడు అవసరంవస్తే అప్పుడే కొనుక్కోవచ్చుగా!" అంది కాత్యాయని.

"నువ్వెళ్ళిపోతే నాతో చీరలు సెలెక్టు చేసేందుకు ఎవరుంటారు?" అంది సుజాత. చీరెలు పార్సెలు చేయించుకొని ఇంటికి వచ్చారు.

సుజాత కొత్త చీరెలన్నీ తన పెట్టెలో సర్దడం చూసి ఆశ్చర్యపోయింది కాత్యాయని.

"ఏమిటిది సుజాతా! నీకేం మతి పోలేదు కదా! ఎవరికి ఈ చీరెలన్నీ?" అంది కాత్యాయని.

"నీకు" తలెత్తకుండానే జవాబు చెప్పింది సుజాత.

"ఎవరు చెప్పేరు నీకు ఇవన్నీ కొనమని?"

"నేను నాన్నగారి నడిగేను. సరే నన్నారు"

"నా చీరెలు నాకున్నాయి. ఇంతింత ఖరీదు చీరెలు కట్టుకోవడం నాకలవాటు లేదు. అవి బయటకు తియ్యి"

"అదేం లాభం లేదు" పెట్టె మూసింది సుజాత. తెచ్చిన వాటిలో ఒక గంధం రంగు చీర మాత్రం బయట ఉంచింది. వాదించి వాదించి ఏం చేయ లేక ఊరుకుంది కాత్యాయని. సుజాత పసుపు తెచ్చి కాత్యాయని పాదాలకు రాసి బొట్టు పెట్టి చీర చేతిలో పెట్టి నమస్కరించింది.

"ఏమిటమ్మా ఇదంతా లేని పోని చాదస్తం"

"ఎవరి పిచ్చి వారికానందం! కొత్త చీర కట్టుకో! ప్లీజ్" ప్రాధేయ పూర్వకంగా అడిగింది సుజాత.

కాత్యాయని కాదన లేకపోయింది.

కొత్త చీర కట్టుకుంది.

"కళ్ళు మూసుకో! నీకో బహుమతి నిస్తా!" అంది సుజాత రెండు చేతులూ వెనక్కు పెట్టుకొని.

"చాలమ్మా! ఈ బహుమతులు చాలు"

"ఊఁహుఁ. వీల్లేదు. కళ్ళు మూసుకోవాలి"

"నాకు కోపం తెప్పిస్తున్నావు సుజాతా! నీ పద్ధతేం బాగులేదు"

"నీ కోపం ఎప్పుడూ చూడలేదు. ఇప్పుడు చూడాలని సరదాగా ఉంది"

"నీ పంతం నీదేకాని చెప్పిన మాట వినవన్నమాట!"

"ఒక్కసారి! ప్లీజ్!"

"అబ్బ! ప్రాణాలు తీస్తున్నావ్ సుజాతా!" కాత్యాయని కళ్ళు మూసుకుంది.

కళ్ళు తెరచి చూసింది. తన మెడలో ముత్యాల హారం! పాముని మెడలో వేసినట్లు భయపడింది.

"ఏమిటి?" ఆమె పై ప్రాణాలు పైనే పోయాయి.

సుజాత నవ్వుతూంది.

కాత్యాయని మనసు కరగి పోయింది.

సుజాత తన బలహీనత పసికట్టి పరిహాసం చేస్తుందా? ఈ హారం ఆమె చేతికెలా వచ్చింది? నాలుగైదు రోజులుగా ఆమె చూపిస్తున్న ఎక్కువ చనువుకు కారణం ఏమిటి?

"నా ప్రశ్నకు జవాబు చెప్పు సుజాతా!" ఆందోళనతో అడిగింది కాత్యాయని.

"ఏమిటి?" ఇంకా నవ్వుతూనే అంది సుజాత

"ఈ హారం...."

"మా అమ్మది"

"నీకెలా వచ్చింది?"

"నాన్నగారి నడిగి తీసుకున్నాను."

"ఎందుకు?"

"నీ కివ్వడానికి."

కాత్యాయనికీ అర్థం కాలేదు. జరుగకూడనిదని ఇన్ని రోజుల నుంచీ తాను భయపడుతూన్నదేదో జరిగిపోయిందనిపించింది. ఏది ఏమైనా తన మనోభావం సుజాతకు చెప్పవలసిన అవసరం వచ్చిం

దని పించింది.

"మా అమ్మ స్థానంలో 'నువ్వుంటే నేనెంతో సంతోషించే దాన్ని."

"సుజాతా!..." కాత్యాయని కళ్లలో నీళ్ళు నిండేయి– "అది నేనెన్నడూ ఆశించలేదు సుజాతా! నువ్వు నన్ను తప్పుగా అర్థం చేసుకోకు! నాకు కావలసింది మీ అందరి స్నేహమే"

"నేను మాత్రం నా మనసులో ఉన్న మాట చెప్పేను"

"అసలు నీకెందుకలా అనిపించింది"

"చెప్ప మంటావా ?"

"తప్పకుండా ! స్పష్టంగా తెలుసుకునే వరకూ నాకు మనశ్శాంతి ఉండదు"

"అయితే నాతోరా!"

గుండె వేగంగా కొట్టుకుంటూంటే సుజాత వెనకాలే వెళ్ళింది కాత్యాయని. సుజాత గదిలోకి వెళ్ళగానే తలుపు వేసింది. కాత్యాయని మంచం మీద కూర్చుంది. పుస్తకాల బీరువాలో వెనుక నుంచి ఒక మడత పెట్టిన కాగితం తీసుకొచ్చి కాత్యాయని చేతిలో పెట్టి ప్రక్కనే కూర్చుంది సుజాత.

"ఇది చదువు !"

కాత్యాయని కాగితం విప్పి చూసింది. ముత్యాల కోవలాంటి దస్తూరీ.

నాన్నా,

కొంతమంది పుట్టిన ఘడియలో ఏ శక్తి ఉంటుందో తెలియదు. వాళ్ళ జీవితాలు మూడు పువ్వులు ఆరు కాయలుగా ఉంటాయి. అలాగే కొంత మందికి ఆజన్మాంతం ధుఃఖమే గాని సుఖం ఉండదు. అటువంటి దురదృష్ట జాతకురాలిని నేను. పుట్టింట తల్లిదండ్రుల ప్రేమకు నోచుకోని నేను అత్తింట ఆయన ప్రేమకూ నోచుకోలేకపోయాను. అక్కడి పరిస్థితులు భరించలేక కొన్ని రోజులు ఉండి పోదామని ఇక్కడికొస్తే ఇక్కడో కొత్త మనిషి! మీ ఒక్కరి స్వార్థం కోసం, సుఖం కోసం ఇంత మంది పసివాళ్ళ జీవితాలతో చెలగాటం ఆడటం దారుణం! అయినా కన్న తండ్రే వాళ్ళకు అన్యాయం చెయ్యదలుచుకుంటే వాళ్ళను రక్షించ గలిగే వాళ్లు మాత్రం ఎవ్వరు! దేవుడున్నాడనే నమ్మకం ఏనాడో పోయింది.

ఇప్పుడు నాకే ఆశ్చర్యమని పిస్తూంది అసలు ఇన్నిరోజులు నేను ఎలా బ్రతికి ఉన్నానా అని! ఇంక ఒక్క రోజు జీవించే శక్తి నాకులేదు.

శారద.

కాత్యాయని ఆశ్చర్యానికి అంతు లేక పోయింది.

"అయితే..."

"అక్కయ్య ఆత్మహత్య చేసుకుంది."

కాత్యాయని హృదయం బరువెక్కింది

"ఉత్తరంలో 'కొత్తమనిషి' ఎవ్వరో తెలుసా ?"

"నేనే అయివుండాలి."

"అవును"

"కాని శారద భ్రమపడిందమ్మా ! ఆమె ఆలోచన నిజంకాదు."

"అది నేను తెలుసుకున్నాను."

"ఈ ఉత్తరం సంగతి మీ నాన్న గారికి తెలీదా ?"

"తెలీదు... అక్క చనిపోయే ముందు రాత్రి నాతో చాలాసేపు మాటాడింది. నిన్ను గురించి ఎన్నో విషయాలడిగింది. మాట్లాడుతూ మాట్లాడుతూ

నే నెప్పుడు నిద్రపోయానో నాకే తెలీదు. తెల్లవారేక నేను ముందు లేచి ఓ అర గంట బయటికొచ్చి తరువాత మళ్ళీ అక్క గదిలోకి వెళ్ళేను. యధాలాపంగా టేబిల్ వైపుచూస్తే టేబిల్ లాంపుక్రింద ఈ ఉత్తరం వుంది. నా ప్రాణాలు పైనే పోయాయి. అక్క మంచంమీద పడుకొని వుంది. తల నావైపే తిప్పి ఉంది. లేపడానికి ప్రయత్నించేను. అక్కలో చలనంలేదు. పట్టపగలు అంత వెలుతురులోనూ ఒక్కక్షణం ఆ గదిలో నిలబడడానికి భయం అనిపించింది. వణుకుతూన్న కాళ్ళతో ఒక్క అంగలో బయట పడ్డాను. చేతిలో ఉత్తరం ఉంది. నాన్న కిద్దామనుకున్నాను. ఆ క్షణంలో ఎందుకలా నేను నిశ్చయించుకున్నానో ఇప్పుడు గుర్తులేదు. కాని ఉత్తరం దాచేసి అక్క లేపటంలేదని కేకలు పెట్టేను. తరువాత జరిగిందంతా నీకూ తెలుసు. తరువాత ఈ ఉత్తరం నాన్న గారికి చూపించాలని ఎన్నోసార్లనిపించింది. కాని చూపించలేకపోయాను....

అమ్మ పోయిన రెండేళ్ళకు అక్కయ్య పెళ్లయింది. పెళ్ళయి కాపురానికి వెళ్ళగానే నాన్నకు నాలుగు పేజీల వుత్తరం రాసింది. అది చదువుకొని నాన్న చాలా బాధపడ్డారు. నాకు తెలిసినప్పటినుంచీ అక్కయ్య ఎప్పుడూ అంతే! ఎప్పుడూ ఎవరో తనకు చేయవలసిందేదో చేయక అన్యాయం చేస్తున్నారని బాధపడేది. బావ చాలా మంచివాడు. అయినా అటువంటి మనస్తత్వం గల అక్కయ్యకు అక్కడేమి కనిపించాయో ఆ భగవంతుడికే తెలియాలి.



దాని విషయం పూర్తిగా తెలుసుంది కూడా ఉత్తరంలో నీ గురించి రాసిన విషయం చదవగానే నేనూ నమ్మేను. దానికి వేరే కారణం ఏమీ లేదు, బహుశా అక్కయ్య ఎప్పటికీ కనబడకుండా వెళ్ళిపోయిన సందర్భంలో ఆ మాట అనడమే దానికి కారణం కావచ్చు. అప్పటి నుంచీ నిన్ను ఆ అనుమానంతోనే చూడడం మొదలుపెట్టేను...'' సుజాత ఆగింది. కాత్యాయని నిర్లిప్తంగా వింటూంది.

''నిన్ను గురించి చెడుగా ఆలోచించినందుకు క్షమించాలి'' సుజాత కాత్యాయని కళ్ళల్లోకి చూసింది.

''చెప్పు సుజాతా ! నువ్వింత దాచుకోకుండా చెప్తూన్నందుకు నే నెంతో కృతజ్ఞురాలిని.''

''నీ దగ్గరనుంచే నేర్చుకున్నాను మనసులో ఉన్నది దాచుకోకుండా చెప్పడం !''

''సరేలే! చెప్పు!''

''... ఆనాటినుంచీ నువ్వేపనిచేసినా రంగుటద్దాల లోంచి చూసేదాన్ని. అయినా మంచేకాని నీ పనుల్లో చెడు చూడడం కష్టమయింది. ఎప్పుడో నాకు తెలీకుండానే నేను నీకు దగ్గరగా రావడం మొదలుపెట్టేను. అక్కయ్య స్వభావం గుర్తుచేసుకున్నాను. ఇన్ని రోజులు నీకు సమీపంలో ఉండి నే చూడలేని విషయాలు పదిరోజులలో అక్కయ్య ఏం చూడగలిగిందో అర్థం కాలేదు. రాత్రింబవళ్ళు నాన్నకు జ్వరం వచ్చినప్పుడు నువ్వు చేసిన సేవ చూస్తే నాకు అమ్మ గుర్తుకొచ్చింది. నాలుగు రోజులు ముందు నాన్నకూ నీకూ మధ్య జరిగిన సంభాషణ అంతా పొంచి ఉండి

విన్నాను. నీ మాటలు వింటూంటే నా కళ్ళల్లోంచి జలజలా నీళ్ళు కారిపోయాయి. అప్పటివరకూ వున్న అనుమానాలన్నీ మాయమయ్యాయి. నిన్ను ఇన్ని రోజులు తప్పుగా చూసినందుకు ఎంతగానో బాధపడ్డాను..." సుజాత ఆగిపోయింది.

కాత్యాయని ఇంకా ఆశ్చర్యాన్నుంచి కోలుకోలేదు.

"ఇన్ని విషయాలు జరిగేయంటేనమ్మ శక్యం కాకుండా ఉంది" అని ముత్యాల హారం తీస్తూ అంది "నాకిది వద్దమ్మా! నీ ఆలోచనలకే నేనెంతో ఋణపడి వున్నాను. అదే వేయి హారాల విలువ!"

సుజాత హారం తియ్యనియ్యలేదు.

''అది నీ మెడలో ఉంటే ఎవ్వరూ ఏమీ అనుకోరు. నాన్నకు ఎంతో సంతృప్తి కలుగుతుంది. అయినా నాకు నీ వివేకంమీద వున్న నమ్మకం ఇంక దేనిమీదా లేదు. అందుచేత ఉద్యోగంలో చేరడం విషయంలో నువ్వు ఇంత ఆలోచించి తీసుకున్న నిర్ణయాన్ని మార్చుకోమని చెప్పలేకపోతున్నాను"

సుజాత ఇన్ని విషయాల్ని మనస్సులో ఎలా ఇముడ్చుకొని ఉండగలిగిందా అన్నదే ఆశ్చర్యం కలిగించింది కాత్యాయనికి.

''ఒక విధంగా ఈ ఉత్తరం నువ్వు దాచడం మంచిదే అయింది. మీ నాన్నగారు దీన్ని చూస్తే చాలా బాధపడతారు'' అంది.

''అంతా నీతో చెప్పిన తర్వాత ఇప్పుడు నా మనసెంతో తేలిక పడింది". సుజాత శారద ఉత్తరాన్ని చింపేసింది. "నువ్వేమీ అనుకోవుకదూ!" అని తప్పు చేసినట్లు అడిగింది సుజాత.

''నీ పరిస్థితిలో ఎవరున్నా అలాగే అనుకొనేవారమ్మా! అయినా నీ అంతట నువ్వు నిజం తెలుసుకోవాలని చేసిన ప్రయత్నం గొప్పది'' అంది కాత్యాయని.

ఇంతలో తలుపు చప్పుడయింది.

కాత్యాయని తలుపు తీసింది. ఆమెను చూస్తూ గుమ్మం దగ్గర రాజశేఖరం చేష్టలు దక్కి నిలబడిపోయాడు.

కొత్త చీర, బొట్టుమీద చెదురుగా వున్న బొట్టు, మెడలో ముత్యాలహారం... అతని చూపుకు కాత్యాయని ఇబ్బంది పడిపోయింది. చివరకు సుజాతను గమనించి, రాజశేఖరం "మీరిద్దరూ ఇక్కడున్నారా! బజారునుంచి ఇంకా రాలేదనుకున్నాను" అని, ''నీకోసం ఒకతను వచ్చాడు కాత్యాయనీ! బజారుకెళ్ళేవని చెప్పగానే కూర్చోమన్నా కూర్చోకుండా వెళ్ళిపోయేడు. ఎర్రగా, పొడుగ్గా ఉంటాడు''.

''పేరు అడిగేరా?''

''లేదు. మరచిపోయాను. రాత్రి రైలుకు బయలుదేరి వెడుతున్నావని చెప్పేను. ఏ రైలుకని అడిగేడు.చెప్పగానే వెళ్ళిపోయాడు''.

ఎవరు వచ్చారో కాత్యాయనికి అర్థం కాలేదు. రమణ కావచ్చు. కానీ ఆయన రావడానికి తగిన కారణం కనబడలేదు. కాత్యాయని బయలుదేరేవరకూ టైము క్షణాల్లో గడిచిపోయింది. ఆమె ప్రయాణం ఏర్పాట్లన్నీ సుజాతే చూసింది. పిల్లలనందర్నీ విడిచి వెళ్ళడం కాత్యాయనికి చాలా కష్టమైపోయింది. కళ్ళనుండి జలజలా కన్నీళ్ళు కారిపోయాయి. పిల్లలు అందరూ స్టేషనుకు ప్రయాణం అవు

తూంటే అడ్డు పెట్టింది సుజాత. "స్టేషనుకు నువ్వెళ్ళిరా నాన్నా !" అని తండ్రిని ముందుకు నెట్టింది.

తానెప్పుడు భోజనం చెయ్యాలో కూడా తెలియని సుజాత ఇన్ని విషయాలు ఇంత జాగ్రత్తగా ఆలోచించడం తృప్తి కలిగించింది కాత్యాయనికి.

దారిలో నిశ్శబ్దమే ఒకరి మనసుల్ని మరొకరికి ప్రసారం చేసింది.

స్టేషనులో బండి కదలబోయే ముందు తన జేబులోంచి పర్సుతీసి కాత్యాయనికి అందించాడు రాజశేఖరం.

"ఇదేమిటి ?" అంది కాత్యాయని పర్సు తిప్పిచూస్తూ.

రాజశేఖరం నీళ్ళు నమిలేడు. "ఏం లేదు. నీదగ్గర ఉంచు" అన్నాడు ఎలాగో.

కాత్యాయని పర్సు తెరిచి చూసింది. పర్సు పట్టినన్ని వంద రూపాయల కాగితాలు.

"ఎందుకివన్నీ నాకు?"

రాజశేఖరం జవాబు చెప్పలేదు. జాలిగా చూశాడు ఆమె కళ్ళలోకి.

"అవసరంవస్తే మిమ్మల్నడిగే నేను తీసుకుంటాను. నన్ను నమ్మండి. ప్రస్తుతానికి నాకొచ్చే జీతమే నాకెక్కువ. మీ దగ్గరుంచండి" అంది.

రాజశేఖరం చిన్నబుచ్చుకున్నాడు. కాత్యాయన్ని గమనించింది.

"నాకు మీరో చిన్న సాయం చెయ్యాలి" అంది.

"ఏమిటది ?" అన్నాడతను ఉత్సాహంగా.

"చేస్తారా?"

"తప్పకుండా...చెప్పు ! ఏమిటది?"

"ఇక్కడ నా నిధి నిక్షేపాలున్నాయి. మీరు వాటిని కంటికి రెప్పలా కాపాడాలి"

"నాకర్థం కావటంలేదు".

"మీ పాత అలవాటు మొదలు పెట్టకండి. వేళకు భోజనంచేసి నిద్రపొండి"

"కాత్యాయనీ!"

"నాకోసం ఈ ఒక్క చిన్న పనీ చేయండి" అని అతని చేతిల్లో పర్సు తీసుకొని రెండు వంద రూపాయల నోట్లు అందులో ఉంచుకొని మిగిలినవన్నీ అతనికిచ్చేసింది.

రాజశేఖరం ముఖం కొంచెం సంతృప్తితో వెలిగింది. రైలు కదిలింది.

"వస్తాన్నేను. ఉత్తరాలు రాస్తూండండి వీలయినంత తరచుగా. నాకిచ్చిన మాట మాత్రం మరచిపోవద్దు".

రాజశేఖరం దూరమయ్యాడు. అతను కనబడేంతవరకూ చూస్తూ గేటుదగ్గరే నిలబడింది కాత్యాయని.

ప్రపంచంలోని ఎన్నో అనుభవాలను జీర్ణించుకొని అంత వయసులో అతను స్వచ్ఛమైన మనసుతో వున్న పసివాడులా కనబడ్డాడు.

రైలు కొంచెం మలుపు తిరిగింది. కాత్యాయని లోపలకు వెళ్ళి కూర్చుంది.



## 15

కాత్యాయని ఫొటో అల్బమ్ బయటకు తీసింది. ఒక్కొక్క కాగితమే తిప్పుతుంటే గడచిపోయిన జీవితం

కలలా కళ్ళ ముందు కదిలింది. ఎదురుగా ఫొటోలో రాజశేఖరం కాత్యాయని హృదయంలోకి చూస్తున్నాడు. మరో కాగితం తిప్పింది కాత్యాయని. ఆల్బమ్‌లో నల్లని కాగితాలు మిగిలేయి. జీవితంలో ఇంకా గడవవలసిన భాగం గుర్తొచ్చింది.

ఇంజను కూసింది. కాత్యాయని మనసులోని ఆలోచనలు చెదిరిపోయేయి.

రైలు వేగం తగ్గింది. పెట్టెలో కొంత మంది జనం సామాన్లు సర్దుకొని దిగడానికి సిద్ధంగా గుమ్మం దగ్గరకొచ్చి నిలబడ్డారు. ఏ స్టేషనో పేరు సరిగా కనబడలేదు. బండి ఆగింది. ప్రయాణీకుల హడావిడిలో కూలీల పరుగులతో, అమ్ముకొనే వాళ్ళ కేకలతో అంతా సందడిగా వుంది.

కాత్యాయని బయటకు చూసింది. ఉదయపుటెండ ప్లాట్‌ఫారం నిండా జనం. వస్తూపోతున్నవాళ్ళూ, ఎన్ని వయసులవాళ్ళో, ఎన్ని మనస్తత్వాల వాళ్ళో, ఎటువంటి పరిస్థితుల్లో ఉన్న వాళ్ళో! నవ్వులు, ఆందోళనలు, కోపాలు, తాపాలు ..... ఆ ముఖాల మీద ఎన్ని భావాలో! ఆభావాల వెనుక ఎన్ని గాథలున్నాయో! ఎన్ని అగాధాలున్నాయో! ఎన్ని త్యాగాలున్నాయో! ... ఎన్ని ద్వేషాలున్నాయో! ఎన్ని మానసిక సంఘర్షణలున్నాయో! ... అన్నీ ఎవరైనా తెలుసుకోగలిగితే ... అందరి మనస్సుల్లోకీ ఒకసారి తొంగిచూడ గల శక్తే ఉంటే...

"అక్కయ్యా"

వెనుకనే పిలుపు వినబడి కాత్యాయని ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూసింది.

చేతిలో పసికందుతో ఉమాదేవి!

అయితే ఉమకు పురుడు వచ్చేసిందన్నమాట!

"కూడా ఎవరయినా ఉన్నారా అక్కయ్యా !"

"లేరు. నేనొక్కర్తినే!"

"బయట నుంచి రెండుసార్లు పిలిచాను. నువ్వు పలుకలేదు. ఎవరికోసమో ఎదురు చూస్తున్నావనుకున్నాను" అంటూ కంపార్టుమెంటులో పలకు వచ్చింది. "బాగున్నావా!" అంది.

'ఆ' కాత్యాయని ఉమను నఖశిఖ పర్యంతం చూసింది. తలకు పట్టు రుమాల చుట్టుకుంది. కొంచెం ఒళ్ళుచేసినట్లుంది. బాలింతరాలు. చేతిలో పసిగుడ్డుతో ముఖమంతా వ్యాపించిన చిరునవ్వుతో పరిపూర్ణమయిన స్త్రీ మూర్తిలా వుంది ఉమ.

ఉమను చూసినప్పుడల్లా విస్మయంతో రెప్ప వాల్చకుండా చూడడం కాత్యాయనికి అలవాటే!

"ఓసారి నీ చేతులతో బాబు నెత్తుకో అక్కయ్యా! నీకు బాబును చూపిద్దామనే వచ్చాను."

కాత్యాయని బాబును తీసుకొని ముద్దాడింది.

"ఎన్నాళ్ళయింది పురుడొచ్చి?"

"నెల మీద పదిరోజులయింది."

"ఇప్పుడు నా కోసమే వచ్చావా నువ్వు?"

"అవును."

"నే నిందులో పడుతున్నట్లు ఎలా తెలిసింది నీకు?"

"ఆయన టెలిగ్రాం ఇచ్చారు నిన్న."

"అయితే నిన్న వచ్చింది ఆయనే నన్నమాట!" ఒకతను వచ్చి వెళ్ళినట్లు రాజశేఖరం చెప్పిన మాట గుర్తుకు తెచ్చుకుంది కాత్యాయని. "నీ కూడా ఎవరైనా వచ్చారా?"

"లేదు. మా వూళ్ళో అయితే రైలు ఎక్కువసేపు ఆగదని. ఇక్కడికొచ్చాను"

"ఎంత పని చేశావు ఉమా! మరో సారి చూసేదాన్నిగా!" "నువ్వు వుండగలవు! నిన్ను చూడకుండా నేను వుండలేకపోతున్నాను. నాన్నగారు తోడు వస్తానన్నారు. నీతో మనసు విప్పి మాట్లాడడానికి నేనే వద్దన్నాను ... ఐతే ఎక్కడి దాకా ప్రయాణం?"

"హైదరాబాదు"

"ఎందుకు?"

కాత్యాయని బ్యాగ్‌లోంచి తన ఉద్యోగం కాగితం తీసి చూపించింది.

"చాలా కష్టపడుతున్నావక్కయ్యా!" అంది బాధగా ఉమ.

"జీవితం మీద నా అభిప్రాయం వేరు ఉమా! నేను అదృష్టవంతురాలిననే అనుకుంటున్నాను. సంతోషంగానే వున్నాను" ఉమ కాత్యాయని కళ్ళల్లోకి చూసింది. ఆమె కళ్ళల్లో ఉట్టిపడే ఆత్మ విశ్వాసం ఆమెకెప్పుడూ ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

"బాబును చూడ్డానికి ఆయన వచ్చారు. అంతా చెప్పేరు! ఆయనలో నాకు కనిపించే గొప్ప గుణం అదే! ఆయన ఎటువంటి విషయాన్నయినా మనసులో దాచుకోలేరు....అలాగే చెప్పేరు"

కాత్యాయని గుండె వేగంగా కొట్టుకోవడం మొదలు పెట్టింది. ఉమ కళ్ళల్లో కన్నీళ్ళు చూసి నిశ్చేష్టురాలయింది.

"......మీ యిద్దరి మధ్యా ఉన్న గత సంబంధాన్ని బట్టి ఒక్క క్షణం మనసు చెదిరి నిన్ను బలహీనురాల్ని చెయ్యాలని చూశారు. అక్కయ్యా నాకు ఒకటే ఆశ్చర్యం అనిపించేది. నేను అసంభవం అని ఒకప్పుడనుకొన్న ఆయన నాకు దొరికినందుకు కాదు, అంత వివేకం, నిగ్రహం, సంస్కారం ఉన్న మనిషిని ప్రత్యక్షంగా చూస్తున్నందుకు! ఎన్ని జన్మలెత్తినా నీ ఋణం తీర్చుకోలేనక్కయ్యా?" కాత్యాయని హృదయం ఉమ పట్ల ప్రేమతో స్పందించింది. ఇంత స్వచ్ఛమైన మనసు గల మనుష్యులకు తానేం సానుభూతి చూపించగలదు. ఆమె ముఖంపై చిరునవ్వు ఎప్పటికీ చెదరకుండా ఉంటే బాగుండును.

"నిన్ను చూస్తూంటే నా తోడబుట్టి, చిన్నప్పటి నుంచీ నాతో పెరిగిన చెల్లెలివేమోననిపిస్తూంది" అంది కాత్యాయని.

"ఆయన చేసిన తప్పు పని మరిచిపో అక్కయ్యా"

"మనం మనుష్యులం! అందరికీ బలహీనతలుంటాయి ఉమా! కాని కొంచెం ఆత్మ విమర్శ, విచక్షణ–ఉద్రేకాలు తగ్గిన తర్వాతనైనా అవసరం. దానికేముంది! స్నేహితుడిగా ఆయన నెప్పుడూ గౌరవించగలను"

రైలు కూసింది.

"బండి కదులుతుందేమో! జాగ్రత్తగా దిగు ఉమా! తర్వాత నేను బాబునందిస్తాను" అంది కాత్యాయని.

"వస్తానక్కయ్యా' ఇవి నువ్వు తినాలని ప్రత్యేకంగా చేసి తెచ్చాను" ఉమ చేతిలో వున్న చిన్న సంచీని సీటు

మీద పెట్టి, రైలు దిగి బాబు నందుకుంది!

కాత్యాయనికి మెరుపులా ఆలోచన వచ్చింది. పెట్టె తెరచి అందులోంచి ఓ పొట్లం తీసి అది ఉమ, చేతిలో పెట్టింది. బండి కదిలింది.

"అది నా మంగళ సూత్రం' ఏదైనా నగ చేయించుకొని నీ మెడలో వేసుకో!" అంది కాత్యాయని.

"అక్కయ్యా!" అని ఆగలేక రెండడుగులు బండితో పాటు ముందుకు వేసింది ఉమ.

"దూరంగా వుండు జాగ్రత్త!... వస్తాను"

ఉమ నిలిచిపోయింది. రెండు క్షణాలు గుమ్మం దగ్గర నిలబడి లోపలకు వచ్చి కూర్చుంది కాత్యాయని.

ఉమ ఇచ్చిన సంచీ తీసి చూసింది.

లోపల చిన్న స్టీలు కారియర్! అందులో స్వీట్సు, ఒకటి తీసి నోట్లో పెట్టుకుంది.

మెడలోని ముత్యాల హారాన్ని అప్రయత్నంగా వేలికి చుట్టుకుంది.కొన్ని కొన్ని హృదయాల్లో నిజంగా ఎంత తీపి నిండి వుంటుంది అనుకుంది.



## 16

కాత్యాయని ఎదురుగా గోడమీద తను పని చేస్తూన్న వైపు చూసింది. కంపెనీ కేలెండరు.

తాను హైదరాబాదు వచ్చి దాదాపు నెల అయిపోయింది. వుద్యోగం రాక ముందు అది వస్తే ఎలా వుంటుందోనని ఊహించుకున్న ఊహలను మననం చేసుకుంది కాత్యాయని. కాని ఊహాలలో వున్న ఉత్సాహం వాస్తవంలో కనబడటంలేదు. ఉత్సాహం లేకపోవడంకంటె దాన్ని తాను పొందలేకపోతున్నానన్న విషయం మరీ బాధ కలిగిస్తూంది. అనుక్షణమూ ఎటో పారిపోతూన్న మనసును నొక్కి పట్టవలసివస్తూంది. విసిగిపోయి మనస్సును ఒక్కసారి స్వేచ్ఛగా వదిలేసింది.

రాజశేఖరం ఇంటిలోని ప్రతి మనిషినీ, పరిసరాల్లోని ప్రతి అంగుళాన్నీ స్పృశించి వచ్చింది మనసు. పెట్టెతెరచి ఆల్బమ్ చేతిలోకి తీసుకుంది. చివర వున్న రాజశేఖరం ఫొటోమీద నిలచిపోయాయి ఆమె కన్నులు. తెంపుకుందామన్నా తెగని అనురాగబంధాలు వెనక్కు లాగుతున్నాయి అలా ఎంత సేపు కూర్చుందో ఆమెకే తెలీదు.

ఎదురుగా వున్న గదితలుపు మెల్లగా తెరచుకుంది. కాత్యాయని చూస్తూన్నది. కలో నిజమో అర్థంలేదు. "కాచీ" అని చేతులు చాపి పరుగెత్తుకుంటూ వచ్చింది రాధిక. కాత్యాయనికి నోటమాట రాలేదు. తాను వచ్చేముందు స్వయంగా కుట్టి తొడిగిన వయొలెట్ రంగు పువ్వుల సిల్కుగౌనులో పుత్తడిబొమ్మ రాధిక! అమాంతం రాధిక నెత్తుకొని ముఖమంతా ముద్దులవర్షం కురిపించింది. "ఎవరితో వచ్చేవు రాధీ!" ఆనందంగా తన ముఖంలోకి చూస్తూన్న రాధికను అడి

గింది కాత్యాయని.

ముందు గది వైపు చూపించింది రాధిక.

నవ్వుతో సొట్టలుపడిన రాధిక చెక్కిళ్ళను పుణికిపుచ్చుకొని వెంటనే గది తలుపు తీసి చూసింది కాత్యాయని. ఎదురుగా ఉష, మధు, సుజాత, రవి! అందరూ రెప్పవాల్చకుండా కాత్యాయని వైపు చూస్తున్నారు.

"ఏమిటిది నిజమేనా!" రాజశేఖరం ఇంట్లో ఒక్క మాటతో అందరికీ జవాబు చెప్పగల కాత్యాయని రెండు గదుల తన చిన్న యింట్లో అందరూ ఒక్కసారి అనుకోకుండా వచ్చేసరికి ఎలా మర్యాద చెయ్యాలో తెలీలేదు. "రండి! లోపలకు రండి! ఇలారా! సుజాతా! రవీ! ఈచాప మీద కూర్చోండి! ఉషా! మధూ! మీరీ పెట్టెమీద కూర్చోండి.... నాన్నగారికి ఒంట్లో బాగుంటూందా?... చెప్పకుండా చెయ్యకుండా అందరూ ఒక్కసారిగా ఇలా వచ్చేశారేమిటి?..."

"నిన్ను చూడాలనిపించింది" అంది సుజాత.

"నువ్వెలా వచ్చావు రవీ"

"నువ్వు ఉద్యోగం చూసుకొని వచ్చేశావని తెలిసి." అన్నాడు రవి.

"ఛీ! నీ యిల్లా ఇది!" అంది రాధిక కళ్ళు పెద్దవి చేసుకొని చుట్టూ చూస్తూ.

"అవును. బాగుందా?"

"మరి నీక్కు పూలమొక్కలూ అవీ లేవు కదా!"

"లేవుమరి. ఏం చెయ్యను! నా యిల్లు చిన్నది."

"మనింటికి వచ్చెయ్!"

కాత్యాయని రాధికను ముద్దుపెట్టుకుంది.

"ఇన్నాళ్ళకు ఇల్లొకటి దొరికింది. ఇంకా హోటల్లోనే తింటున్నాను. టైము తొమ్మిదయింది! పాపం ఏమన్నా తిన్నారో లేదో! నడవండి హోటలుకు వెడదాం!" అంది.

"నాన్నగారు రాగానే వెడదాం!" అంది సుజాత.

"ఏమిటి నాన్నగారు కూడా వచ్చారా!" అని సంభ్రమంతో లేచి నిల్చుంది కాత్యాయని.

"అందరం నాన్నగారి ఫ్రెండు కారులో వచ్చాం! మమ్మల్నిక్కడ దింపి నాన్నగారు ఆయనతో వెళ్ళేరు. ఓ గంటలో వస్తారు" అంది సుజాత.

కాత్యాయని గుండె వేగంగా కొట్టుకోవడం మొదలుపెట్టింది. "పోనీ అప్పటిదాకా పాపం చిన్నపిల్లలేం ఉండగలరు! నేను వెళ్ళి తీసుకొస్తాను." అంది కాత్యాయని.

"నువ్వెందుకు నేను వెడతానుండు." అని రవి లేచాడు. సుజాత మధువైపు చూసి సైగ చేసింది.

"మేం కూడా వస్తాం!" అని మధూ ఉషా కూడా లేచారు. "అయితే మీరు తినేసి మాక్కూడా తీసుకొనిరండి." అంది సుజాత.

కాత్యాయని ఏదో చెప్పబోయే లోపలే రవీ, మధూ, ఉషా బయటకు వెళ్ళిపోయారు.

"నా కాశ్చర్యంగా ఉంది. నన్ను చూడాలని ఉండడం ఏమిటి? అందరూ ఇలా పరుగెత్తుకొని రావడ మేమిటి? రవి ఎలా వచ్చాడు. ప్రమీల ఎక్క

డుంది? అంత మందీ ఎందు కొచ్చారు?"

రాధిక కాత్యాయని ఒడిలో పడుకొని ఆమె చేతి వేళ్ళతో ఆడు కుంటూంది.

"నువ్వు ఇక్కడికి వచ్చేశావు! ఒక్కరోజు తర్వాత సరిగా గడవడం లేదు. రాను రాను 'అంతా అయోమయంగా తయారైంది. ఏ పని చెయ్యాలని పించదు! దేని మీద దృష్టి కుదరదు! ఏ ఆలోచన మొదలైనా చివరకు నీమీద కొచ్చి నిలిచేది!

రవి దగ్గర్నుంచి నెలరోజుల క్రితం ఉత్తరం వచ్చింది. నీకు ఉద్యోగం వచ్చినట్లు తెలిస్తే చేరనివ్వడనే ఉద్దేశ్యంతో ఉద్యోగంలో చేరిన తర్వాత నువ్వు ఉత్తరం రాశావని రాశాడు. మేమందరం నిన్ను ఎలా వెళ్ళనిచ్చేమని అడిగేడు. నాన్న కూడా ఎలా ఊరుకున్నారని అడిగేడు. నేనేమని రాయగలను! మా అందరి భవిష్యత్తులకూ ముడి పెట్టి నాన్న నోరు కట్టేశావు! నాన్న పరిస్థితి రవికి తెలీదు. దూరం ఆలోచించి నువ్వు తీసుకున్న నిర్ణయాన్ని కాదనడానికి నేను జంకేను.

కాని ఆ యింట్లో ఇంక ఒక్కరోజు కూడా నువ్వు లేకుండా గడపడం కష్టమని పించింది. నాన్న నువ్వు వచ్చినప్పటి నుంచి సరిగా ఆఫీసుకే పోవటం లేదు. వేళకు అన్నం పెట్టి పిలిస్తే వచ్చి రెండు మెతుకులు తిని కాసేపు మేడ మీదా, కాస్సేపు తోటలోనూ మరి కొంత సేపు తన గదిలోనూ పడుకొని వేళా పాళా లేకుండా కాలక్షేపం చేసే వారు.

ఆయన మనోవేదన ఎవరితో చెప్పుకుంటారు? ఎవరూ లేరు. నేను వెళ్ళి నాన్నతో కాస్త చనువుగా మాట్లాడుదామను కొనే దాన్ని. నోరువిప్పి ఒకటి రెండు మాటలు మాట్లాడితే నా మాటలు నాకే వినబడు తూన్నట్లుండేది. చెల్లెళ్ళతో కాలక్షేపం చేద్దామను కుంటే మా మధ్య నీమాటే వచ్చేది! అందరం భోజనానికి కూర్చుంటే అప్రయత్నంగా అందరి మనసులోనూ నువ్వే మెదిలి ఒకరి ముఖాలొకరు చూసుకుంటాం!... నాన్న ముఖంచూస్తే నువ్వే కనబడతావు. రాధిక నవ్వుతూంటే దాని అందమైన బుగ్గల్లో నువ్వే కనబడతావు. రవి రాసిన ఉత్తరమంతా నువ్వే, తోటనిండా పూచిన పూలల్లోనూ నువ్వే, ఎలా నిన్ను మరచి పోగలిగేది. ఒకరోజు ఉత్తరం వచ్చింది. ఆ సాయంత్రం తోటలో ఉషా, రాధికా మాట్లాడుకుంటున్నారు. రాధిక బుట్ట పట్టుకొని నిల్చుంది. ఉష పూలుకోసి అందులో వేస్తూంది.

"కాచి మళ్ళీ ఎప్పుడొస్తుందే" రాధిక అడిగింది.

"ఇప్పుడుద్యోగం చేస్తుందిగా! ఎప్పుడో వస్తుంది" ఉష చెప్పింది.

"మనం కాచికి ఉత్తరం రాద్దామా?"

"ఏమని?"

"వచ్చెయ్యమని"

వాళ్ళ సంభాషణ విన్నాను. ఉషకు నువ్వింక రావని తెలుసు. చేసేదిలేక సరిపెట్టుకుంది. కాని రాధికకు ఏమీ తెలీదు. నా మనసుకు ఒకటి నిశ్చయంగా తోచింది. నువ్వు మాతో లేక పోతే నే ఏమయినా కావచ్చని.

మధు అప్పుడే కాలేజీనుంచి వచ్చాడు. వాడి మనసులో ఏ ఆలోచన వుందో నాకు తెలీదు. కానీ మాట్లాడి తీరాలి. నువ్వు చెప్పినట్లు నే ఒకరోజు బయటకు

వెళ్ళవలసి వస్తుంది. ఇంట్లో ఎలా గడుస్తుంది? పసిపిల్లల నెవరు చూస్తారు? నాన్న నెవరు చూస్తారు? ఇప్పటికప్పుడే అన్నయ్య ఉద్యోగంచూసుకొని బయటకు వెళ్ళిపోవలసి వచ్చింది. మరో నాలుగైదేళ్ళుపోతే మధు కూడా బయటకు పోవలసి రావచ్చును. పూర్తిగా స్వార్థ దృష్టితో చూసినా నువ్వు మాతో వుండడం తప్పనిసరి అనిపించింది. దగ్గర వుండవలసిన మనిషిని దూరంగా వుంచుకొని అసలు మరచిపోడానికెందుకు ప్రయత్నించాలి?

"మధూ! కాచిదగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది" అన్నాను.

"నిజంగానా?"

"ఇదిగో!" ఉత్తరం వాడికిచ్చాను. ఆత్రుతగా చదువుకున్నాడు.

నేను వాడితో ఎలా మాట్లాడాలా అని ఆలోచిస్తున్నాను.

"అక్కా! కాచి అక్కడ ఉద్యోగం చేస్తూంది కదా! అది మనం ఇస్తే ఇక్కడే ఉంటుంది కదా!" అన్నాడు.

నేను మాట్లాడదలచుకొన్నదానికి వాడే దారి తీయడం బాగానే ఉందనుకున్నాను,

"జీతం ఇస్తాం మా దగ్గరుండమంటే అవమానం చేసినట్టుకదా!... ఏం కాచి ఇక్కడ ఉండాలని ఉందా నీకు!"

వాడు మాట్లాడలేదు.

"కాచి ఇక్కడ ఒకలా అయితే ఉంటుంది."

"ఎలా?"

"కాచిగా కాదు. మనకు అమ్మగా."

"అంటే?"

"నాన్నను పెళ్ళి చేసుకొని."

వాడు కొంచెంసేపు మాట్లాడలేదు. తరువాత "అయితే ఎప్పుడొస్తుంది?" అన్నాడు.

"నీ కిష్టమేనా?"

అవునన్నట్లు తల ఆడించేడు.

నా ఆనందానికి పట్టపగ్గాల్లేవు. వెంటనే రవికి ఉత్తరం రాశాను. నేను నీకూ నాన్నకూ మధ్య జరిగిన సంభాషణ అంతా విన్నది విన్నట్లు రాశాను. నా అభిప్రాయం కూడా రాశాను. అయితే నాన్నకు చెప్పలేదు.

సరిగా నాలుగు రోజులకు పదినెను వెంటబెట్టుకొని అన్నయ్య వచ్చేశాడు. ఇద్దరం ముఖాముఖీ మాట్లాడుకున్నాం. తన మనసులో ఈ ఆలోచన ఉందనీ, దాన్ని సాహసించి పైకి చెప్పలేకపోయాననీ అన్నాడు. ఆ రాత్రి అంటే మొన్న రాత్రి నాన్న దగ్గరకెళ్ళేను.

"అందరం హైదరాబాదు వెడదాం నాన్నా!" అన్నాను.

"ఎందుకు?" అన్నారు నాన్న ఆశ్చర్యపోతూ.

"కాచిని తీసుకొచ్చేద్దాం" అన్నాను.

"ఎందుకమ్మా?"

"రాధిక కలవరిస్తూంది. నాక్కూడా కాచి లేకపోతే బాగాలేదు. అన్నయ్య కూడా అదే అంటున్నాడు."

"కాత్యాయని ఉద్యోగం చేస్తూంటే ఎలా వస్తుందమ్మా?"

"మానేసి వస్తుంది."

"రాదు. కాత్యాయని ఎన్నటికీ మానేసిరాదు" అన్నారు నాన్న.

"మేం తీసుకొస్తాం."

"అంతబలవంతం చేసి ఆమెను తీసు

కొస్తే లాభం ఏమిటమ్మా ?"

"లేదు నాన్నా ఇష్టపడే వస్తుంది.''

"ఎలా ?''

"ఇటుపైనతానిక్కడుంటే మా భవిష్యత్తు చెడిపోతుందనీ, మేము ఇష్టపడకపోవచ్చుననీ కదా కాచి అనుకున్నది ! నాకు మాత్రం దానికి వ్యతిరేకంగా అనిపిస్తోంది. కాచి ఇంట్లోలేకపోతే అందరూ పిచ్చివాళ్ళయిపోతారేమో ననిపిస్తోంది''

"సుజీ !''

''అవున్నాన్నా! కాచి మమ్మల్లందర్నీ కన్నపిల్లలకంటెఎక్కువగా చూసుకుంది. మేము ఆవిడను కన్నతల్లిలాగా చూసుకుంటాం. అన్నయ్య కూడా ఆవిడను ఎలాగైనా ఇక్కడికి తీసుకురావాలనే ఉద్దేశ్యంతోనే వచ్చాడు నాన్నా !'' అన్నాను.

నాన్ననిశ్చేష్టులై ఉండిపోయారు. ఇంకనేనేమీ అడగలేదు. ఆయన మనసులో పొందుతూన్న ఆనందం గుర్తించాను. బయటికి వచ్చేశాను.

నిన్న బయలు దేరి ఇలా వచ్చేశాం. ఒకసారి నువ్వు నాతో అన్నావు. మీ యింట్లో అందరూ మంచి ముత్యాల్లాంటి వాళ్ళు— కుటుంబం అంటే చక్కని కూర్పుతో ముత్యాలసరంలా ఉండాలని. మేము ఒకవేళ ముత్యాలమే అయినా మా మధ్య దారంలా నువ్వు లేకపోతే మా ఉనికే లేదు. ఇది మాత్రం నిజం.'' సుజాత ఆగింది.

కాత్యాయనికి అంతా ఏదో కలలా అనిపిస్తోంది. ఈ పరిణామాలన్నీ తానెన్నడూ ఊహించనివి.

మరో అయిదు నిమిషాలకు రవీ వాళ్ళూ వచ్చారు టిఫిన్ తీసికొని.

రాధికలేచి వాళ్లకెదురెళ్ళి "నాన్న వస్తున్నారు !'' అని అరచింది.

కాత్యాయని ఒక్క ఉదుటున లేచింది. పిల్లలందరూ లోపలే ఉన్నారు. అప్రయత్నంగా రెండడుగులు వీధి గుమ్మం వైపు వేసింది.

వీధిలో ఆగిన కారులోంచి దిగివస్తూన్న రాజశేఖరాన్ని చూడగానే అంత ఆత్మస్థైర్యమూ చెదిరిపోయింది. శరీరం కంపిస్తోంది. మనసు గాలికి రెపరెపలాడుతూన్న ఆకులా కొట్టుకుంటూంది. పెదవులు వణుకుతున్నాయి. కళ్ళకు అడ్డుగా కన్నీటి తెరలు నిలచి గుడ్డిదాన్ని చేశాయి.

రాజశేఖరం వచ్చి కాత్యాయని భుజం మీద చెయ్యివేశాడు. ఆమెలో విద్యుత్తు ప్రసరించింది. చెక్కిళ్ళమీద నుండి రెండు కన్నీటి ముత్యాలు దొర్లిపోయాయి.

"నేనిది నమ్మలేకుండా ఉన్నాను!'' అస్పష్టంగా గొణిగింది కాత్యాయని.

రాజశేఖరం చుట్టూ చూసేడు. చిన్న ఇంట్లో ఒక చాపా, ఒక పెట్టె పెట్టుకొని వున్న కాత్యాయనిపట్ల అతని హృదయంలో ప్రేమ పొంగిపొరలింది. ఆమెను రెండు చేతులతో దగ్గరకు తీసుకున్నాడు. కాత్యాయని అతని హృదయంపై వాలిపోయింది.





# జగజ్జేతలవుతున్న జర్మన్ క్రీడాకారులు

రెండు ప్రపంచయుద్ధాల్లో సర్వనాశనానికి గురై, రెండుగా చీలిపోయి ఉన్న అతి చిన్నదేశం జర్మనీ గత ఒలింపిక్స్ పోటీలలో పాల్గొని సాధించిన ఘన విజయాలు క్రీడా ప్రపంచాన్ని ఆశ్చర్యపరచాయి. కాని, జర్మనీలో క్రీడారంగానికి ఉన్న గౌరవం, సౌకర్యాలు, శిక్షణావకాశాలు తెలిసిన వారికి ఆ విజయ రహస్యం సులువుగా అర్థమవుతుంది. ఈ నెల 'చతుర' ప్రత్యేకంగా జర్మన్ క్రీడా రంగంలోని వివిధ ప్రక్రియలను ప్రదర్శించే అపురూప ఛాయాచిత్రాలను మీకు అందిస్తోంది. ఈ చిత్రాలకు వ్యాఖ్య అనవసరం.

# బ్లూ రోమియో

ఆస్ట్రేలియా తూర్పు తీరప్రాంతంలో నివసించే 'శాటిన్ బవర్' అనే జాతి పక్షులకి నీలిరంగు అంటే విపరీతమైన వ్యామోహం. అవి తమ గూళ్ళలో రకరకాల వస్తువుల్ని సేకరించి, దాచుకుంటాయి. అయితే, ఆ వస్తువులన్నీ నీలిరంగువే! మగ పక్షులు నీలికళ్ళతో, నీలి రెక్కలతో, బలమైన ముక్కులతో చాలా అందంగా వుంటాయి, ఆడవి మాత్రం కొంచెం ఆకుపచ్చగా ఉంటాయి వీటిలో మగపక్షులకే నీలి వర్ణంమీద వ్యామోహం వుంటుంది. ఇలాంటి విచిత్రమైన లక్షణమున్న ఈ పక్షులకి శాస్త్రజ్ఞులు 'బ్లూరోమియో' అని పేరు పెట్టారు. బ్లూరోమియో పక్షులు గూటిని చాలా తమాషాగా నిర్మించుకుంటాయి. గూటి ఎత్తు ఒక అడుగు వుంటుంది. ఇవి సాధారణంగా ఈ గూళ్ళని నేల మీద'U' ఆకారంలో గడ్డితో నిర్మించుకుంటాయి. అయితే, ఆగూళ్ల ఉత్తర-దక్షిణ దిక్కులకి అభిముఖంగా మాత్రమే నిర్మించుకుంటాయి. ఎ. జె. మాషల్ అనే ప్రఖ్యాత పక్షి శాస్త్రజ్ఞుడు ఒకసారి, గూటి దిక్కుని మార్చి చూశాడు. కానీ, అంతలోనే, బ్లూరోమియో తన గూటిని యథాస్థితికి మరలించుకుని, ఆశ్చర్యపరిచింది. వీటి గూళ్లని పరిశీలించి చూస్తే ఇంకా ఎన్నో వింత విషయాలు ఎదురవుతాయి. కేవలం నీలి రంగుతో మాత్రమే వున్న ఎన్నో రకాల వస్తువుల్ని ఈ పక్షులు తమ గూటిలో ఒక మ్యూజియంలాగా అమర్చుకుంటాయి. ఆ మ్యూజియంలో టూత్ బ్రష్‌లు, పెన్నులు, రబ్బర్లు ఇలా ఎన్నో వస్తువులుంటాయి. ఇలా సేకరించడం, తన సంపద ద్వారా ఆడ పక్షుల్ని ఆకర్షించడానికే అయివుంటుందని శాస్త్రజ్ఞులవూహ. బ్లూరోమియో, తననోటి చొంగని మట్టి, బొగ్గు పొడితో కలిపి, గూటిలోపలి గోడల్ని చక్కగా రంగులతో అలంకరిస్తుంది. ఆడపక్షి గూటిని చూసి ఆకర్షించబడితే, బ్లూరోమియో దాంతో తన మందిరంలో ప్రణయం సాగిస్తుందన్నమాట. ఈ పక్షులు గూళ్ళల్లో గుడ్లు పెట్టడంగానీ,




పొదగడం గానీ, కనీసం పిల్లల్ని పెంచడం గానీ చెయ్యవు. బ్లూరోమియో, కుటుంబానికి సంబంధించి ఏ బాధ్యతనీ తీసుకోదు. తిరుగుబోతులాగా విలాసంగా కొత్తకొత్త ప్రియురాండ్రని వెతుకుతూ విహరిస్తుంటుంది.

బ్లూరోమియోల వింతప్రవర్తన శాస్త్రజ్ఞులకి కూడా చాలా విచిత్రంగా,

అంతు బట్టకుండా వుంది. ఆస్ట్రేలియాలో ఈ పక్షుల మీద విస్తృత పరిశోధనలు జరుగుతున్నాయి. ఇప్పటి మన జులాయి రోమియోలు ఈ బ్లూ రోమియోల వారసులు కాదు గదా!

# ఒంటెతో పోలో

మన కావ్యాల్లో 'అశ్వకందుక క్రీడ' గురించిన ప్రస్తావనవుంది. ఆ క్రీడ ప్రస్తుతం 'పోలో' అని పిలవబడుతోంది.

ఎడారుల్లో, మండిపోయే ఇసుకలో పయనించే ఒంటెలు, జైపూర్‌లోని రాంబాగ్ గ్రౌండులో 'పోలో' ఆటలో పాల్గొంటున్నాయంటే ఆశ్చర్యపోనక్కర్లేదు. ఒంటెలతో పోలో ఆడటం ప్రపంచంలో మొట్టమొదటగా జైపూర్‌లోనే జరిగింది. పోలో ఆటకి సంబంధించి జైపూర్‌కి యాభై ఏళ్ళగా గొప్ప ఖ్యాతి వున్నది. గత ముప్ఫైఏళ్ళలో, రాజస్థాన్ రాష్ట్ర పోలో క్రీడాకారులు 11 సార్లు అఖిల భారత ఛాంపియన్ షిప్ గెల్చుకున్నారు.

స్వాతంత్ర్యానంతరం సైకిల్ తో పోలో ఆడటం యువకుల్లో బాగా పెరిగింది. కిందటేడు రాంబాగ్ మైదానంలో ఏనుగులతో పోలో మ్యాచ్ జరిగింది. బహుశా ఇలాంటిది కూడా ప్రపంచంలో ఇదివరకెక్కడా జరిగి వుండదు. ఆ మ్యాచ్ చూట్టానికి అరవై వేల మంది ప్రేక్షకులు వచ్చారు. చరిత్రాత్మకమైన ఒంటెల పోలో చూడ్డానికి 35,000 మంది వచ్చారు. ఆ మ్యాచ్‌ని బ్రిటీష్ సైనిక పోలో టీమ్ నాయకుడు బొల్సు చూసి "ఇంగ్లాండులో వెయ్యి మంది కూడా రారు, ఇక్కడ ఇలా తండోపతండాలుగా జనం ఎలావస్తున్నారబ్బా!" అని ఆశ్చర్యపోయాడు.

రంగురంగుల రాజస్థాన్ దుస్తులతో ఆకర్షణీయంగా అలంకరించిన తొమ్మిది ఒంటెలు, ఈ పోలో పోటీలో పాల్గొని ప్రేక్షకుల్ని దిగ్భ్రాంతుల్ని చేశాయి. ఆట మొదట్లో ఒంటెలు భారంగా కదిలినా, క్రమంగా వేగాన్ని పుంజుకొని, ఎంతో చాకచక్యం ప్రదర్శించాయి. మధ్యలో ఓ ఒంటె బయటికి వెళ్ళిపోవడంతో, అవసరంకోసం అలంకరించి నిలబెట్టిన ఒంటెల్లోంచి ఒక దానిని మైదానంలో ప్రవేశపెట్టారు.




పోలో క్రీడలో పాల్గొనేందుకు ఒంటెలకి రెండు, మూడు నెలలు శిక్షణ ఇవ్వవలసి వుంటుంది. నిజానికి ఆ శిక్షణ చాలా కష్టసాధ్యమైనది. ఆరున్నర అడుగుల పొడవైన కర్రల్ని, ప్లాస్టిక్ బంతుల్నీ చూసి ఒంటెలు బెదిరిపోయి ఒక పట్టాన మాటవినేవికావు. ఆ కర్రలు వాటిని కొట్టడానికి కాదు అని అవి తెలుసుకునేట్లు చేసేటప్పటికి, శిక్షకులకి తలప్రాణం తోకకు వచ్చేది.

# విపరీత విందు

క్రీస్తుపూర్వం 218-222లో రోమ్‌ను పరిపాలించిన 'హెలియాగ్రబలస్' చక్రవర్తిగారు రోజూ ప్రొద్దున్నే వేయించిన చిట్టెలుకను తృప్తిగా ఆరగిస్తారు. ఆ తర్వాత మధ్యాహ్నం ఉడక బెట్టిన ఏనుగు తొండం. రాత్రికి నిప్పుకోడి వేపుడుతో విందు. ఇందుకోసం కావలసిన జంతువుల్ని ఆయనే స్వయంగా సేకరించుకునేవాడు. ఆయనకి నచ్చనివి అడవి ఎలుకల పులుసు, గొంగళి పురుగుల కూర మాత్రమే!



రోజూ కొందర్ని భోజనానికి ఆహ్వానించి, భోజన పదార్థాలుగా భ్రాంతి కలిగించే గాజు, 'ధంతపు వస్తువుల్ని టేబుల్‌పై పరిపించి, అతిథులను వెర్రి వాళ్ళను చేసి, ఆ విధంగా వినోదించేవాడు.

వారికి వేరే మంచి భోజనం ఏర్పాటు చేసినా, వారు దానితోపాటు సాలెపురుగుల పట్టు నంజుకుని తినటమో, సింహపు లద్దెలు కలుపుకుని ఆరగించటమో చేయాల్సి వచ్చేది. కాదంటే చర్మం ఒలిపించేసాడేమోనని భయం.

ఎలాగోలా భోంచేసి గండం గడిచి గట్టెక్కాంకదా అని ఆ అతిథిదేవుళ్ళు సంతోషించేలోగా భోజనంలో కలిపిన నిద్రమందువల్ల సుఖనిద్రలో మునిగిపోయేవారు. తిరిగి కళ్ళు తెరిచే సరికి భల్లూకపు గుహలో పడుకో బెట్టబడి ఉండేవారు. అంతలో ఓ ఎలుగుబంటు వచ్చేసి వారి వళ్ళంతా వాసన చూసి, చక్కిలిగింతలు పెట్టి వదిలేది. 'బ్రతుకు జీవుడా' అని అక్కణ్నుంచి బయట పడితే చక్రవర్తిగారి పులిలాంటి పెంపుడు కుక్క భయంకరంగా అరుస్తూ తరిమి కొట్టేది. రాజప్రాసాదం గేటు దాటి రోడ్డున పడేవరకు వారి ప్రాణాలకు గ్యారంటీ ఉండేది కాదు.

# సినీ టెక్నిక్

"నీ కొడుకు నా దగ్గర భద్రంగా వున్నాడు అతను కావాలంటే సాయంత్రం ఆరుంబావుకి నటరాజ్ థియేటర్ దగ్గరికి 25,000 రూపాయలు తీసుకుని రా" అని అమర్‌నాథ్ సింగల్ అనే గృహస్థుకి ఓ రోజు ఫోన్ కాల్ వచ్చింది. అప్పటికే నాలుగయింది ఇంకా రెండు గంటల్లోగా పాతికవేల రూపాయిలు కావాలి! ఎలా తేవాలి? ఎక్కణ్నుంచి తేవాలి? అమర్‌నాథ్ తన

సోదరుడు అశోక్‌కుమార్‌తో కలిసి ఫోన్‌ద్వారా ఎంతోమంది స్నేహితులని అర్జంటుగా డబ్బు సర్దుబాటు చెయ్యమని అడిగాడు. చివరికి పోలీసులకి రిపోర్టిచ్చాడు. అంతలో మళ్ళీ ఫోన్ మ్రోగింది. పాతికవేలు కాకపోతే కనీసం పదివేలయినా ఫరవాలేదు అని దాని సారాంశం. అనుకున్న సమయానికి అమర్‌నాథ్ అతని స్నేహితులు వేరువేరు టాక్సీల్లో నటరాజ్ థియేటర్‌కి చేరుకున్నారు. అంతలో ఓ పద్దెనిమిదేళ్ళ



యువకుడు అమర్‌నాథ్ ముందుకు వచ్చి "అమర్‌నాథంటే మీరేనా" అని అడిగాడు. ఔనంటూనే అమర్‌నాథ్ అకస్మాత్తుగా అతణ్ణి గట్టిగా పట్టుకున్నాడు. మరుక్షణం మఫ్టీలోవున్న ఇరవైమంది పోలీసులు అతణ్ణీ, అతని ముఠానీ చుట్టుముట్టేసి, పిల్లవాణ్ణి భద్రంగా వాళ్ళ బారినుంచి ఇవతలకి చేర్చారు. ఆ ఘరానా దొంగల ముఠాలో ఇరవై ఏళ్ళ పద్మనాభన్ అనే యువకుడుకూడా వున్నాడు. అతను అమర్‌నాథ్ కుటుంబానికి చాలా సన్నిహితుడు. "పద్మనాభన్‌కి విపరీతమైన సినిమా పిచ్చి. ఈ మధ్యనే 'సమాధి' అనే సినిమా చూశాడు. అందులో ధర్మేంద్ర, తను ప్రాణాధికంగా ప్రేమించిన భార్య ఆశాపరేఖ్ వైద్యంకోసమని సరిగ్గా ఇలాంటి బందిపోటు పనే చేస్తాడు. పద్మనాభన్ కూడా సరిగ్గా ధర్మేంద్ర పాత్ర ప్రేరణవల్లనే ఇలా చేసి వుంటాడు" అని అమర్‌నాథ్ భార్య అన్నది. సినిమావాళ్ళు ఇంకా ఏవేవో చేస్తారు. అవన్నీ కుర్రకారు చేస్తామంటే...

# పురుషుల ప్రసూతి సెలవు

గర్భవతులైన ఉద్యోగినులు 'ప్రసూతి శలవు' తీసుకోవటం సర్వసామాన్యం. అయితే పురుషులకు కూడా ప్రత్యేకంగా 'పేరెంటల్ లీవ్' అంటూ కొత్తరకం పద్ధతిని స్వీడన్ ప్రభుత్వం ప్రవేశపెట్టింది. మగరాయుళ్ళుకూడా తమ పిల్లలపాలన, పోషణ విషయంలో తగు జాగ్రత్తలు వహించడానికట ఈ శలవు!

ఈ సరికొత్త ప్రయోగం ప్రకారం భార్యా, భర్త కూడా ప్రసవానికిముందు, తరువాత కలిపి 9 మాసాలు శలవు పొందవచ్చు. వీరు ఈ సమయంలో 3 మాసాల శలవును ఆదా చేసుకుని పిల్లవాడికి 8 ఏళ్ళ వయసు వచ్చేలోగా ఎప్పుడైనా మరల ఆ శలవును ఉపయోగించుకోవచ్చు.

1974 లో ప్రారంభమైన ఈ పథకానికి పురుషులనుండి సరైన ప్రోత్సాహం

రాక పోవటంతో ప్రభుత్వం దీన్ని విస్తృతంగా ప్రచారం చేసే కార్య క్రమాన్ని చేపట్టింది.



స్త్రీలు ప్రసవానంతరం ఎదుర్కొనే సమస్యలు, బాధలు కూడా పురుష పుంగవులు గ్రహించి, పాలుపంచుకునేందుకు ఈ పథకం తోడ్పడుతుందని ప్రభుత్వం ఆశ.

## ఆత్మహత్యా రికార్డు

ఆత్మహత్యలకు యూరప్‌లోని హంగేరి ప్రసిద్ధిచెందింది. ప్రపంచంలోకెల్లా ఆత్మహత్యలకు పాల్పడే వారిలో అధిక శాతం మంది ఇక్కడి వారే.

ఇటీవలి సంవత్సరాల్లో ఇక్కడ 4,500 మంది ఆత్మహత్యలు చేసికొనగా 20,000 మంది ఆత్మహత్యకు విఫల ప్రయత్నంచేశారు. ఈ మధ్యే 'జార్గీ' అనే 22 ఏళ్ళ యువకుడు 60 నిద్ర మాత్రల్ని భోంచేసి, తన అంతిమ ఘడియల్ని ఆనందంగా గడిపేందుకు ఇంటి నుండిబైలుదేరినడిరోడ్డుమీద చుట్టచుట్టుకు పడిపోయాడు. అతన్ని అర్జెంటుగా ఆస్పత్రిలో చేర్చి డాక్టర్లు కుస్తీపట్టి బ్రతికించ గలిగారు.

వారానికి 150 డాలర్లు జీతం సంపాదిస్తున్న ఆ యువకుడు 17 ఏళ్ళ అంద మైన చిన్నదాని ప్రేమలో చిక్కుకుని, హోటళ్ళకు, నైట్ క్లబ్బులకంటూ డబ్బు విచ్చలవిడిగా ఖర్చుచేసి, చివరికి ఇంట్లో వస్తువుల్ని మాయంచేయటం సాగించాడట. అతని ప్రేమ వ్యవహారం, ఇంట్లో వస్తువుల గల్లంతు అతగాడి తల్లికి తెలిసిపోవటంతో జార్గీ తన పరువు మర్యాదలు



మంటగలిసిపోయాయని వ్యధ చెంది ఆత్మహత్యకు ప్రయత్నించి అనుకోకుండా బ్రతికి బయట పడ్డాడు.

హంగేరీలో నివాసగృహాల కొరత

వల్లా, సరైన సౌకర్యాలు లేకా యువతీ యువకులు 8 నుండి 10 ఏళ్ళపాటు తమ వివాహాలు వాయిదా వేసుకోవలసివస్తుండటంచేత మానసికంగా కృంగిపోయి, ఆవేదనను భరించలేక ఆత్మహత్యలకు పాల్పడుతున్నట్లు తెలుస్తోంది. హంగేరిలో ఆత్మహత్యలకు పాల్పడనివారులేని కుటుంబం అసలు ఒక్కటి కూడా లేదంటే నమ్మటం కష్టమే మరి.

# మహిళాంతకుడు

అమెరికాలో లాస్‌ఏంజెల్స్ నగరం పేరు చెబితేచాలు ఆడవాళ్ళు గడగడలాడి పోతున్నారు. కారణం, ఇటీవల అక్కడి 12-28 ఏళ్ళ మధ్య వయస్కులైన స్త్రీలు 10 మంది కేవలం ఆరు



వారాల వ్యవధిలో దారుణంగా హత్యగావింప బడ్డారు.

బలవంతంగా ఎత్తుకెళ్ళబడి, మానభంగం పొంది, గొంతు పిసికి చంపబడిన సదరు సుందరాంగుల నగ్న కళేబరాలూ, తునాతునకలైన శరీరభాగాలూ లాస్ ఏంజెల్స్‌లోని కొండ ప్రాంతాల్లో దొరికాయి. ఫలితంగా స్త్రీలు వీధుల్లోకి ఒంటరిగా రాకూడదనీ, తలుపులు, కిటికీలు బిగించుకుని మరీ కూర్చోవాలనీ పోలీసులు పదేపదే హెచ్చరికలు చేశారు. పూర్వం 1962 - 64 మధ్య కాలంలో కూడా ఒక నరాంతకుడు 13 మంది మహిళల్ని ఘోరంగా హత్యచేసిన సంఘటనలు జరిగినా, ఇప్పుడు, ఆరు వారాల్లోనే పదిమంది స్త్రీలు ఈ ఘాతుకానికి గురవటం ప్రజలను భయభ్రాంతుల్ని చేసింది.

ఇంతమందిని క్రూరంగా హింసించి చంపిన ఆ ప్రాణాంతకుడు సన్నగా, పొడుగ్గా ఉండే 28ఏళ్ళ యువకుడే నట!

# సర్కస్ లైఫ్

సర్కస్ కళాకారుల జీవితం కత్తిమీద సాము. నిప్పులమీద నడక. వాళ్ళదో వింత ప్రపంచం.

రోజూ తెల్లవారి 6 గంటలకే వ్యాయామం ఉంటుంది. రెండుసార్లు భోజనం, కాఫీ, టిఫెన్, దుస్తులు అన్నీ ఉచితమేకాక నెలకు నాలుగొందల జీతం. ఇతర పట్టణాలకు వెళ్తే పగలంతా ఊరు చుట్టి వచ్చేందుకు, సరదాగా ఫుట్‌బాల్ లాంటివి ఆడుకునేందుకు వీలుంటుంది. సీనియర్ కళాకారులకు దగ్గర్లోని హోటళ్ళలో ప్రత్యేక వసతుల ఏర్పాటు ఉంటుందట. కానీ, ఎన్నిఉన్నా సర్కస్ ప్రదర్శన ప్రారంభమైనప్పుడు పులి

నోట్లో తల దూర్చినట్లేకదా !

బఫూన్ పని ఆడియన్స్‌ని నవ్వించటమే కాదు. అతడు మిగతా కళాకారులు చేసే అన్ని రకాల ఫీట్స్ చేయగలిగి ఉండాలి. ప్రతి ఫీటులోనూ వారు మృత్యువుకి దగ్గరగా వెళ్ళి పలకరించి వస్తుంటారు.

ఓసారి ఒక సర్కస్ బేబీ సింహం నోట్లో తలదూర్చే అంశం ప్రదర్శిస్తోంది. సింహంగారు అప్పుడెందుకో కోపంగా ఉన్నట్లున్నారు. కటుక్కున ఆ అమ్మడు తలని కొరికి నజ్జు నజ్జు చేసిందట.

# గాలి కబుర్లు

ఊపిరాడకపోతే తప్ప మనం గాలిని గురించి బొత్తిగా పట్టించుకోం. కాని శాస్త్రజ్ఞులు గాలిని 13 రకాలుగా విభజించారు. వేగాన్ని బట్టి అది ఏ రకంగాలో తెలుసుకోవచ్చునట.

నిప్పునుండి వచ్చేపొగ, నిట్ట నిలువుగా లేచే 'నిలబడి వీచేగాలి' వేగం గంటకు మైలుకంటే 'ఎక్కువ ఉండదు. ముఖాన్ని ముద్దుపెట్టు కున్నట్టు మీకు స్పర్శానుభూతిని కలిగించే పిల్లగాలి వేగం 4-7 మైళ్ళు, పతాకాలు రెపరెపలాడి, చెట్ల ఆకుల్ని అల్లల్లాడించే పడుచు గాలి వేగం 8-12మైళ్ళు ఉండవచ్చు.

వీధుల్లో దుమ్ము రేపుతూ చిన్న చిన్న చెట్ల కొమ్మల్ని ' తల వొంచేటట్లు· చేసే అల్లరిగాలి వేగం 13-18 మైళ్ళు, చెట్లను కుదిపేస్తూ వీచేగాలి వేగం 19-24 మైళ్ళు ఉంటుంది.

బయట గొడుగుల్ని ఎగరగొట్టేస్తూ టెలిఫోను తీగల్ని కీచు మనిపించే పహిల్వాన్‌గాలి వేగం 25-31మైళ్ళు. వృక్షాలన్నీ ఊగుతూ, మిమ్మల్ని ముందుకు అడుగు వేయనీయ కుండా వెనక్కి నెట్టేస్తూన్నట్టుండే గాలి తప్పకుండా 32-38 మైళ్ళు వేగం ఉండి తీరుతుంది.

చెట్ల కొమ్మల్ని విరగ్గొడుతూ వీచే గాలి వేగం 39-46మైళ్ళట. ఇళ్ళ కప్పలను ఎగర గొట్టేస్తుండే పెనుగాలి వేగం 47-54మైళ్ళు. మహావృక్షాల్ని సైతం



కూకటి వేళ్ళతో పెకలించి, కట్టడాలను కూల్చివేసే ప్రచండ వాయువు వేగం 55-63మైళ్ళు.

సమస్తాన్ని నేల మట్టం చేస్తూ వీచే విధ్వంసక ప్రళయ మారుత వేగం 73-136మైళ్ళు. మరి ఇవన్నీ ఉత్త గాలి కబుర్లే ననగలమా?



# స్నేహితురాలికి మీనా చేసిన సహాయం.



















రోజుకు రెండుసార్లు న్యూట్రామూల్ తీసుకునే అలవాటువలన లాభిస్తుంది చివరికి. అందుకే దేశమందంతటా కేవలం వేలమంది బలాన్నిచ్చే న్యూట్రామూల్ వాడడం మొదలెట్టారు.

న్యూట్రామూల్‌లో బలవర్ధకమైన, మీగడ గల అమూల్ పాలతోబాటు అసలైన కోకో, మాల్ట్, పంచదార ఉన్నాయి.

అరే ఆశ్చర్యం! న్యూట్రామూల్ ఖరీదులో తక్కువ! న్యూట్రామూల్ 500 గ్రాముల డబ్బా ధర కేవలం రూ. 11. పన్నులు అదనం. మీనాకే గాదు ఇంకా మరెందరికో న్యూట్రామూల్ అంటే ఎంతో యిష్టం.

**అమూల్ వారి**

# న్యూట్రామూల్

**కప్పు కప్పుతో మీకు బలం వచ్చు!**




daCunha/N/2q/Tel

# రచయితలకు ఆహ్వానం

జాతి జీవిత సమగ్ర చిత్రాన్ని విభిన్న కోణాల నుండి దర్శించి, పాఠకులకు దర్శనీయం చేయగల ఉత్తమ నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది.

* నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలుండాలి. అచ్చులో 'చతుర'లో ఒక పేజీకి సుమారుగా 260 పదాలు వస్తాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత వరకూ కుదించవలసివచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* నవలలు తెలుగుదేశపు వాతావరణంతో, తెలుగువారి సమకాలీన జీవిత చిత్రణగా ఉండటం అవసరం.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయితనుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతోసహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నికకాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే ప్రతి నవలకూ పారితోషికం రచననుబట్టి రు. 1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుదినిర్ణయం.

**చతుర**

ఈనాడు కాంపౌండ్ సోమాజిగూడ హైదరాబాద్–500 004

Edited, Printed and Published by Ramoji Rao Ch for Vasundhara Publications Printed at Colorama Offset Printers, Hyderabad. Office Address : CHATURA Telugu Monthly. Eenadu Compound, Somajiguda, Hyderabad500 004

